# నాలుగు మందులుగల 'అనాసిన్' కంటె ఎక్కువ శీఘ్రముగా పనిచేయునది ఇంకేదీ లేదు

**1. క్వినైన్ సల్ఫేట్ 2. ఫినాసిటిన్**
**3. కఫీన్ 4. అసిటిల్ సాలిసిలిక్ ఏసిడ్**

'అనాసిన్'— గొప్ప బాధానివారిణి — వైజ్ఞానికంగా కూర్చబడిన నాలుగు మందులను గలిగియున్నది, అవి నరముల ముఖ్యస్థానములందు సంయుక్తచర్యను జరిపి, తలనొప్పులు, జలుబులు, జ్వరము, దంతబాధ, కండ నొప్పులనుండి దూరిగా, సురక్షితమైన శీఘ్రవిముక్తిని గలిగించును. బాధానివారణకు 'అనాసిన్' కంటె అతివేగముగా పనిచేయునట్టిది మరేదీ లేదు. సేవించుటకు 'అనాసిన్' కంటె అతిసురక్షితమైనట్టిది మరేదీ లేదు. జ్ఞాపకముంచు కొనుడు! 'అనాసిన్' వైద్యుని ఔషధయోగము వంటిది. అది గుండెలకు హానిగాని కడుపు ఉబ్బరముగాని కలిగించదు. 'అనాసిన్' లక్షలాది జనులకు బాధానివారిణి ఎందుకనగా ప్రతివారును 'అనాసిన్' ను కొనగలరు. ఒక ప్యాకెట్ ధర 2 అణాలు మాత్రమే.

**నాలుగు మందుల సూత్రమైన 'అనాసిన్' వాడుడు**




V 100




సంక్రాంతి రథం

ముగ్గు చిత్రం వేసినవారు :— టి. ఎస్. బి. ప్రభ—రాజమండ్రి.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



సచిత్ర వారపత్రిక
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 31
సంచిక 20
16-1-57

దుర్ముఖ పుష్య శుద్ధ పూర్ణిమ బుధవారం


## విషయానుక్రమణిక

ముఖ-చిత్రం : అలంకరణ
చిత్రకారుడు : కె. రాంబాబు


| | |
|---|---|
| సంక్రాంతి | 5 |
| గురితప్పిన ఉరి | 6 |
| మాయమైన అమ్మాయి | 12 |
| సంక్రాంతి సరదా | 17 |
| అలంకరణలో పాతకొత్తలు | 22 |
| ముగ్గుచూడు, ముగ్గందముచూడు | 25 |
| సంక్రాంతి ఆటలు | 26 |
| ఒరిస్సాలో రకరకాల ముగ్గులు | 28 |
| విష్ణుచక్రము | 29 |
| అవిసి పువ్వు | 30 |
| ఉత్కళ మహిళల ముగ్గుల తీరులు | 32 |
| చాప<br>పున్నాగ గుత్తులు | 34 |
| రత్నకంబళి<br>పెండ్లి అరుగు | 35 |
| గుమ్మడిపూలు<br>ద్రాక్ష పందిరి<br>తీగలముగ్గు | 36 |
| సంక్రాంతి శంఖం | 37 |
| మొలకువ | 42 |
| సంక్రాంతి [గేయం] | 44 |
| బుడుగు! చిచ్చుల పిడుగు | 46 |
| బావామరదళ్ల సరసాలు | 48 |
| శ్రీరాముని జీవితగమనము | 49 |
| చింకిచొక్కా | 50 |
| సినిమా | 52 |
| న్యూఢిల్లీ లేఖ | 59 |


# ఆనందపర్వమ్

సున్నం శారదాదేవి

పైరు పచ్చల చీరగట్టీ,
బంతిపూవుల అవికదొడిగీ,
చిన్ని వెన్నెల నవ్వుతో, వ
చ్చినది సంక్రాంతి!

పైరగాలీ, పంటచేలూ,
పసిమి మిసమిసలాడు పూలూ,
వలచుకొని, అడుగడుగునా, ధర
పరిమళించినది!

తనువు పులకలదేల, అచ్చపు
తెనుగుదనమూ, తేనెపలుకులు
తేటపడ, పొలిగలుగు రైతుల
పాట వినిపించెన్.

ఎల్లెడల హరిదాసు తంబుర
అల్లువెట్టిన రసశ్రుతితో
పూరిగుడిసే, బారుమేడా
మారు మ్రోగినవి!

తెలుఁగు పడుచులు తీర్చిదిద్దిన
వెలుఁగు ముగ్గుల విలాసములో
గడపగడపా, కళామయమై
ఎడద లూగించెన్!

గంగిరెద్దుల కంచుగంటల
ఘణఘణలలో, వాడవాడా
నాటి సీతారామ కళ్యా
ణమ్ము పొల్చుకొనెన్!

ప్రణయ దేవులకొఱకు వేచీ,
కనులు కాయలుగాచిపోయిన
క్రొత్త ముత్తైదువుల వలపుల
కలలు పండినవి!

అప్పుడపుడే అరుగుదెంచిన
బావగారిని సరసమాడే
చిన్నిమరదలి కనులలో వికసించె నందాలు!

రథముపై నూరేగుచుండిన
బొమ్మలకేదొ నూతన
చేతనత్వము వచ్చెనన నిక
జనుల మాటేలా?

ఎందుఁజూచిన అందమే, ఆ
నందమే మై, విశాలాంధ్రం
స్వర్గకైలాసాల సౌఖ్యం
మొగ్గ దొడిగినది!

## ★ మొదటి బహుమతి డిటెక్టివ్ కథ ★

ఉలెన్ సూటు ధరించాడు. చెవుల మీదుగా మఫ్లర్ బిగించి కట్టుకున్నాడు. నోట్లో సిగరెట్టు వెలుగుతోంది. అతనికి బాహ్యచింతనే లేనట్టుంది. నోట్లో సిగరెట్ నోట్లోనే మెల్లిగా కాలి, హరించుకుపోతోంది. పెదిమలు ఒక్కసారిగా చుట్టుముట్టాయి. సిగరెట్టు అప్రయత్నంగానే క్రిందపడిపోయింది. ఒక్క ఉదుటున లేచి కూర్చుని క్రిందపడ్డ సిగరెట్, కార్పెట్‌కి వేసి బూటుకాలుతో పరపరా రాసి క్రొత్త సిగరెట్టంటించాడు.

నారాయణగారు తెల్లవారేసరికి చనిపోయి వున్నాడు. ప్రాతఃకాలాన్నే స్నానాదికాలు నిర్వర్తించుకుని అల్పాహారం చేయడం ఆయన అలవాటు. ఎప్పుడూ లేనిది ఆయన ఆరోజు లేవలేదు. ఏక్షణంలో జరుగవలసిన దాక్షణంలో జరుగకపోతే ఆయనకి చాలా కోపం వస్తుంది. ఏమాత్రమాలస్యమయినా, ఆలస్యానికి కారణభూతులైనవారిని క్షమించలేడు. 'ఇది ఏమిటా ఈరోజు' అనుకుంటూనే సుబ్బన్న సైముకు "కాఫీ ట్రే" పుచ్చుకుని తెర త్రోసుకుని ప్రవేశించాడు. నారాయణగారింకా నిద్రలేవలేదు. లేపుదామా! వద్దా! అని రెండు నిముషాలు తటపటాయించి, క్రిందకు వెళ్ళి చిన్నమ్మగారిని తీసుకు వచ్చాడు. ఇందిర తండ్రిచేయి పుచ్చుకుని లేపబోయింది. ఆయనశరీరం కట్టెలా బిగుసుకుపోయి వుంది. ఆయన అంతరాత్మ అంతరిక్షాని కెప్పుడో ఎగిరిపోయింది.

ఆనంద్ పోలీసులకు ఫోను చేశాడు. ఇన్‌స్పెక్టరు రమణ సంగతి స్థూలంగా వివరించి సరాసరి నారాయణగారింటికి రమ్మనమని రాజుకి ఫోనుచేశాడు.

కారు మెల్లిగా ఆగింది. డ్రైవరు వచ్చి తలుపు తెరచి పట్టుకున్నాడు. రాజు కారు దిగగానే, మఫ్టీలో వున్న పోలీసు శాల్యూట్ చేశాడు. రాజు అతన్ని చిరునవ్వుతో పలుకరించి భవనంలోకి దారితీశాడు.

నారాయణగారు పెద్ద మిల్లుఓనరు. రోజూ వేలమీద వ్యాపారం చేస్తారు. లక్షలకి లక్షలు ఆయన ఇనుపపెట్టెలో మూల్గుతున్నాయి. మనిషి చాల నిక్కచ్చి. ఆయనంటే ఇంట్లో అందరికీ హడల్! ఆయన కుమారుడు ఆనంద్. పేరుకు తగ్గట్టు ఉత్తి విలాసరావు. ఎప్పుడూ కారులో వూరిమీద తిరుగుతూనే వుంటాడు. సినీమాలకీ, డ్రామాలకీ డబ్బు రెండుచేతులా గుప్పేస్తాడు. మిత్రుడు ప్రభాకరంతో కలిసి చాటుమాటున త్రాగుతాడని, గుఱ్ఱప్పందేలకు డబ్బు పుష్కలంగా వెచ్చిస్తాడని వినికిడి. ఆనంద్ అంటే నారాయణగారి కేమంత ఇష్టంలేదు. ఆస్తి అతనికి రాస్తే, లొందరగా హరించుకుపోతుందని ఆయనకి భయం. ప్రభాకరంస్నేహం మాని దుర్వ్యసనాలు విసర్జించకపోతే, ఆస్తిలో గుడ్డిగవ్వైనా దక్కనివ్వనని బాహాటంగానే చెప్తూండేవారు. కాని ఆనంద్ ఇది ఏమీ అంత పట్టించుకునే వాడుకాడు. ఒక్క నవ్వు నవ్వేవాడు.

కమలమ్మగారిదీ మొదట్లో కలిగిన కుటుంబమే. రానురాను కలిమి కానరాకుండ పోయింది. తమ్ముడు కమలాకరాన్ని తీసుకువచ్చి మిల్లులో మేనేజరుగా వేయించింది. అతనికి కూతుర్నివ్వాలని కమలమ్మగారి అభిలాష. కానీ నారాయణరావుగారికి మాత్రం ఈ వియ్యమేమాత్రం ఇష్టంలేదు. ఇందిరకు మాత్రం కమలాకరమంటే తగని మక్కువ. విశాలమైననుదురు, కొనదేలిన నాసిక, మేలిమి బంగారానికి మెఱుగులుదిద్దే దేహచ్ఛాయ, క్రొద్దిగా క్రిందకి వాలి దేన్నికూడా అంటీ అంటనట్లు చూసే పెద్ద కన్నులు, వదనంలో స్ఫుటాస్ఫుటంగా వుండే సన్నని విచారరేఖ, ఐదడుగుల పది అంగుళాల పొడుగు, పొడుగుకు తగ్గ లావు కల్గి, జగత్తంతా మిథ్యని తీవ్రచింతన చేసే వేదాంతిలా వున్న మేనమామను చూస్తుంటే, ఆమెకు గిలిగింతలు పెట్టినట్లుండేది. ఎంతసేపు చూసినా చూడాలనిపించేది.

సావడిలో ప్రవేశించేసరికి, రమణ ఇందిరనేమో ప్రశ్నిస్తున్నాడు. ఆమె ప్రక్కనే కమలమ్మగారు, ఎదురుగా మరొక సోఫాలో ఆనంద్ కూర్చుని వున్నారు. వాళ్ళందరి ముఖాల్లోను విచారంకంటె భయమే ఎక్కువగా కన్పిస్తోంది.

రమణ లేచి రాజుతో కరస్పర్శచేసి, తీసుకువెళ్ళి తనప్రక్కన కూర్చోబెట్టుకుని అందరినీ పరిచయంచేసి, తనకు తెలిసినంత వరకూ వివరంగా తెల్పాడు.

హతుడు నిద్రపోతున్నట్లు మంచంమీద వెల్లకిల పడుకుని వున్నాడు. గది చాల విశాలమైనది. పెద్దపెద్ద బీరువాల్లో పుస్తకాలు అందంగా అమర్చి వున్నాయి. కిటికీలకు రంగురంగుల అద్దాలు, చక్కని సిల్కు తెరలు వున్నాయి. నేలంతా నున్నని పాలరాతి గచ్చు. ఆగచ్చు, ముఖం చూసుకుని తల దువ్వుకోవచ్చునంత నున్నగా వుంది. ఏమూలా చిన్న కాయితపు ముక్కైనా లేకుండా గదిఅంతా అద్దంలా శుభ్రంగా వూడ్చివుంది. వంకీలనుండి నాలైదు ఖరీదైన సూట్లు మడతన్నా చెదరకుండా వ్రేలాడుతున్నాయి. ప్రక్కనేవున్న బట్టలస్టాండు మీద ఖద్దరుసిల్కు లాల్చీ, ధోతీవున్నాయి. నారాయణగారికి పారిశుద్ధ్య విషయంలో వుండే పట్టుదల ఎంతవారికైనా ఆశ్చర్యమానసులను జేస్తుంది.

గదిమధ్యలో చిన్న గుండ్రని బల్లవుంది. దానిమీద నాలైదు పుస్తకాలు ఒకదానిపై నొకటిగ దొంతరగా పెట్టివున్నాయి. దొంతర ప్రక్కన లెటరు హెడ్డు, కలం, రూళ్ళకఱ్ఱ, కాగితాల నదిమిపట్టే గాజుదిమ్మ వున్నాయి. పడుకుని చదువుకునేందుకు వీలుగా, వరండాలోకి వెళ్ళే ద్వారంవైపు త్రిప్పిన పడకకుర్చీ, టేబిలుపై ఆనుకుని రాసుకోవడానికి వీలుగా ఒక పేముకుర్చీ వున్నాయి. వస్తువులన్నీ అతినిరాడంబరతను సూచించేవైనా రమణీయంగా అలంకరింపబడి గదికి విశిష్ట సౌందర్యాన్ని చేకూరుస్తున్నాయి.

ఆ గదిలోనుంచి ప్రక్కనే ఆనుకునివున్న ఆఫీస్‌గదిలోకి త్రోవవుంది. ఈ రెండు గదులనూ వేరుచేస్తూ ద్వారాలైతే లేవు, కానీ వీథిగుమ్మానికున్నట్లే చక్కని డిజైన్లు కుట్టిన సిల్కు తెరలు, రెండు భాగాలుగా వుండి ఇరువైపులకు త్రిగింప వీలైనవి వున్నాయి.

హతుని పడకప్రక్కనే చిన్నస్టూలు. స్టూలుమీద సగంవరకూ నీటితో నింపిన గాజు కూజా, మూత, గాజుగ్లాసు, రెండు స్లీపింగ్ పిల్సు వున్నాయి. ఒకమూల ఇనపపెట్టె వుంది. అన్నింటినీ ఆమూలాగ్రంగా పరిశీలించి హాలులోకి తిరిగివచ్చారు. ఒక్కొక్కళ్ళనే పిలచి ప్రశ్నించడం మొదలెట్టారు.

* * *

"అయితే నారాయణరావుగార్ని నువ్వే ఆఖరిసారి చూశావన్నమాట?"

"చిత్తమండి." ముందుకు కొద్దిగా వంగి నుంచుని వినయంగా చేతులు కట్టుకుని సుబ్బన్న జవాబిచ్చాడు.

# ★ గురితప్పిన ఉరి ★

"ఎన్ని గంటలకి?"

"ఎనిమిది గంటలకండి."

"సరిగ్గా ఎనిమిది గంటలకా?"

"అవునండి."

"అంత కచ్చితంగా ఎల్లా తెలుసు?"

"బాబుగారు చాల కచ్చితమయిన మనిషండి. సరిగ్గా ఎనిమిది కొడుతోందనగా మంచినీళ్లు గదిలో పెట్టాలండి. తరువాత ఎంతో అవసరమైతేతప్ప, మళ్ళీ ఎవరూ ఆయనగదిలో కెళ్ళగూడదండి."

"అయ్యగారు ఎన్నింటికి పడుకుంటారు?"

"తొమ్మిది గంటలకండి."

"పడుకోబోయేముందు మంచి నీళ్ళేమైనా త్రాగుతారా?"

"త్రాగుతారండి."

"నువ్వు చూసినప్పు డెల్లావున్నారు?"

"మామూలుగానే వున్నారండి. పుస్తక మేదో చదువుకుంటున్నారు."

"ఏ కుర్చీలో కూర్చున్నారు?"

"పడకకుర్చీలోనండి."

"నీతో ఏమైనా మాట్లాడారా?"

"లేదండి. తలకాయెత్తిచూసి, మళ్ళీ చదువుకోడం మొదలెట్టారండి."

"మళ్ళీ తెల్లవారి మొదటకూడా నువ్వే చూశావన్నమాట."

"అవునండి. బాబుగారు చాల పొద్దుండగానే లేస్తారండి. స్నానం, జపం చేసుకుని కాఫీ తాగుతారండి. ఈ వేళ ఎంతకీ లేవకపోతే, ఏమిటా ఇది అనుకుంటూ కాఫీ పుచ్చుకు లోపలికెళ్ళానండి, బాబుగారు పిలిచినా పలక్కపోతే, క్రిందకు వెళ్ళి చిన్నమ్మగార్ని పిలుచుకు వచ్చానండి."

"నువ్విక్కడెన్నాళ్ళనుంచి పని చేస్తున్నావ్?"

"సుమారు ముప్ఫయేళ్ళ నుంచండి."

"నీకు తెలసినంతవరకు అయ్యకి విరోధు లెవరైనా వున్నారా?"

"అది నా కెల్లా తెలుస్తుందండి?"

"ఆయ నెటువంటాయన?"

"కోపమైతే ముక్కుమీ దుంటుందిగాని, మనసు వెన్నపూస కదండి! అంత మంచి మనిషిని నాజన్మంలో చూడలేదండి."

సుబ్బన్న పైగుడ్డలో కన్నీ ళ్ళొత్తుకున్నాడు.

"సరే. నువ్వెళ్ళి మీ చిన్నమ్మగారిని పంపు."

"చిత్తమండయ్యా" సుబ్బన్న నమస్కరించి వెళ్ళిపోయాడు.

*　　*　　*

"మీరు మీ నాన్నగారి నెన్నింటికి చూశారు?"

"5-45 అవుతుందండి."

"చాల ప్రొద్దుండగానే అన్నమాట."

"అవునండి. మాఇంట్లో అందరం పెందలకడనే లేస్తాం, లేకపోతే మా నాన్నగారికి కోపంవస్తుంది."

"తరవాత?"

"సుబ్బన్న వచ్చి 'బాబుగారేమిటో కేకేసినా లేవటంలేదు రం'డనిచెప్పి తీసుకు వెళ్ళాడండి, నే వెళ్ళి నాన్నగారి చేయి పుచ్చుకుని, లేపబోయాను. చేతికి చల్లగా తగిలేసరికి భయమేసి, అమ్మను కేకేశానండి"

ఆమె భయంతో కొంచెం వణికింది. కను పాపలు చలించాయి.

"గదిలో దేనైనా ముట్టుకొన్నారా?"

"లేదండి."

"ఇంకేమయినా మీరు చెప్పదలచుకున్న దుందా?"

"లేదండి."

"సరే మీ అమ్మగార్ని పంపండి."

*　　*　　*

"మీ కెవరిమీదనైనా అనుమాన ముందా కమలమ్మగారు?"

"ఇదంతా నా ప్రారబ్ధం కాకపోతే, ఇంకా అనుమాన మేమిటండి," అంది ఆవిడ అరచేతితో నుదుటిమీద కొట్టుకుంటూ.

రమణ రెండు క్షణాలాగి మళ్ళీ ప్రశ్నించాడు.

"మీ సుబ్బన్నెటువంటివాడండి."

చాల నమ్మకస్తుడండి. మాయింట్లో నేను కాపరానికి రాకపూర్వంమండి వుంటున్నాడండి. ఆయనంటే సుబ్బన్నకి ప్రాణమండి. సుబ్బన్న చేత్తో ఇచ్చినది, విషమైనా సరే, ఆయన సందేహించకుండా త్రాగేస్తారండి."

"అయితే, ఆసరా చూసుకుని సుబ్బన్న విషమియ్యడానికేం అవకాశం లేదుకదా?"

"రామ! రామ! ఆ మాట కలలోకూడ తల పెట్ట కూడదండి."

"మీ వంటవాడు?"

"వాడిదేముందండి? ప్రొద్దున్న వస్తాడు; వంటచేసి వెళ్ళి సాయంత్రం మళ్ళీ వంట చేసి పోతాడు."

"మీరు సాయంత్ర మెన్నింటికి భోం చేస్తారు?"

"ఏడు గంటలకల్లా చేస్తామండి."

"అంటే ఏడు గంటలదాకా వంటమనిషి వుంటాడన్న మాట."

"అవునండి."

"సుబ్బన్నకి తెలియకుండా వంటవాడు, నీళ్లలో విషం కలుపకూడదూ?"

ఆమె ఒక్క క్షణ మాలోచించింది. "అవకాశ ముందిగాని, వంటవాడు ఆయనకు విష మీయవలసిన అవసర మేముందండి?"

"ఇంట్లో సామానేమయినా పోయినట్లుందా?"

"సామానేం పోయినట్లు లేదండి. డబ్బు విషయంమాత్రం మా తమ్ముడు వస్తేగాని తెలియదండి."

"తమ్ముడంటే?"

"కమలాకరమండి."

"ఓహో మీ మిల్లులో మేనేజరుగా వుంటోన్నాయనా?" అన్నాడు అంతవరకూ నిశ్శబ్దంగా వింటూ కూర్చున్న రాజు.

"అవునండి"

"అతనికి మీ అమ్మాయిని ఇద్దామను కున్నా రనుకుంటాను?"

"నే ననుకున్నానండి. కాని మా వారి కిష్టంలేదు." నీ పని కానీయ మన్నట్లుగా చూశాడు రాజు రవణకేసి. రమణ రెండు క్షణాలు ఆలోచించుకుని మళ్ళీ మొదలెట్టాడు.

"మీ కెవరిమీదా అనుమానం లేదా? బాగా జ్ఞాపకం చేసుకోండి. ఈ మధ్యెప్పుడన్నా మీ వారెవరితోనైనా ఘర్షణ పడ్డారేమో!"

ఏదో జ్ఞాపకానికి వచ్చినట్లు ఆమెకళ్లు మిలమిల మెరిశాయి.

"చెప్పండి సందేహించక"

"ఘర్షణేమీ లేదు కానండి, నిన్న నాల్గు గంటలకి మా వాడు..."

"మావాడంటే?"

మధ్యలో ప్రశ్నించాడు రవణ.

"ఆనందండి. ఐదు వేలు కావాలని అడిగాడండి. ఆయనకిచాలకోపంవచ్చింది. 'డబ్బంతా సుఖప్రం దేలకూ, చీట్లాటలకూ, స్నేహితులకూ తగులబెడుతున్నావు. నీకాస్తిలో దమ్మిడీ కూడా దక్కకుండాచేస్తా ఫో' అంటూ గట్టిగా కేకలేస్తూ, గబగబా మేడదిగి వచ్చారండి. క్రిందికి వచ్చేటప్పటికి ప్రభాకరం కన్పించాడండి. ఆయన మరీ రెచ్చిపోయి, 'నీమూలానే నాకొడుకు చెడిపోతున్నాడు. ఈ సారింటికివస్తే పిస్తోలుతో కాలుస్తాను ఫో' అని వళ్ళు మరిచిపోయి మాట్లాడారండి. అత నెఱ్ఱబడ్డ ముఖంతో వెళ్ళిపోయాడు."

"ప్రభాకరం గురించి మీకేం తెలుసు?"



తూర్పార

ఫొటో: లంకా సూర్యనారాయణ—గొట్టిపాడు.

# ★ గురితప్పిన ఉరి ★

"నాకేం తెలియదండి. మావాడికోసం తరచు వస్తూ వుంటాడు."

"అతని ప్రవర్తనేమన్నా?"

"ఆ విషయమేమీ తెలియదండినాకు."

"ఇంతకు ముందెప్పుడన్నా ప్రభాకరాన్ని కేకలేశారా మీ వారు?"

"ఆనంద్‌ని కేకలేసేవారుకానండి, ఎదుటపడి ప్రభాకరాన్నెప్పుడూ కేకలెయ్యలేదండి."

"మీ తమ్ముడిని ఒకసారి పంపండి."

"అతను లేడని చెప్పాకదండి. నిన్న సాయంత్రం మెయిలుకు విశాఖపట్టణం వెళ్ళాడు."

"అయితే రాగానే, మాకు కబురు పంపండి. వెంటనే రమ్మనమని అతనికి టెలిగ్రాం కొట్టండి."

"అల్లాగేనండి."

* * *

చిరునవ్వుతో ప్రవేశించాడానంద్. కుర్చీ ఒకటి దగ్గరకు లాక్కుని కూర్చున్నాడు.

"మీరు నారాయణగారి కుమారులా?"

అవునండి."

"పేరు?"

"ఆనంద్."

"ఏంపని చేస్తున్నారు?"

"ఏం లేదండి. బి. ఏ. పోయింది. అప్పటి నుంచి ఇంట్లోనే వుంటున్నా."

"ఉహూ. మరయితే మీకు...పాకెట్ మనీ......?"

"నాకు కావలసినపుడల్లా, మా నాన్నగారే యిస్తారండి. లేకపోతే మా అమ్మగారి నడిగి తీసుకుంటాను."

"మీ నాన్నగారు అడిగినప్పుడల్లా ఇస్తారా?"

"ఇన్నాళ్ళూ ఇచ్చేవారండి. ఈమధ్య కసురుకొంటున్నారు."

"నిన్నా, మొన్నా, ఏమన్నా కావాలని అడిగారా?"

"అవునండి. నిన్న అయిదువేలు కావాలని అడిగాను."

"ఇచ్చారా?"

"లేదు."

"ఏం?"

"నా స్నేహితుడు, నేను కలసి డబ్బంతా తగలేస్తున్నామని ఆయన అనుమానం."

"స్నేహితుడంటే?"

"ప్రభాకరం."

"ఏవిధంగా?"

"బి. ఏ. లో క్లాసుమేట్సుం."

"ఆ సమయానికి అతనెక్కడున్నాడు?"

"క్రింద వరాండాలో కూర్చుని."

"అంటే మీ నాన్నగారతన్ని చూచి ఉండవచ్చన్న మాట."

"నే డబ్బడిగితే, కోపం వచ్చి వాకింగ్ స్టిక్ తీసుకు క్రిందకు దిగివచ్చారండి. అప్పుడు చూచి...కోపంతో ఇష్టం వచ్చినట్లు మాట్లాడారండి. 'ఈసారి ఇంటికివస్తే పిస్తోలు పుచ్చుకు కాలుస్తా'నన్నారండి."

"ఉహూ. మరి ఆయనేం జేశారు?"

"ఏం చేయలేదండి. లేచి వెళ్ళి పోయారు."

"మరి మీరు?"

"నాన్నగారలా వెళ్ళగానే, నేకూడా బయటకు వెళ్ళి అతన్ని కలుసుకున్నానండి."

"నిన్న సాయంత్రం మీరెక్కడున్నారు?"

"ఆరు గంటలదాకా, బీచిలో ఉన్నామండి. తరవాత నేనింటికి వచ్చి, కాఫీ త్రాగి కారు తీసుకు తొందరగా సినిమాకి బయలు దేరాను."

"ఒక్కరే వెళ్ళారా?"

"లేదండి. పార్కు దగ్గర ప్రభాకర్ వెయిట్ చేస్తున్నాడు."

"ఏం సినిమా?"

"వంశోద్ధారకుడు."

"పరశురామాలోనా?"

"అవునండి."

"మధ్యలో మీరుగాని, మీ మిత్రుడుగాని బయటికెప్పుడన్నా వెళ్ళారా?"

"లేదండి."

"మీ నాన్నగారు విల్లేమైనా వ్రాసినట్లు తెలుసా?"

'రాసేరో లేదో తెలియదుగాని, రాస్తే ఏం వ్రాస్తారో మాత్రం తెలుసు."

"ఏం వ్రాస్తారు?"

"నాకేం ఆస్తి వుండదు"

"ఏం?"

"నేను డబ్బు దుర్వ్యయం చేస్తున్నానని మా నాన్నగారి అనుమానం. నా కొక్క గుడ్డి గవ్వ కూడా దక్కనివ్వనని చాలాకాలం గానే చెప్పేవారు. ఆయన చెప్పేది ఒకటి చేసేదీ ఒకటీ కాదు. చెప్పినంతా, బ్రహ్మం

ప్రాచీన ధర్మశాస్త్ర గ్రంథాలాదేశిస్తున్నాయి. ఇది బాగా శీతాకాలంలో వచ్చే పండుగకనక ఈ విధమైన దానధర్మాలకు ప్రాముఖ్యం ఏర్పడి ఉండవచ్చును.

## కోడి పందాలు

ఏది ఏమైనా సంక్రాంతిఅంటే విందులకు వినోదాలకు పెట్టింది పేరు. పల్లెప్రాంతాలలో ఈ రోజుల్లో కోడి పందాలు, జూదాలు చాలా జోరుగా సాగుతాయి. ఈ మధ్యన దేశం కొంచెం తెలుగు మీరిన తరవాత కోడిపందాలమీద మోజు తగ్గిందేమో గాని పూర్వం కోడిపందాల సందడి చూసి తీరవలిసిందే!

## భోగిమంటలు

భోగిమంటలంటే చిన్నపిల్లలకు చాలా సరదా! ఈ భోగిమంటల్లో వెయ్యడానికవి పిల్లలు చిన్న చిన్న పిడకలదండలెన్నో జాగ్రత్తచేస్తారు. భోగినాడా దండలన్నీ భోగిమంటల్లో వేసి చలి కాచుకుంటూ చుట్టూరా గుమిగూడతారు.

## పగటివేషాలు

ఈనాడివిబాగా ప్రచారంలోవున్నాయో లేవోగాని పూర్వం పగటి వేషగాళ్ళు పండుగరోజుల్లో ఇంటింటికీ తిరగడం ఒక పరిపాటిగా ఉండేది. వీరు చక్కని హాస్య ప్రసంగాలతోను, వేష భాషలతోను, అందర్నీ నవ్విస్తూ మామూళ్ళుపట్టుకుపోతారు.

## గొబ్బిళ్ళు

పెళ్ళికాని ఆడపిల్లలకు గొబ్బిళ్ళు పెట్టుకోవడం, ప్రతిరోజు ఉదయం వాటికి పూజ చెయ్యడం ఒక పెద్ద సరదా!

"మొగలీ పువ్వంటీ మొగుణ్ణియ్యావే!
చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే!"

అని ఎంతో వినసొంపుగా పాటలు పాడుతూ ఆడపిల్లలు గొబ్బిళ్ళ చుట్టూ తిరుగుతూంటే చూడ వేయికన్నులు చాలవు!

ఇంతకుపూర్వం మనకెన్నో సంక్రాంతులు వచ్చాయి, వెళ్ళాయి. కాని ఈ సంక్రాంతిలో ఒక గొప్పవిశేషం ఉంది.

## కొత్త సంక్రాంతి

ఇన్నాళ్ళనించీ వేర్వేరు రాష్ట్రాలలో విడిపోయిన తెలుగువారంతా ఈ పండుగ నాటికి తిరిగి ఒక ఇంటివారైనారు. మహాంధ్ర రాష్ట్రావతరణం జరిగిన తరవాత మనకువచ్చిన పెద్దపండుగ ఇదే!

ఈ పండుగ తెలుగువారందరికీ కన్నుల పండుగ కాగలదని ఆశిద్దాము.

—వినాయక.

# ..గురితప్పినదరి..



కె. అమ్మిరాజు

నున్నటి సిమెంటురోడ్డుమీద షెవ్రొలెట్ కారు నిశ్శబ్దంగా జెట్టీలా జారుతూ పోతోంది. శీతకాలపు చలిగాలి కిటికీ తలుపులలోంచి తెరలు తెరలుగాలోనికి త్రోసుకువస్తోంది. దట్టంగా పట్టివున్నమంచు అప్పుడప్పుడే విడిపోతోంది. రోడ్డుప్రక్క చిక్కని పచ్చిక మైదానంపై తెల్లని తుషారబిందువులు సూర్యకిరణాల్లో మెరుస్తున్నాయి.

రాజు దీర్ఘాలోచనపరుడై వెనుక సీట్లో వెనుకకు చేరబడి కూర్చుని వున్నాడు. ఖరీదైన


..టోపి


టైరు పేలినా, చక్రం విరిగినా సరే....
ముం దిక్కడినుంచి పోతే.... అబ్బ!
ఇదంతా పీడకలేమో.... అట్టే కాదు.
ఇంకా వళ్లు ఝల్లుమంటోంది.
3


గోరీ మూతతీస్తుందని
భయపడ్డా.... పొరపా
టైంది.


దారుణమైన పొరపాటు....హూ. మనమకాం
ఇక్కడని బైటవాళ్లకి తెలీకూడదు ...
ఈపిల్ల మళ్ళీ రాకుండా ఉండాలి.
ఏమో! ఎవరికన్నా
చెప్తే? మనం
జాగ్రత్తపడాలి.
6
6-6
CONTINUED-



(ఇంకా ఉంది)

# ఒకమాట

సంక్రాంతి సంచికను సాధ్యమైనంత ఆకర్షణీయంగా తయారుచేయడానికి ప్రయత్నించాము. ఈ ప్రయత్నంలో ఎంతవరకు కృతకృత్యులమైందీ నిర్ణయించవలసిన వారు పాఠకులదే.

సంక్రాంతి పండుగ దేశం ధనధాన్య సమృద్ధమై విలసిల్లే సమయం; ఇంటింటా ఆనందోత్సాహాలు వెల్లివిరిసే సమయం; పేదవారు, భాగ్యవంతులు అనే వ్యత్యాసం లేకుండా ప్రతి ఇల్లూ, ప్రతివీధీ, ప్రతి ఊరూ ముత్యాల ముగ్గులతో విరాజిల్లే సమయం. ధనుర్మాసం ప్రారంభమైనప్పటినుంచీ గృహాలంకరణ కార్యకలాపాలలోనూ, రంగు రంగుల రంగవల్లులను తీర్చిదిద్దడంలోనూ ప్రతి గృహిణికీ ఓపినంతపని వుండడం సహజం.

తెలుగువనితల, బాలికల రచనాశక్తిని ప్రోత్సహిద్దామన్న ఉద్దేశంతోనే వారికి ప్రత్యేకించి ముగ్గుల పోటీని, 'స్త్రీల అలంకరణాలు పాతకొత్తల పరిశీలన' అనే విషయంపై వ్యాసరచన పోటీని ఏర్పాటు చేశాము. పోటీకి సరిగా 948 ముగ్గులు వచ్చినవంటే ఆంధ్ర మహిళలు, బాలికలు ఎంత అపూర్వమైన ఉత్సాహాన్ని ప్రదర్శించారో గ్రహించవచ్చు. ఉత్తమమైనదని తోచిన ఒక ముగ్గుకు మాత్రమే బహుమతి ఇద్దామని మొదట నిర్ణయించి నప్పటికీ, వనితలు కనబరచిన అపరిమితోత్సాహందృష్ట్యా రెండవ బహుమతి కూడా ఇవ్వాలని నిర్ణయించాము. ముగ్గుల పోటీలోనూ, వ్యాసరచన పోటీలోనూ బీహారు, బెంగాలు, ఒరిస్సా, మైసూరు, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలోను, ఢిల్లీ నగరంలోనూ నివసిస్తున్న వందలాది ఆంధ్ర మహిళలుకూడా పాల్గొనడం ముదావహమైన విషయం. మొదటి బహుమతి, రెండవ బహుమతి పొందిన రెండు ముగ్గులతోపాటు మరికొన్ని అందమైన ముగ్గులను కూడా ఇదే సంచికలో ప్రచురిస్తున్నాము. మిగతా ముగ్గులలో యోగ్యమైనవని తోచిన మరికొన్నిటిని కూడా ఇకమీద వారం వారం ప్రచురించడానికి ప్రయత్నిస్తాము; ముగ్గుల పోటీలో మొదటి బహుమతి వచ్చిన శ్రీమతి ఎన్. వెంకాయమ్మను, రెండవ బహుమతి గెలుచుకున్న శ్రీమతి పి. గాయత్రిని అభినందిస్తున్నాము. అపారమైన ఉత్సాహంతో పాల్గొని ఈ పోటీని జయప్రదం చేసిన సోదరీమణులందరికీ ఇవే మాకృతజ్ఞతాపూర్వక అభినందనలు. స్త్రీల అలంకరణపద్ధతులపై వ్యాసరచన పోటీక 82 వ్యాసాలు వచ్చినవి. ఇవి ఇంత తక్కువసంఖ్యలో రావడానికి కారణం, బహుశా ఎక్కువమంది వనితల దృష్టి ముగ్గులపోటీమీద కేంద్రీకృతం కావడమే కావచ్చు. వనితల వ్యాసాలకు, వ్యాసంగాలకు వార పత్రికలో ఎక్కువ స్థానం ఇవ్వాలన్నదే మా ఉద్దేశం. ఇందుకు అనుగుణంగా వనితలు ఇకమీద వారం వారం విరివిగా రచనలు పంపి మా ఆశయసిద్ధికి తోడ్పడతారని ఆశిస్తున్నాము.

పోటీ వ్యాసరచనలో బహుమతి పొందిన శ్రీమతి మతుకుమల్లి సుశీలకు ఇవే మా అభినందనలు. బహుమతి రాకపోయినప్పటికీ ఇతర వ్యాసాలలోకూడా కొన్నిటిని అప్పుడప్పుడు ప్రచురించాలని ఉద్దేశిస్తున్నాము.

ఇకపోతే, డిటెక్టివ్ కథల విషయం. పోటీకి మొత్తం 158 డిటెక్టివ్ కథలు వచ్చినవి. ఈ రచయితలలో పైన చెప్పిన ఇతర రాష్ట్రాలలో నివసిస్తున్న తెలుగువారుకూడా వున్నారు.

ఈ కథానికలలో అనేక వాటిలో దేశీయమైన వాతావరణం లోపించినట్లు కనిపిస్తుంది. ఏదో ఒక విధమైన కృత్రిమ ధోరణి ద్యోతకమవుతుంది. ఈకథలతీరే ఇంతని చెప్పలేము. మనదేశంలో కూడా హత్యలు, రకరకాల నేరాలు జరుగకపోవడం లేదు. ఆ నేరాలను, వాటి పరిశోధనలలో మన వారు అవలంబించే దేశీయమైన పద్ధతులను శ్రద్ధగా పరిశీలిస్తే కధా రచనకు కావలసిన ఇతివృత్తాలుగాని, కల్పనాంశాలుగాని లభ్యం గాకపోవు.

డిటెక్టివ్ కథానికల పోటీలో పురుషులు మాత్రమే పాల్గొంటారేమోననుకున్నాము. కొంతమంది రచయిత్రులు కూడా పాల్గొనడం విశేషం.

వచ్చిన కథలలో ఉత్తమమైనవని తోచిన రెండిటికి బహుమతులు నిర్ణయించాము. మిగతావాటిలో మంచివని మాకుతోచిన కథలను సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురించి పాఠకులకు అందజేయదలిచాము. కథలపోటీలో ప్రథమ, ద్వితీయ బహుమానాలు పొందిన శ్రీ కే. అమ్మిరాజు(తిరుపతి), శ్రీ కె. శ్రీమన్నారాయణ (పెద్దాపురం) గార్లను అభినందిస్తున్నాము.

ఆంధ్ర వారపత్రికలో ఒకేసారి మూడు రకాల పోటీలను నిర్వహించినప్పటికీ, ఈ పోటీల నిర్వహణను జయప్రదం చెయ్యడంలో మాకు ఉత్సాహంతో తోడ్పడిన రచయితలకు, రచయిత్రులకేగాక, చక్కటి చిత్రాలు, మంచి గేయాలు ఇతర కథానికలు పంపి తోడ్పడినవారందరికీకూడా మా కృతజ్ఞత తెలియజేస్తున్నాము.

—ఎడిటర్.

## సంక్రాంతి బహుమతులు

మొదటిబహుమతి డిటెక్టివ్ కథ [రూ. 50/-]
గురి తప్పిన ఉరి—కె. అమ్మిరాజు (తిరుపతి)

రెండవబహుమతి డిటెక్టివ్ కథ [రూ. 30/-]
మాయమైన అమ్మాయి—కె. శ్రీమన్నారాయణ [పెద్దాపురం]

ప్రథమ బహుమతి ముగ్గు [రూ. 20/-]
ఎన్. వెంకాయమ్మ [కుయ్యేరు]

ద్వితీయ బహుమతి ముగ్గు [రూ. 15/-]
పి. గాయత్రి [గుంటూరు]

బహుమతి వ్యాసం [రూ. 20/-]
మతుకుమల్లి సుశీల [తిరుపతి]

## మనవి

ఈవారం స్థలాభావంచేత "శ్రీరామరక్ష, మాంత్రికుడు మాండ్రేక్, మంత్రాలు నమ్మకాలు శీర్షికలు నిలిపివేశాము. వచ్చేవారం యథాప్రకారంగా వాటిని ప్రచురిస్తాము.

19-వ పేజీలో చిత్రం రచించినవారు శ్రీ రెయికేలి, విశాఖపట్నం అని పాఠకులు గ్రహించ ప్రార్థన.

# సంక్రాంతి

మన పండుగలన్నిటిలోకీ సంక్రాంతి చాలా పెద్ద పండుగ.

సంక్రాంతినాటికి మన ధాన్యలక్ష్మి నట్టింటికి చేరుకుంటుంది. రైతులందరికీ ఈ నాటితో బాగా తీరిక ఏర్పడుతుంది. అందరి చేతుల్లోను, కొద్దో గొప్పో డబ్బు ఆడుతూంటుంది. ధాన్యపు వర్తకులకు, మిగిలినవారికి ఇవి బాగా గిరాకీ రోజులు.

ఎంతటి దూరదేశాల్లో ఉన్నా బంధువులందరు ఈనాటికి స్వస్థలాలు చేరుకుంటారు. కొత్త అల్లుళ్ళందరు అత్తవారిళ్ళకు వెళ్ళే సందడిలో ఉంటారు. కొత్త పెళ్ళికూతుళ్లు చిరుసిగ్గులతో వారి రాకలకోసం ఎదురుచూస్తూంటారు. ఇక విద్యార్థులమాట వేరే చెప్పనే అక్కరలేదు. సంక్రాంతి సెలవలలో వారికి పూర్తిగా ఆట విడుపే.

పండుగ దగ్గిర పడుతున్న దనగానే మహిళలంతా గృహాలంకరణలలోను, తదితరాలంకరణలలోను మునిగిపోతారు. మన వాకిళ్లన్నీ పండుగనాటికి చిత్రవిచిత్రమైన ముగ్గులతోను, తోరణాలతోను, కలకలలాడుతూంటాయి.

ఇక గంగిరెద్దులవాళ్లు, సాతాని జియ్యర్లు మొదలైనవారి కోలాహలాని కంతేలేదు.

మనవారు మకర సంక్రాంతి మహాపర్వదినంగా భావిస్తారు. కర్కాటక సంక్రమణం మొదలుకొని ఆరు మాసాల వరకు మనకు దక్షిణాయనం. మకర సంక్రాంతిలో ఉత్తరాయణం ప్రారంభిస్తుంది. మాసమాసానికీ సూర్యుడొక కొత్త రాశిలో ప్రవేశిస్తూనే ఉంటాడు. కాని ఉత్తరాయణం ప్రారంభించే సంక్రాంతి కనక మకర సంక్రాంతి కింతటి ప్రాముఖ్యం వచ్చింది.

భోగి, సంక్రాంతి, కనుము, ముక్కనుము, అని సంక్రాంతి పండుగ నాలుగు రోజాలు జరుపుతారు.

భోగినాడంతా తలంటి నీళ్లోసుకుని కొత్త బట్టలు కట్టుకుంటారు.

భోగినాడు కొందరు చిన్న పిల్లలకు భోగిపళ్లు పోస్తారు. భోగిపళ్ళంటే రేగుపళ్లన్న మాట.

సంక్రాంతికే పెద్ద పండుగ అని ఇంకో పేరుంది. ముఖ్యమైన పండుగ వేడుకలన్నీ ఈ వేళే జరుగుతాయి.

## బొమ్మల కొలువులు

సంక్రాంతి పండుగలలో బొమ్మల కొలువు పెట్టడం మన దేశంలో చాలా కాలంనించి అనూచానంగా వస్తున్న సంప్రదాయం. ప్రాచీనకాలంలో ఇవి నేటి మన శిల్పప్రదర్శనాల ధోరణిలో ప్రారంభమై ఉండవచ్చును. కొందరీ బొమ్మలకు పూజలుచేసి నైవేద్యాలు పెడతారు. పేరంటాళ్ళను పేరంటాలకు పిలుస్తారు. ఆంధ్రదేశంలో సామాన్యంగా బొమ్మల కొలువులేని ఇల్లంటూ కనిపించదు. కొంచెం ఉన్నవారయితే పెద్ద ఆట్టహాసంతో బొమ్మల కొలువు లేర్పాటు చేస్తారు. సామాన్యులయితే సంసార పక్షంగా బొమ్మల కొలువు పెట్టుకుంటారు. అంతే నేగాని మొత్తంమీద బొమ్మల కొలువులేని ఇల్లంటూ తెలుగు దేశంలో కనబడదు.



"హారీలో రంగ హారి"

చిత్రకారుడు: జి. నారాయణరావు—విజయవాడ.

## పుణ్యకాలం

మకరసంక్రాంతి నాటినించీ సూర్యుడుత్తరాభిముఖంగా ప్రయాణం ప్రారంభించడంవల్లనే ఉత్తరాయణమనే పేరేర్పడింది. అందుచేత ఈ సంక్రమణం చాలా పుణ్యకాలమని మన సాంప్రదాయికులంటారు. అందుచేత పితృదేవతల కిది చాలా ముఖ్యమైన కాలం. బాగా ప్రాచీన సంప్రదాయా లనుసరించేవారీరోజుల్లో పితృదేవతల ప్రీతికోసం దానధర్మాలు చెయ్యడంకూడా కద్దు.

ఈనాడు, నువ్వులు, గుమ్మడికాయలు, నెయ్యి మొదలైనవి బీదలకు దానం చెయ్యాలని మన

డం తల్లక్రిందులైనా, చేసి తీరతారు."

"మరి మీ విషయం?"

"నా కేచింత లేదండి. డబ్బుంటే జల్సా చేస్తా, లేకపోతే నిశ్చింతంగా వూరట్టుకు తిరుగుతా. అది కాకుండా, మా వాళ్ళు అలక్ష్యం చేస్తారనే అనుమాన మేమాత్రం లేదు నాకు."

"మీ మేనమామను గురించి ఏమన్నా చెప్తారా?"

"మా మిల్లు మేనేజరు. మా చెల్లి కతనంటే ఇష్టం. వ్యవహారంమీద విశాఖపట్టణం వెళ్ళాడు. వస్తాడు," అన్నాడు విసుగ్గా.

రాజు తనలో తను నవ్వుకున్నాడు.

* * *

"నిన్న కాపలా కాసినది నువ్వేనా?"

అవునన్నట్లుగా గూర్ఖా బుఱ్ఱ ఆడించాడు.

"రాత్రంతా జాగ్రత్తగా కాపలా కాశావా?"

గూర్ఖా మళ్ళీ బుఱ్ఱాడించాడు.

"నువ్వు లేనప్పుడు, గేటు దగ్గర ఎవరుంటారు?"

"చాలసేపు నేనే వుంటానండి. నే భోజనానికి వెళ్ళినప్పుడు మాత్రం మా కుర్రాడుంటాడు. నే కూడా మా గుమ్మంలోంచి ఓ కంటితో చూస్తూనే వుంటా."

"మీ ఇల్లెంత దూరం?"

"కేకేస్తే వినిపిస్తాదండి."

"నిన్న సాయంత్రం ఎవరెవరు లోపలికి వెళ్లారో, బయటికివచ్చారో జ్ఞాపకముందా?"

గూర్ఖా బుఱ్ఱాడించాడు.

"అయితే చెప్పు."

"అయ్యగారు తిరిగివచ్చిన కొద్దిసేపటికి, చిన్నయ్యగారు వచ్చి మళ్ళీ తొందరగా కారు మీద వెళ్ళిపోయారండి తరవాత ఒక గంటకు కమలాకర్ గారు వెళ్ళారు......"

"నడిచేనా?"

"అవునండి. తరవాత 8½ గంటలకు చిన బాబుగారు కార్లో వచ్చారు..."

"చిన బాబుగారా? నువ్వు గుర్తుపట్టావా?"

"మా కారులో బయటికి వెళ్ళిన చిన బాబుగారుకాక, కారులో ఎవరు వస్తారు?"

"నువ్వు గుర్తు పట్టావా?" రెట్టించాడు రమణ.

గూర్ఖా కొద్దిసేపూరుకుని "బాగా చలిగా వుందని ముఖంనిండా మఫ్లర్ చుట్టుకున్నారు. కార్లో వెలుతురు కూడా సరిగ్గా లేదు. అయినా ఆయన చినబాబుగా రనడానికి మాత్రం సందేహం లేదు."

"కారులో ఇంకెవరైనా వున్నారా?"

"లేరండి. ఆయన ఒక్కరే."

"ఊ."

"మళ్ళీ అరగంటలో తిరిగి వెళ్ళిపోయి, తరవాత సినిమా వదిలిన కాసేపటికి మళ్ళీ వచ్చారండి."

"ఎనిమిదిన్నరకు చినబాబు వచ్చి, మళ్ళీ అరగంటలో వెళ్ళాడన్నది ఖాయమేనా?"

గూర్ఖా బుఱ్ఱాడించాడు.

"సరిగ్గా ఎనిమిదిన్నర గంటలకు?"

"అవునండి."

"నీ దగ్గర గడియారం వుందా?"

"లేదు."

"అయితే, అంత కచ్చితంగా ఎల్లా తెలుసు?"

"బాబుగారి కారును లోనికి విడిచి నే గేటు మూసేస్తూంటే, ఒకాయన సైకిలు మీద వెడుతూ ఆగి, అగి అడిగాడండి. టయిమెంతయిందని అడిగితే గడియారం చూసి చెప్పాడు."

"చిన్నయ్య తప్పితే ఇంకెవరూ రాలేదంటావ్?"

"రాలేదండి."

"గోడదూకి ఎవరన్నా రావడానికి వీలుందా?"

"తొమ్మిది అడుగుల ఎత్తు గోడ దూకడం కష్టమండి."

"సరే నువ్వెళ్ళివచ్చు." గూర్ఖా శాల్యూట్ చేసి వెళ్లిపోయాడు.

తరువాత వంటవాణ్ణి పిలిచి ప్రశ్నించారు. ఎంత తరచి తరచి ప్రశ్నించినా నాకేం తెలుసుబాబూ, ప్రొద్దునే వస్తాను, పోతాను. మళ్లీ సాయంత్రం వస్తాను, పోతాను. ఈ కాలమంతా నాకు వంటకూ వడ్డనకే సరిపోతుంది అన్నాడు. అంతకంటే భోగట్టా లాగలేక విసుగెత్తి అతణ్ణి పొమ్మన్నాడు.

"అందర్నీ ఎగ్జామిన్ చేశాం బ్రదర్" అన్నాడు రమణ రాజుకేసి చూసి.

"ఒక్క కమలాకరం తప్ప."

"అతను లేడుగా, రాగానే, మళ్లీ వద్దాం."

* * *

నీటిలో కలిపిన విషం త్రాగడంవల్లా, దానికితోడు స్లీపింగ్ పిల్సు వేసుకోవడం వలన రాత్రి 10 గంటలు ఒంటిగంటమధ్య నారాయణగారు మరణించివుంటారని శవ పరీక్షలో తేలింది. విషం శక్తివంతమయినది. నాలైదు గంటలలో ప్రాణంతీస్తుంది. సాయంత్రం రాజు, రమణ సావకాశంగా కూర్చుని సిగరెట్లంటించారు.

"నీళ్ళు సుబ్బన్న గదిలో ఎనిమిదింటికి పెట్టాడు కనుక, ఆయన తొమ్మిదింటికి పడుకుంటారుకనుక విషప్రయోగ మీవ్యవధిలోనే జరిగివుండాలంటావు?"

"వంటవాడు వంటగదిలో కెవరూ రాలేదన్నాడు. సుబ్బన్న నీళ్లు నూటిగా తీసుకెళ్ళి నారాయణగారి గదిలో పెట్టానన్నాడు. దానికితోడు శవపరీక్షలో తేలింది కూడా తీసుకు ఆలోచించిచూడు."

ఇద్దరూ నిశ్శబ్దంగా ధూమ మేఘాలు కల్పించసాగారు.

"రాజా! నువ్వు గమనించావో లేదో ఆ ఇంట్లో నారాయణగారంటే ఎవరికీఅంత సానుభూతి వున్నట్టుగా లేదే?"

రాజు చిరునవ్వు నవ్వాడు. "ఆ ఇంట్లో ఎవరికీకూడా ఆయనంటే పడదు. అడిగినప్పుడల్లా డబ్బివ్వడని కోపం కొడుక్కి. ఇందిరను, తమ్ముడి కివ్వడానికి ఒప్పుకోడని కోపం కమలమ్మగారికి. మేనమామను అలక్ష్యం చేస్తున్నాడని కోపం ఇందిరకు. ఇంక ఆయన "కేరక్టరు"లో సహజదోషాలుండనే వున్నాయి. చీటికీమాటికీ చిఱ్ఱుబుఱ్ఱులాడడం అతి పంక్చువల్ గా ఉండడం, కోపంవస్తే వళ్లుమరచి, మంచీ మర్యాదా లేకుండా మాట్లాడడం, నిజానికి ఆ ఇంట్లో అంతా ఆయనంటే భక్తిలేని భయంతో ఎప్పు డీపీడ విరగడవుతుందా అన్నట్లు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకున్నారు. ఆయనంటే సానుభూతి ఏమన్నా వుంటే సుబ్బన్నకే."

"బలేగావుందే ఇది. కొడుకు, కూతురు, భార్య, నమ్మకస్థుడయిన బంటు. అంతా కావలసినవాళ్ళే. అందరికీ ఆయనంటే మళ్ళీ సానుభూతి తక్కువే. ఇంతకీ హత్యెవరు చేసుంటారు చెప్మా!"

"ఇంకా ప్రభాకరం, వంటవాడు వున్నారుగా?"

"ప్రభాకరం వట్టి కుందేలు. వంటవాడికి హత్యచేయవలసిన అగత్యమేమీ లేదు. నాకొక్క చిన్నసందేహం ఇంతవరకూ వున్న ఆధారములనుబట్టి ఆనంద్ ను ఎందుకు అరెస్టు చేయకూడదు?"

"తొందరపడి అరెస్టుచేస్తే, డిఫెన్సువారి మనకేసు నిలవదేమోనని అనుమానం ఇంకా ఋజువులకోసం ప్రయత్నించాలి. ఆనంద్ ప్రభాకరుల గత చరిత్రకు గట్టిప్రయత్నం చేయించు."

408 వచ్చి శాల్యూట్ చేశాడు, రమణ అతనికేసి తిరిగాడు.

(61-వ పేజీ చూడండి)

డిటెక్టివ్ పోటీ కథ

# మాయమైన అమ్మాయి

కె. శ్రీమన్నారాయణ

రెండవ బహుమతి

ఆవేళ శనివారం. అప్పుడే భోజనంచేసి సావిట్లో కొచ్చాను. 'ఒరేయ్! శంకరం' అంటూ పిలిచాడు వీధిలోంచి సుబ్బిగాడు.

కొంచెం ఆశ్చర్యం వేసింది - ఎందుకంటారేమో - 'ఏదీ కానివేళ - అంటే వాడికేసుమండీ, రాత్రి ఎనిమిది గంటలప్పుడు, పనిగట్టుకు వచ్చాడేమి చెప్మా' అనుకుంటూ 'రారా లోపలికి' అన్నాను.

'అలా పోదాం రా' అన్నాడు.

వాడూ, నేనూ చిన్నతనం నుంచీ స్నేహితులం. ఒకస్కూల్లోనే చదువుకున్నాం. ఒక్కసారేస్కూల్ ఫైనల్ పాస్ అయ్యాము. రెండు సంవత్సరాలు యిద్దరం కలిసి ఖాళీగా తిరిగాము. వాడి అదృష్టమే అనాలో దురదృష్టమే అనాలో తెలియదుకాని ఎస్. ఎన్. ఎమ్. కోర్టులో గుమాస్తా ఉద్యోగం దొరికింది. దేదీప్యమానంగా వెలిగించేస్తున్నాడు వాడి జీవితాన్ని ఆఫీసులో రాత్రింబవళ్లు! నేనుమాత్రం ఇప్పటికీ నిరుద్యోగినే. అందుకే ఈ అయిదారు నెలల్నుంచి వాడూ నేనూ కలసి తృప్తిగా మాట్లాడుకోవడం జరగలేదు. ఎప్పుడైనా బజార్లో కనబడితే 'ఛస్తున్నాననుకో. పెద్ద ఉద్యోగం, యిదీని' యిప్పుడు మళ్ళీ పోవాలి, భోజనంచేసి' అనుకుంటూ వెళ్ళిపోయేవాడు.

'అలాంటిది యీవేళ ఇంత సావకాశంగా వచ్చాడు కదా' అనే సంతోషంతో గబగబా బట్టలేసుకుని, బయటికి వచ్చాను. ఇద్దరం బయలుదేరాం.

మిత్రులుగా మాఇద్దరిమధ్యా వుండే సన్నిహితత్వము ఆత్మబంధువుల మధ్య సన్నిహితత్వముకంటె గొప్పది. అలాగే మా ఇద్దరికీ ఇంకొక నేస్తానికీ అలాంటి సన్నిహితత్వమే ఉన్నది. అది మా వూరిమధ్య రాతిచెఱువు.

నాలుగువైపులా నాలుగు ఫర్లాంగు లుంటుంది. గట్టులో చాలభాగం రాతితో కట్టడంవల్ల ఆపేరు వచ్చివుండవచ్చు. ముందు వేసవిలోనయితేం నిండుగర్భిణిలా కనిపిస్తుంది నీటితో. నీటిమీద బాగా వ్యాపించిపోయిన పచ్చని తామరాకుల మధ్య ఎర్రటి తామర పువ్వులతో చాల శోభాయమానముగా ఉంటుంది. అనువుగా ఉన్న ప్రదేశాలలో నుంచొని, చేపలకోసం జపాలు చేసే కొంగలు కనిపిస్తాయి పగటివేళ.

మేము రోజూ సాయంత్రమో, రాత్రి భోజనాలు చేసిన తరవాతో దీని గట్టుమీదకు వచ్చి మాకున్న అనేక సమస్యలను చర్చించుకొనే వాళ్ళం. మా మధ్య వుండే ఏ ఆంతరంగిక విషయమూ మా నేస్తానికి తెలియనిదికాదు. అందుకే మేం ఫలానా చోటికి ఇళ్ళాలని నిశ్చయించుకోకుండానే

మా కాళ్లు చెఱువుగట్టుమీదకి తీసికొచ్చే శాయి.

సుబ్బిగాడు ఉద్యోగంలో చేరినతర్వాత మే మిద్దరం కలసిరావడం యిదే ప్రథమం.

మబ్బుల్ని చీల్చుకొని వచ్చిన చంద్రుని కిరణాలు చెఱువులోని నీటిమీదపడి ప్రతిబింబించి 'మీ రిద్దరు కలసి ఎన్నాళ్ళకి నా దగ్గరకు వచ్చారు' అని సంతోషంతో ఘక్కున నవ్వినట్టయింది. చల్లగా వీస్తున్న పిల్లగాలులు అంతవరకూ యింకా చెవుల్లో గింగురు మంటూన్న బజారుగోలని ఒక్కసారి తుడిచేశాయి. 'మమ్మల్ని ఆప్యాయంగా ఆహ్వానిస్తున్నదా?' అన్నట్టు చెఱువులోని నీరు చలిగించసాగింది.

సిగరెట్టు వెలిగించి సుబ్బిగాడివంక చూశాను. సహజంగా సరదామనిషి. అవడం వల్ల లోపల ఎన్ని తొందరలు, ఉపద్రవాలున్నా పైకిమాత్రం ఎప్పుడూ చిద్విలాసంగానే వుంటాడు. కాని యివ్వాళ మాత్రం అర్థంకాని వెధవమొహం పెట్టి మౌనంగా కూర్చున్నాడు.

'ఏమిటిరా సంగతి?' అన్నాను, 'కారణం ఏమైవుంటుందా?' అని ఆలోచిస్తూ.

నా మాటలు వినిపించుకున్నట్టు కనబడ లేదు. వాడేదో ఊహాలోకంలో పడి కొట్టుకుంటున్నాడు. మళ్ళీ అడిగాను.

'అబ్బే! ఒక అమ్మాయీ...' అంటూ దీర్ఘంతీసి మళ్ళీ ఆలోచనలో మునిగిపోయాడు.

అమ్మాయి! నాకు కుతూహలం ఎక్కువయింది.

'ఇదేదైనా లవ్ గొడవేమో' అనుకొని, 'ఎవరి అమ్మాయిరా? ఏం చేసింది?' అన్నాను.

వాడసలు యీ లోకంలో వుంటేగా నా మాటలు వినిపించుకోడానికి- కనుబొమలు ముడేసి, కళ్ళు చిన్నవిచేసేసి, ముఖాన్ని చిట్లించేస్తున్నాడు గడ్డంకింద చెయ్యిపెట్టుకొని.

భుజం పట్టుకొని ఊపాను. "ఈలోకంలో ఉన్నట్టేనా?"

"ఆ! ఆ! చెబుతా. ఆ అమ్మాయేమో..." అనేసి వూరుకున్నాడు. నాకు కుతూహలం ఎక్కువయ్యేకొలదీ వీడు ఆలస్యం చేస్తున్నాడు. చిరాకేసింది. 'ఒరేయ్! చెప్పేదేదో పూర్తిగా సరిగ్గా చెప్పరా. లేకపోతే మా నేయ్' అన్నాను విసుగ్గా.

'చెప్పేస్తున్నానురా' అంటూ గొంతు సవరించుకొని 'ఆ అమ్మాయి మాయమైపోయింది!' అని పెద్దగా నిట్టూర్చాడు.

'చంపావురా బాబు! చెప్పవలసిందంతా చెప్పకుండా ఏమిటిదీ? ఎవరి అమ్మాయి? ఎప్పుడు మాయమైపోయింది? ఎలా మాయమైపోయిందీ? అసలు ఆ అమ్మాయికీ మనకీ సంబంధం ఏమిటీ?'

"అందుకేరా నిన్ను తీసికొచ్చింది. అది హత్యా! ఆత్మహత్యా! ఎలోప్‌మెంటా! లేక!... లేకా..."

"ఏడ్చినట్టేవుంది! తుదీలేదు - మొదలూ లేదు! ఎందుకొచ్చిన సంధి ప్రేలాపన! ఒరేయ్! చెప్పితే సరిగ్గాచెప్పు. లేకపోతే ఆ విషయం వదిలేయ్" అన్నాను.

'చెప్తానుండరా' అంటూ జేబులో చేయి పెట్టాడు.

'ఏ దేదో చూపించేలాగున్నాడు, యిదేదో తీవ్ర విషయమే' అనుకొని నోరావలించి చూస్తూ కూర్చున్నాను.

తీరా చూస్తే చుట్ట, అగ్గిపెట్టె తీశాడు.

'కానీ! కానీ!' అన్నాడు.

గట్టిగాదమ్ములాగి ప్రారంభించాడు. "చిన్నప్పుడు-అంటే మన చిన్నప్పుడన్నమాట. మా ఇంటిలో వీర్రాజు అని ఒకడు పనిచేసేవాడు. చాలామంచివాడులే. చిన్నప్పుడు నన్ను ఎత్తుకొని పెంచాడట. మా యింటిలోనే తిండీ, బట్ట అంతాను. పదేళ్లు పనిచేశాడు. ఇప్పుడు పెళ్లీ, గిళ్లీ అన్నీ చేసేసుకొని యేలేశ్వరంలో ఒక సైకిల్‌షాపు పెట్టాడు. చాలా బాగుందిలే వాడిపనిప్పుడు.'

'వాడేం చేశాడు?'

'వారంరోజుల క్రితం వాడూ, వాడి మరదలు, బావమరదీ ముగ్గురూ వచ్చారు.'

'ఎక్కడికీ'

'మనవూరే! ప్లీడరుగారింటికి వచ్చి మా యింటికివచ్చారు. ఆరాత్రి భోజనాలయ్యాక వాళ్ళిద్దరూ కలసి...'

"ఎవరిద్దరూ?"

'బావా, మరదుళ్ళురా'

'మూడోవాడేమయ్యాడు?'

'ఆ సాయంత్రం వాడు యేలేశ్వరం వెళ్ళిపోయాడు! వాళ్ళిద్దరూ కలసి బుఱ్ఱకథ కెళ్ళారు. కథ అయిపోయినతర్వాత వీర్రాజు మాయింటికి వచ్చేటప్పటికి నేను మెలుకువగానేవున్నాను. తొందర తొందరగా వచ్చి, 'అమ్మాయి, యింటికి వచ్చేసిందాండి!' అంటూ గాభరాగా అడిగేడు.

"రాలేదు. నీకూడా బుఱ్ఱకథ కొచ్చిందేమో?" అన్నాను.

"వచ్చిందండి. కథ అయిపోయినతర్వాత కనబడలేదు. పేరెట్టి గట్టిగా పిలిచేనండి. పలకలేదు. ముందుగాని వచ్చేసిందేమో" అనుకున్నాను. "కొంచెం వెదుకుదాం ర"మ్మన్నాడు.

'ఆ అమ్మాయి వంటిమీద అయిదువందల రూపాయలు కిమ్మత్తుచేసే బంగారం వుందట. వాడి వాచీ, పాతికరూపాయలు ఆ అమ్మాయి దగ్గరే వున్నాయట. లబో లబోమన్నాడు. తెగవెదికాం, తెల్లవార్లూనూ. ఎక్కడా కనబడలేదు. ఆ నూతుసుంటూ పోయాడు మళ్ళీ యేలేశ్వరం ఆమర్నాడు, అక్కడా లేదట. అతరవాతేమో వీర్రాజే సైకిలొకటి తాకట్టుపెట్టి వాడూ, వాడి బావమరిదీ కలసి వాళ్ళ చుట్టాలింటికిగాని పోయిందేమో" అని ఇటు కోటిపల్లి, అటు ఏలూరు, అలా అనకాపల్లిదాకా వెళ్లి చూసొచ్చారు. ఎక్కడా కనబడలేదు. ఏంచేస్తే మంచిదని సలహా అడగడానికి వచ్చారు వాళ్లింతామళ్లీని.'

'ఎవరంతా?'

'ఆ అమ్మాయి తల్లీ, తండ్రీ, అన్నాను.'

'వీర్రాజు ఏమయ్యాడు?'

'రేపు వస్తాడట డబ్బట్టుకొని'

'ఆ అమ్మాయికి పెళ్లి అయిందా?'

'ఆ! అన్నట్టు చెప్పడంమరిచిపోయాను. అమ్మాయికి పెళ్లి అయింది. మొగుడు రౌడీ అట. బాగా చూడడట. తాగొచ్చి రోజూ కొడతాడట. విడాకులిప్పించే వుద్దేశంతోటే వీర్రాజు ఈవూరు ప్లీడరుగారింటికి తీసుకొచ్చాడు.'

'ఆ అమ్మాయిని చూశావా? ఎలా గుంటుంది?'

'చూశాను. పదహారేళ్లుంటాయి. ఎఱ్ఱగా వుంటుంది. కొంచెంబొద్దుగా, చూడ్డానికి బాగానే ... పాపం! ఏమైపోయిందంటావురా?'

"ఆఅమ్మాయి అన్న యిక్కడే వున్నాడు కదూ?"

"ఉన్నాడు"

"తీసుకొద్దాం పద"

*  *

మేము ముగ్గురం కలసి మళ్ళీ గట్టుమీదకు వచ్చేటప్పటికి పదయింది.

"నీ పేరేమిటి?" అడిగాను నేను.

"రాజు"

"ఇరవై యేళ్ళుంటాయి కాని అమాయకంగా వున్నాడు.

"నువ్వేం పనిచేస్తావు?"

"ఎవసాయమండీ! నేనూ మాఅయ్యాను"

"మీ చెల్లెలు పేరు?"

"పాపయ్యమ్మ"

"మీ చెల్లెలికి పెళ్ళయి ఎన్నాళ్ళవుతుంది?"

"రెండో సంవత్సరమండి"

"మీ చెల్లెలు అత్తవారు బాగా చూడరా?

"తాగొచ్చి రోజూ చిదగ్గొడతాడండి మా చెల్లెమ్మని. దానికి తోడు అత్తేమో లేనిపోని మాటలన్నీ చెబుతుందండి కొడుక్కి. అందుకే వాళ్ళింటికి వెళ్లదండి."

"అత్తవారింటికి వెళ్ళి ఎన్నాళ్లవుతుంది?

"పెళ్లయినతర్వాత ఒకసారే వెళ్ళిందండి. వెళ్ళి రెండు నెలలైనా వుండలేదండి."

"ఈమధ్య వాళ్ళెప్పుడైనా వచ్చారా మీ యింటికి?"

"వచ్చారండి. వచ్చి మా చెల్లెమ్మని పంపు

# ★ మాయమైన అమ్మాయి ★

మని అడిగేరు. పంపకపోతే కుదరదని పెద్ద పేచీ పెట్టాడు మా బావమరది. వెళ్ళను గాక వెళ్లనంది మా చెల్లెమ్మ "ఎలాగ రావో చూస్తాగా!" అంటూ వెళ్ళిపోయాడు కోపంగా అందుకే ఎలాగూ కుదరదని మా బావ యీవూరు తీసుకొచ్చాడండి."

మీబావకుపెళ్ళయిఎన్నాళ్ళవుతుంది?నువ్వే మీఅనుకోకు. ఉన్నది ఉన్నట్టు చెప్పు."

"ముందొక పెళ్ళయిందండి. ఆవిడని వది లేశాడు. మా అక్కనిచ్చి మూడేళ్ళవుతాది"

"ఎందుకు వదిలేశాడు?"

"అందంగా వుండదని"

"మీ అక్క అందంగా వుంటుందా?"

"అందంగానే వుంటాదండి"

"మీ చెల్లెమ్మో?"

"మా అక్కకంటే అందంగా వుంటా దండి. గడుసుది కూడాను."

'ఉహూఁ! నువ్వు మళ్ళీఎందుకు వెళ్లావు యేలేశ్వరం?'

'ప్లీడరుగారు డబ్బు ఎక్కువ అడిగె లాగున్నారు.' "ఎందుకైనా మంచిది,పాతిక రూపాయలు పట్టుకురా యింటికెళ్ళి" అన్నాడండి మాబావ.

"మళ్ళీ నువ్వెప్పుడొచ్చావు?"

మర్నాడు పొద్దున్న పదింటికల్లా వచ్చా నండి పెద్దాపురం డబ్బట్టుకొని."

"వచ్చి?"

"వీరింటికి వెళ్ళానండి. వీరి నాన్నగారు యీ విషయం అంతా చెప్పారండి. మా బావకూడా వెళ్ళిపోయినట్టు చెప్పారు. అప్పుడు నేను మళ్ళీ సైకిలెక్కి మావూరు బయలుదేరానండి. నాకు మాబావ బస్సులో కనబడ్డాడండి"

"ఏబస్సులో?"

"మావూరి బస్సులోనండి"

"ఎక్కడ?"

"పెద్దాపురానికి జగ్గంపేటకీ మధ్య"

"పెద్దాపురానికీ జగ్గంపేటకీఎన్ని మైళ్లు?"

"అయిదు కోసులుంటాదండి"

"నువ్వు చూశావా? మీ బావ చూశాడా?"

"నేనూ చూశానండి. మా బావా చూశాడు."

"చూసి అక్కడ దిగిపోయాడా?"

"లేదండి. జగ్గంపేటలో దిగి సైకిలేసు కొని వచ్చి నాకెదురయ్యాడండి."

"సైకి లెక్కడిది?"

"అతనిదేనండి. మేం ముందు యిక్కడికి వచ్చేటప్పుడు మా బావ సైకిలుమీద మేము బస్సులోనూ వచ్చామండి. ఇప్పుడది టాప్ మీద వడేశా డన్నమాటండి.

"ఉహూఁ! తరువాత ఏం చేశారు మీ రిద్దరూ? జరిగింది జరిగినట్టు చెప్పు?"

"దారిలో మళ్ళీ చెప్పాడండి యీ సంగతి మాబావ. జగ్గంపేటలో కాఫీ తాగ డానికి దిగేనండి. మాబావ ఎవరో వాళ్ల స్నేహితులింటికి వెళ్ళాడండి. కాఫీ తాగే శాక యింకా రావడంలేదని మాబావ వెళ్ళిన స్నేహితులింటికి..."

"నువ్వూ వెళ్ళావు. అవునా?"

"లేదండి! నేనూ వెళ్లేటప్పటికి మాబావ వచ్చేస్తున్నాడండి యింట్లోంచి.మళ్ళీ మేమి ద్దరం కలసి మావూరు వెళ్ళిపోయామండి. ఈ సంగతి విని మావాళ్లు మాబావను తిట్టారండి. మా బావ తలకాయ స్తంభానికేసి కొట్టేసుకున్నాడండి. వెంటనే నేనూ, మా బావా మా చుట్టాలెక్కడెక్కడ వున్నారో అన్నివూళ్ళూ తిరిగేమండి. ఎక్కడా లేదు. సమయానికి డబ్బు చేతిలో లేకపోతే సైకి లొకటి తాకట్టు పెట్టాడండి. మేం యిక్క డికి వచ్చింది లగాయతు ఖర్చంతా మా బావే పెట్టుకున్నాడండి."

"మీ చెల్లెలు వంటిమీద ఏమేం వస్తువు లున్నాయి?"

"చెవులికి దుద్దులు, లోలకులు, మెళ్లో రెండు పేట్ల గొలుసు, చేతులుకి రెండు జతల గాజులు, కాళ్లకి వెండిపట్టీలు వున్నాయండి. మేం ముందు తీసికొచ్చిన పాతిక రూపా యలు మా బావ వాచీవున్న సంచీ దాని దగ్గరే వున్నాయండి."

"మీ చెల్లెలు అత్తారిదేవూరు?"

"మావూరేనండి."

"మీరు యిక్కడికి రావడం వాళ్ళకి తెలుసా?"

"ఏమో! నాకు తెలియదండి."

"మీ చెల్లెలు అత్తవారింటికి వెళ్ళి చూశారా?"

"మాశామండి, అక్కడా లేదు."

"మీ బావమరిది వూళ్ళో వున్నాడా?"

"లేడండి. ఏదోవూరు వెళ్ళాడట!"

"ఎప్పుడు వెళ్ళాడు? ఏవూరు వెళ్ళాడు?"

"వాళ్ళేమీ చెప్పడంలేదండి!"

"ఏరా! సుబ్బారావూ, అర్థమైందా?"

"అదేరా! నేనూ అనుకుంటున్నాను. మనం వెళ్ళి ఎంక్వయిరీచేస్తే?"

"ఎప్పుడూ?"

"ఇప్పుడే! రేపు ఆఫీసు శెల్లవు. తెల్లారే టప్పటికి ఏలేశ్వరం వెళ్ళిపోతాం సైకిళ్ళ మీద"

* * *

మేం ముగ్గురం సైకిళ్ళు సమకూర్చుకొని బయలుదేరేటప్పటికి పదకొండయింది.

పుచ్చ పువ్వులా వుంది వెన్నెల. కాని పూర్తిగా తారురోడ్డు పడలేదు. రెండుమైళ్లి వరకే వుంది అంతవరకూ హుషారుగానే వెళ్ళిపోయాము. అక్కడనుంచి గతుకులు పడి ఎగుడుదిగుడులుగానున్న రోడ్డు సామాన్య మానవజీవితాన్ని స్ఫురింపజేస్తూ వుంది. కీచు రాళ్ళధ్వని తప్పించి నిశ్శబ్దంగానే వుంది. భావి కార్యక్రమాన్ని గురించిన ఆలోచనల్లో మౌనంగా వుండి పోయాను, వాళ్ళుకూడా ఏవో ఆలోచనల్లో వుండి బరువుగా తొక్కుతున్నారు. ఎలా గయితేం, రెండుగంటలు కష్టపడి జగ్గంపేట పొలిమేరకు వచ్చాము.

"సుబ్బీ! యిక్కడ దిగాలిరా?" అన్నాను.

"ఏ దేదో వెనక్కి మళ్ళించేలాగున్నా డనుకొని "ఏవిటిరో! అప్పుడే అయి పోయిందేవిటి చవు(రు?" అన్నాడు.

"అదికాదురా! తిన్నగా పోలీసు స్టేషనకి దారితియ్యి!"

"ఎందుకు?"

"నువ్వేమీ అడ్డుచెప్పకుండా ముందు స్టేషనుకు పదరా!"

నామాటల్లోని నిశ్చితాభిప్రాయాన్ని గ్రహించాడు. తిన్నగా స్టేషనుకి వెళ్ళాం. అదృష్టవశాత్తూ మావాణ్ని ఎరిగున్న సెంట్రీ ఒకడున్నాడు. మమ్మల్ని చూసి "యిలా వచ్చారేం?" అని పలకరించాడు.

"పనుండే వచ్చాం!" అన్నాను.

"ఏమిటి పని?"

ఇలా రమ్మని సైగచేసి చెవిలో 'అనుమానంగావున్న ఓ యిల్లు సోదాచేయాలి! మీరొకసారి వస్తారా?' అన్నాను.

"ఏమిటి సంగతి?" అన్నట్టు చూశాడు.

"తరువాత మీకే తెలుస్తుంది. దబ్బున రావాలి!"

కునికిపాట్లు పడుతున్న మరోకాని స్టేబుల్ నిలేపి 'యిప్పుడే వస్తాను. కొంచెం మెలుకువగా వుండ'మని హెచ్చరించి మాకూడా బయలుదేరాడు.

'ఆవేళ మీ బావ వెళ్ళాడన్నావే? ఆ యింటికి తీసికెళ్ళ'మని రాజుతో చెప్పాను. స్టేషనుకి దక్షిణంగా దాదాపు వూరి చివరికి తీసికెళ్ళి అక్కడ ఓచిన్న తాటాకు యిల్లు చూపించాడు. వీధి తలుపులు మూసివున్నాయి. అప్పుడే యేమి చేయవద్దని మావాళ్ళందరికీ చెప్పాను.

మెల్లగా చప్పుడు చేయకుండా ఒకసారి యింటిచుట్టూ తిరిగేము. ఎటువైపూ ఒకకిటికీ ఐనా లేదు. ఆయిల్లంతా ఒకేగదిలా వుంది. అవతలమాత్రం ఒక గుమ్మం వుంది. అది కూడా మూసేవుంది. రాజుని కాని స్టేబుల్ని అక్కడుంచి నేనూ, సుబ్బీ వీధి గుమ్మంలోకి వచ్చాము. మూసివున్న తలుపు సందుల్లోంచి లోపల వెలుగుతున్న దీపపుకాంతి మెట్ల మీద పడుతూ వుంది. లోపలినుంచి ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి!

"నామాట విని నాకూడా వచ్చెయ్! ఎందుకు యింతసేపు బతిమాలించుకొంటావ్!

"ఎక్కడికి?"

"నేతీసికెళ్ళి పోతాగా! ఇవ్వాళే సైకిలు షాపు, బేరంపెట్టాను వెయ్యిరూపాయలికి. అవి పట్టుకొని మంచిటౌనుకి వెళ్ళిపోదాం! నీకేమీ లోటు రానివ్వను. హాయిగా నిశ్చింతగా వుండొచ్చు!"

"నాకేమీ అర్థం అవడంలేదు. ఆడు నన్ను చంపడానికి తిరుగుతున్నాడని, అణ్ణి పట్టి అప్పగించేదాకా మావాళ్ళు దాచేయమన్నారని అన్నావు! ఇంట్లోంచి యివతలికి రావద్దన్నావు? ఇదంతా నాటకం అన్నమాట."

"దానికేంగాని ప్రయాణానికి సిద్ధంగా వుండు. రెండు రోజుల్లో వెళ్ళిపోదాం!"

"ఛీ! నేను రాను! నా బతుకే మంచిది కాదంటే నువ్వుకూడా యిలా తయారయావేటి?"

"ఒప్పుకో అమ్మా! నీకేం భయంలేదు! నేనూ వస్తాను మీకూడా! హాయిగా చిలకా గోరింకల్లా వుందురుగాని? నీకూ కష్టాలుండవు!—" ఎవరిదో ముసలిగొంతు.

"అఖర్లేదు! మా బతుకు మేం బతగ్గలం! నన్ను పోనివ్వండి."

"వెళ్ళడానికి వీలులేదు!"

"ఏం! ఎందుకులేదు? నువ్వేమైనా పెళ్ళిమొగుడివా? వెళ్ళనివ్వకపోతే గట్టిగా అరుస్తాను తెలుసా!"

"అరిస్తే పీకి నొక్కుతాను!"

"వదులూ! !"

సుబ్బిగాడింక ఓపిక పట్టలేక పోయాడు "తలుపుతియ్" అంటూ తలుపు కొట్టాడు.

# ★ మాయమైన అమ్మాయి ★

ఆశేకళ్లే విడిపోయాయనుకున్నాను తలుపులు.

అయితే నేను ముందే అనుకున్నట్టు లోపలి వ్యక్తి అటువైపు పారిపోదామని తలుపు తీయడం, మావాళ్ళకి దొరికి పోవడం రెండూ ఒకసారే జరిగాయి. "పికి నొక్కుతావేం" అంటూ కానిస్టేబుల్ రాజు మెళ్లో తువాలుతో రెక్కలు విరగట్టాడు.

ముసిలిదాన్ని కూడా తీసికొని పోలీసు స్టేషనుకి వచ్చాం. రాజునీ, వాళ్ళ చెల్లెమ్మనీ, ఎస్. ఐ. గారినీ రేపు ఫస్టు బస్సుకి పంపమని కానిస్టేబుల్‌తో చెప్పి సుబ్బీ, నేనూ సైకిళ్ళెక్కాము.

* * *

"దొంగవెధవ! ఎంత నాటకం ఆడాడు! అసలు నీ కెలా తగిలిందిరా అనుమానం?" దారిలో అడిగాడు సుబ్బి.

జీవితంలో ఎప్పటికప్పుడు కొత్తదనాన్ని చవి చూడాలని ఆత్రుతపడడం మానవ స్వభావం. ఆ ప్రయత్నంలో నీతి నియమాల్ని వదిలేసి, జీవితాలనే తృణప్రాయంగా చూచే వాళ్లు కొందరుంటారు. అలాంటి వాళ్లలో వీర్రాజు ఒకడు. మొదటి భార్యను వదిలేశాడు. రెండో భార్యనుకూడా వదిలేసి మూడోదానికోసం ప్రయత్నించేడు. పాపం! దొరికిపోయాడు. బుఱ్ఱకథకు వెళ్లినరాత్రి యితడే ఏవో అల్లిబొల్లి కబుర్లు చెప్పి ఎక్కడో దాచేసివుంటాడు. మీకు నమ్మకం పుట్టేలాగ ఆ రాత్రి వెదికినట్టు నటించాడు. ఆ పొద్దున్నే బస్సుమీద యిక్కడికి తీసి కొచ్చేశాడు. లేకపోతే సైకిలుండగా బస్సు ఎక్కడ మెందుకురా? అప్పుడే తగిలింది నా కనుమానం. తానొక్కడే అయితే రాజును బస్సులో వుండి చూశాడుకదా, బస్సు ఆపి అక్కడే ఎందుకు దిగిపోకూడదు? జగ్గంపేట అక్కడికి యింకా అయిదుమైళ్లు పోవాలి గదా? మధ్యలో కొట్రావుల పల్లిదగ్గర బస్సుస్టాపు వుందిగా! అక్కడైనా దిగి పోవచ్చు. దిగిపోవడం మానేసే చూసీ చూడనట్టూరుకోనడమేం? పోనీ జబ్బుగావుండిబస్సు మీద పోతున్నా డనుకుందాం! అలాటి వాడు జగ్గంపేటలోదిగి మళ్లీ సైకిలుమీద ఎదురు రావడమేం? యివన్నీ నా అనుమానాన్ని బలపరచేయ్. ఆ ముసల్ది పీడికి తెలిసి ఉన్నదై వుండొచ్చు. అలాటి వాళ్లకు యిలాటివాళ్లు జతపడుతూ వుంటారులే! ఏమైనా వీర్రాజు చాలా మంచివాడురా!"

సుబ్బిగాడు నవ్వుకున్నాడు.

కార్యసాఫల్యం అయినందుకు సర్దాగా వచ్చేశాం. అయితే మేం వచ్చేసరికి తెల్లారి పోతోంది. సైకిలు సుబ్బిగాడికిచ్చేసి యింటికి వచ్చేటప్పటికి వాకలి తుడుస్తోంది అమ్మ.

మెల్లగా భయం భయంగా నా గదిలోకి పోయి దుప్పటి తీసాను. "పనీ లేదూ! పాటూ లేదూ! పగలు తిరిగేదికొకుండా రాత్రిళ్లకూడా..." అంటూ వినిపిస్తున్నాయి మాటలు.

'ఇంక ఆట్టే వినిపించుకో కూడద'ని దుప్పటి గట్టిగా ముసుగెట్టేసుకున్నాను. ★

# సంక్రాంతి సరదా

## కాపూరి నరసింహశెట్టి

ఆ జూదగాండ్ర జట్టును పట్టుకోవాలని ప్రయత్నించిన సబ్‌యినస్పెక్టరు మూర్తి ఆచూకీ తెలిసే వాళ్లు ముందుగా పారిపోవడంతో చీకాకుగా స్టేషనుకు తిరిగివచ్చి, చేతిలోని టార్చిలైటు టేబులుమీద పడవేసి కుర్చీలో చతికిలబడ్డాడు.

"మనం వస్తామని వాళ్లకు ముందుగానే తెలిసివుంటుంది సార్! అందుకే ఒక్కడైనా కనుపించకుండా పోయేరుసార్" అన్నాడు కూడావచ్చిన కానిస్టేబుల్.

"వాళ్లకు తెలియడంకాదుగాని మనం యింకా కొంచెంముందుగా పోయివుండవలసింది"

"మరి యెందుకు పోలేదు సార్"

"నాకెందుకో అలసటగావుంటోందిమధ్య. అనుకున్నపని వెంటనే చేయలేకపోతున్నాను"

"హార్లిక్సు పుచ్చుకోండి సార్! మీకు ప్రమోషనుకూడ వస్తుంది. నేను పేపరులో చదివేను. హార్లిక్సు పుచ్చుకుని హుషారుగా పనిచేసినందుకు రాజు అనేవాడికి ప్రమోషను వచ్చిందట."

ఆ చీకాకులోకూడ మూర్తికి నవ్వు వచ్చింది. సరే! నీవుపోయి డ్యూటీ చూచుకోమని కానిస్టేబులును పంపించివేసేడు.

మూర్తి బి. యె. పాసైనవెంటనే సబ్‌యినస్పెక్టరుగా సెలెక్టు అయి ట్రైనింగు పూర్తిచేసుకుని స్టేషనుకు వచ్చేడు. వచ్చిన మొదటిరోజుల్లో యీ కుర్ర సబ్‌యినస్పెక్టరునుచూచి మీసాలు మెలివేసే హేమాహేమీలు బలుంబలసిన రౌడీలు వెకిలిగా నవ్వేరు. కాని త్వరలోనే మూర్తి తనసత్తా వారికి చూపెంచేడు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పట్టభద్రుడైన యువకుడు. పనియందు ఆసక్తి, న్యాయదీక్ష, దేశభక్తి వున్నవాడు. కాలేజీలో చదివే రోజుల్లోనే న్యాయాన్ని న్యాయంగాను, అన్యాయాన్ని అన్యాయంగాను తెలుసుకోగలిగిన వివేకి. అందువల్ల వచ్చిన మొదటిరోజుల్లోనే ముందు తనస్టేషను సిబ్బందిని మరామత్తు చేసుకున్నాడు. తరువాత రౌడీ అనేవాడిని దయాదాక్షిణ్యాలులేకుండా యెముకలు విరుగదన్ని వేసేడు. తరువాత పెద్దమనుషుల తప్పులు పెద్దమనిషిగానే సరిదిద్ద ప్రారంభించేడు. అయినా ఆపెద్దమనుషులు అతన్ని కుర్రకుంకగా చూడసాగేరు. దానితో ఒకరిద్దరిని నిర్మొగమాటంగా కటకటాల మధ్యకు తోడపెట్టిగెంటి మత్తువదిలించి కండ్లు తెరిపించేడు. దానితో అతను తామనుకున్నంత కుర్రవాడు కాడనిపించేడు. దానితో "ధనమూలమిదంజగత్" అన్న అస్త్రాన్ని ప్రయోగించేరు. అయినా యీ విశాలభావాలుగల మూర్తి లొంగలేదు. దానితో చాలామంది "సెహబాస్" అన్నారు. మూర్తి యెంతో గర్వపడ్డాడు.

మూర్తి అంతవరకూ బ్రహ్మచారిగానే వుండడంవల్ల మంచికట్నాలతో సంబం



ముంగిట ముగ్గు

చిత్రకారుడు: వి. ఎస్. ఆర్. శర్మ—శ్రీకాకుళం.

# ★ సంక్రాంతి సరదా ★

ధాలు రావడం ప్రారంభించేయి. అందులో కంటికి నిండైన యువతిని, చేతులునిండిన కట్నంతో వివాహం చేసుకున్నాడు. నిజంగా అప్పటినుంచీ మూర్తికి యీ వుద్యోగమంటేనే చీకాకు కలిగిస్తోంది.

"వనితా విత్తాలు చాలా ప్రమాదకరమైనవనీ వాటికి దూరంగా వుండమనీ" తన తండ్రిగారు చెప్పిన సలహాను తన వుద్యోగ ధర్మంలో అక్షరాల పాటించేడు. కాని ప్రమాదకారణమనుకునే వనిత తన భార్య రూపంలోను, విత్తం కట్నం రూపంలోనూ రావడంవల్ల కాదనలేకపోయేడు. అయితే ఆ వనితా విత్తాలే తన ఈ నిరుత్సాహానికి కారణమూ.

యెన్నిసార్లు అర్థరాత్రి సమయంలో అనుమానమైన చోటికల్లా వెళ్ళి ఎన్నికేసులు పట్టలేదు.? కాని యిప్పుడు అవసరమైన చోటికి కూడా వెళ్ళడానికి బద్ధకిస్తున్నాడు. దగ్గరలేని అతని భార్య వైపు అతని ఆలోచనలు పోసాగేయి.

క్రొత్తగా వచ్చిన ఈమెయందు తనకెందు కింత మమకారం! చిన్నతనాన్నుంచీ తనతో పెరిగి తనను విడచిపెట్టని తన "టైగర్" కంటె, యేకగర్భజనితులైన సోదర సోదరీలకంటె, తన వృద్ధికి కారకులైన పూజ్య పితకంటే, ఆఖరికి తన గర్భకోశంలో పెంచి తన రక్తాన్ని పంచి యిచ్చిన మాతృదేవత కంటే క్రొత్తగా వచ్చిన తనభార్య ఎంతో సన్నిహితం కావడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. తన టైగర్ మీదవుండే ముద్దువేరు, తోబుట్టువులపై వుండే వాత్సల్యం వేరు, తండ్రియందుండే పూజ్యభావంవేరు, కన్నతల్లిపై వుండే ప్రేమవేరు, తన భార్యపై వుండే మమకారం, ఏదో చెప్పలేని సన్నిహితత్వం, వాత్సల్యంవేరు అనుకున్నాడు.

వివాహమైన కొన్ని మాసాలకే, ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించే క్రొత్తలోనే దీపావళిపేరుతో సీతను తీసుకు వెళ్ళడం తటస్థించింది. దీపావళికి వచ్చిన ఆడపడుచును సంక్రాంతి వెళ్ళేవరకూ పంపించే ఆచారం లేదన్నారు. దానితో మూర్తి చాలా నిరుత్సాహ పడిపోయేడు.

తక్కిన ఉద్యోగాలవలె కావలసినప్పుడల్లా అతనికి సెలవు దొరుకదు. అందువల్ల తనకు ఆరోగ్యం సరిగాలేదనీ, సీతను వెంటనే పంపించమనీ మామగారికి టెలిగ్రాం ఇచ్చేడు. ఆ టెలిగ్రాం చూచుకుని మామగారు గాభరాపడ్డారు. వెంటనే ఆయనే బయలుదేరి వచ్చేసేరు.

కుంటున్న మూర్తిని చూచి ఆయన ఆశ్చర్యపడ్డాడు. అనుకోని యీ సంఘటనకు మూర్తి కూడ విస్తుపోయేడు. మామగారు వెండీమీసాల్లోనుంచి ముసిముసి నవ్వులు నవ్వేడు సంగతి అర్థం అయ్యిందనే భావంతో! తరువాత జేబులోని పచ్చనోట్లు రెండు తీసి 'మూర్తి చేతిలో పెడుతూ సంక్రాంతి యెన్నాళ్ళోలేదు గనుక తప్పకుండా సెలవు తీసుకుని రమ్మని చెప్పి వెళ్ళిపోయేడు. ఆయన వెళ్ళిపోయిన తరువాత తన కుర్రతనపు చేష్టలకు మూర్తి నవ్వుకున్నాడు. తన బి.ఎ. విజ్ఞానం, మీసాలు నెరసిన తన మామగారి ముందు ఎందుకూ పనికిరాకుండా పోయిందని తెలుసుకుని సంక్రాంతికి సెలవు కావాలంటే న్యాయంగా తనకు దొరకదు గనుక ఏ డాక్టరునో పట్టుకుని కొన్నాళ్లు మెడికల్ లీవు తీసుకోవాలని నిశ్చయించుకున్నాడు. అదే విధంగా అతడు ప్రయత్నించడం, సెలవు దొరకడం కూడ జరిగింది.

సెలవు దొరికినందుకు మూర్తి యెంతో మురిసిపోయేడు. అతను బి. ఎ. పాసైనప్పుడు గాని, సబ్ ఇన్‌స్పెక్టరుగా సెలెక్టు అయినప్పుడుగాని మూర్తికి యింత ఆనందం కలుగలేదు.

అత్తవారింటికి వెళ్ళడానికి మూర్తి వుత్సాహంతో పెట్టె సర్దుకుంటున్నాడు. గడగడలాడించే చలికాలం. వివాహమైన తరువాత మొదటి పండుగ. భార్యవెళ్ళి చాలా కాలమయింది. కోరికలు గుట్టలుపడివున్నాయి. మూర్తి యీలపాట పాడుకుంటూ, పగటి కలలుకంటూ కావలసిన బట్టలన్నీ పెట్టెలో పెట్టుకున్నాడు. తనకు యిష్టమైనగులాబీరంగు సిల్కుచీర ఒకటి కొనితెచ్చి జాగ్రత్తగా పెట్టెలో పెట్టేడు. తాను వివాహానికి కొనుక్కున్న సెంటులన్నిటిలోనూ మంచిదైన మొగలిపువ్వు వాసన సెంటుసీసాకూడా పెట్టెలో పెట్టుకొని, దానిని మరచిపోనందుకు తనను తానే అభినందించుకున్నాడు. రైలు టైముకు ముందుగానే స్టేషనుకు చేరుకున్నాడు.

మూర్తి వెయిటింగు రూములో కూర్చున్నాడు. అతని ఆలోచనలన్నీ అత్తవారి వూరిమీదనే వున్నాయి. తాను అక్కడికి వెళ్ళేసరికి సాయంత్రం అయిదు గంటలు అవుతుంది. మామగారు షికారుకు వెళ్ళి యింకా వచ్చివుండరు. బావమరది రామక్రిష్ణ సెలవు మీద వచ్చి వుంటాడో లేదో. నౌఖరు లెవ్వరి కంటబడకుండా తాను తిన్నగా యింటికి వెళ్ళాలి. తలుపులు తీసివుంటే తిన్నగా లోప

దుక్కులా స్టేషనులో కూర్చుని పనిచూచులికి వెళ్ళిపోవాలి. ఆడవాళ్లంతా దొడ్డివైపున

వుంటారు. తిన్నగా అక్కడకు వెళ్ళిపోతేనా! అది అసభ్యంగా వుంటుంది. అసలే క్రొత్త అల్లుడను! ఆడవాళ్ళుండే చోటికి యెలా వెళ్లను! ఒకవేళ వీధి తలుపు గడియ వేసి వుంటేనో! తాను వెళ్ళి తలుపుతట్టాలి. సీత, తన సీత స్వయంగా వచ్చి తలుపుతీసి తన్నుచూచి ఆనందంతో తబ్బిబ్బయి, సిగ్గుతో లోపలికి పరుగెత్తాలి. ఆమె సిగ్గును అర్థంచేసుకోలేక అత్తగారుఅదేమిటే! అలా సిగ్గుపడతావు. యెవరు వచ్చేరు?" అంటే సీత యేమని జవాబు చెబుతుంది? మూర్తి తనలో తానే నవ్వుకున్నాడు ఆదృశ్యాన్ని సృష్టించుకుని. టైము అయిందేమోనని బైటికి వచ్చి చూచేడు. వెధవరైలు గంట లేటు. అదీ యీరోజునే లేటుకావాలా! అతనుచాలా బాధపడ్డాడు. రెస్టారెంటుకు వెళ్ళి కాఫీ ఒకటి తీసుకుని సిగరెట్టు వెలిగించి మళ్ళీ వెయిటింగు రూముకు తిరిగివచ్చి కుర్చీలోకూర్చున్నాడు.

ఒకవేళ తాననుకున్నట్లుగాక షికారు నుంచి తిరిగివస్తున్న తన మామగారే ముందుగా చూస్తేనో! యిక ఆయన కంగారుకు అంతంవుండదు. ఆ నౌఖరునీ యీ వంటవాడినీ పిలచి నానా హంగామా చేస్తాడు. అప్పుడు సీతను చూడడానికి ఆలస్యమే 'కావచ్చు. అలా యెవరైనా చూచినా ఆనవాలు పట్టకుండా వేషం మార్చివేస్తే! పెద్దమీసాలు, దొంగగడ్డం తగిలించుకుని వెళితే! రైలు గంటలేటు! చీకటిపడేసరికిగాని అత్తవారింటికి చేరలేడు. చీకటిలో సరిగా గుర్తించలేక ముందుగా వారినౌఖరు యెవడైనాచూచి "యెవరువారు" అంటే తానేమని చెప్పాలి! మాట్లాడకుండా వెళ్ళిపోతే వూరుకునేరకం కాదు. "నేను ఫలానా" అంటే నమ్మడు. వాడు యేమైనఅన్నా చేసినా నేను వూరుకోలేను. యిది అసలే పోలీసురక్తం! వుద్రేకం జాస్తి! అక్కడితో నానా గలాభా! నగుబాటు! యీప్లాను మూర్తికి నచ్చలేదు.

కిటికీవద్ద చప్పుడయితే అలాచూచేడు మూర్తి. ఒక చక్కని పల్లెటూరి అమ్మాయి. అమ్మాయి అనడంకంటే యువతిఅంటే బాగుంటుందేమో? కూడా ఒకవృద్ధుడు తండ్రి కాబోలు పండుగకు తీసుకు వెళుతున్నాడు అనుకున్నాడు మూర్తి! ఆ యువతి ముఖంలోకి నూతన వధువుకు వుండేకాంతి, ఆ చెక్కిళ్ళలో ప్రియునితో గడిపిన క్రొత్తరోజుల్లో వచ్చే చక్కదనం కనుపించేయి. కూతురును పెట్టెపై కూర్చోమని వృద్ధుడు చుట్టవెలిగించి ప్రక్కన కూర్చున్నాడు. మూర్తికి వారి మాటలు వినిపిస్తున్నాయి.



వచ్చింది సంక్రాంతి,
వచ్చింది సంక్రాంతి!
చెల్లెలా మన యింటి
చేరువకు వచ్చింది.
చలి చాల తెచ్చింది,
కానుకగ యిచ్చింది.
మూడురోజులు మనకు
ముచ్చటగ పండుగ.
కడుపునిండుగ వెనుక
కొలువు బడి మానకు.

ఆడపడుచులు వత్తు
రమ్మగారింట్లకు.
అల్లుళ్ళు వత్తు రిపు
డత్తవారింట్లకు.
తెలవారుజామునే
భోగి మంటలు వేసి,
తలయంటి పోసికొని,
తళుకు పరికిణి కట్టి,
పసుపు పారాణులను
పాదముల దిద్దుకొని,

పందిళ్ళలో ముగ్గు
బాగుగా వేయుదము.
పిండి వంటలతోడ
పొట్ట లన్నింపుకొని,
క్రొత్త బట్టలు గట్టి
పెద్దలకు దండ మిడి,
పేకముక్కలాట
కొందరాడుదురు.
మన యూరి తిరణాలు
మనము చూతమురమ్మ.

అయలసోమయాజుల ప్రసాదరావు

# ★ సంక్రాంతి సరదా ★

"అల్లుడు పండుగకు వస్తాడంటావా ?" ప్రశ్నించేడు వృద్ధుడు యువతి ముఖంలో సిగ్గుతెరలు మందంగా కనుపించేయి. తల వంచుకుని వయ్యారంగా నవ్వుకుంది అల్లుడుపేరులోనే యేదో తీయదనం వుందేమో !

"వూఁ" అన్నాడు వృద్ధుడు కూతురు నుంచి సమాధానం రాకపోవడంలో తన ప్రశ్నను మళ్ళీ అడుగుతున్న ధోరణిలో !

"తప్పకుండా వస్తానన్నారు మరి" యువతిచెక్కిళ్ళు సిగ్గుతో యెరుపెక్కేయి. కళ్లల్లో వింతకాంతి. గతరాత్రి తనతో గడపిన భర్త జ్ఞాపకం వచ్చినట్లున్నాడు పాపం ! అనుకున్నాడు మూర్తి !

"వస్తాడులే! యిదే తొలిపండుగకదా!" అన్నాడు వృద్ధుడు. యువతి కళ్లతోనే నవ్వుకుంది మనస్ఫూర్తిగా.

"మంచిబట్టలు యివ్వలేదని మళ్లీ యేం గొడవ జరుగుతుందో" భయంగా అన్నాడు వృద్ధుడు.

"యీసారి అలా అవదులే" ధైర్యం చెప్పింది యువతి.

"యేం! నీ పెళ్లిలో బట్టలు మంచివి కావని పేచీపెట్టేడుగా" అందరిలోనూ తల వంపు అయిపోయిందికాదమ్మా"

"అప్పుడు ఆయనకంత తెలియదు నాన్నా! అన్నగారు వచ్చి పేచీపెట్టమన్నారట"

"అయితేమాత్రం అతనికి తెలియవద్దూ!"

తెలిసినా-వూరుకుంటే అన్నగారు కోప పడతారని అలా చేసేనన్నారు."

"పండుగకు యేమిచ్చినా పుచ్చుకుంటానని నీతో చెప్పేడా?" అన్నాడు వృద్ధుడు.

"వూం!" సిగ్గుతో అంది యువతి.

"అయినా అల్లుడిని తృప్తిపరచాలని యెవరికి వుండదమ్మా! యేదో వారివారి తాహతును బట్టి అల్లుళ్లకు బహుమతులు యిస్తారు. అలాంటప్పుడు అది బాగుండలేదు యిది వచ్చలేదు అంటే యిచ్చినవారి హృదయం యెంత గాయపడుతుందో తెలుసుకోలేరమ్మా వీళ్లు"

"మా అల్లుడు అలాంటివారు కాదులే నాన్నా" సిగ్గుతో భర్తను అలాంటివారినుంచి విడతీసుకుంది యువతి.

మూర్తి నవ్వుకున్నాడు.

పోర్టరువచ్చి రైలు వస్తున్నదని చెప్పి బెడ్డింగు తీసుకుని వరుగెత్తేడు. సంభాషణ విన్నతరువాత పెద్ద బహుమతులు యివ్వలేని మామలగురించి మూర్తి జాలిపడ్డాడు. "అల్లుడిని తృప్తిపరచాలని యెవరికి వుండదమ్మా!" అన్న ఆ వృద్ధునిమాటల్లో యెంత నిజం వుంది! అది గ్రహించుకోలేక వారిని బాధ పెట్టడం యెంత మూర్ఖత్వం! అనుకున్నాడు.

రెండు క్లాసు కంపార్టుమెంటులో కూర్చున్న మూర్తికి పదే పదే సీత జ్ఞాపకం రాజొచ్చింది. మధ్య మధ్య ఆ పల్లెటూరి యువతి-భర్తమాట చెప్పినప్పుడు ఆమె కళ్ళల్లోని కాంతి జ్ఞాపకం వచ్చేవి. చిన్నతనాన్నుంచీ పెంచి పెద్దను చేసిన తలిదండ్రులనూ, తోబుట్టువులనూ విడచి, వివాహమైన వెంటనే భర్తతో వెళ్ళిపోయేటప్పుడు యే యువతి హృదయం తరుక్కుపోదు! తన విషయం యేమయింది? వివాహానికి ముందు తానెవరో! సీత యెవరో! చూపులకు వెళ్ళడం, వివాహం నిశ్చయించుకోవడం, వివాహానంతరం తనతో తీసుకురావడం కూడ జరిగిపోయింది. పాపం! తన వారందరినీ అలా విడిచి రావడం కష్టంకాదూ. అయినా భర్తతో కొన్ని రోజుల బాంధవ్యంతోనే యెన్నో సంవత్సరాల బాంధవ్యం వున్నవారినికూడ యీ స్త్రీలు యెలా మరచిపోగలరో! నిజంగా మరచిపోతారా? యేమో స్త్రీల హృదయం అతి నిగూఢం గదా! తప్పనిసరిగా ఆ వ్యామోహాన్ని, ఆ వాత్సల్యాన్ని అలా హృదయంలో దాచి పెట్టుకుంటారేమో. ఆ శక్తి పురుషులకు వుందా? అని సందేహించేడు మూర్తి.

రైలు రాజమండ్రి స్టేషను చేరుకుంది. రామకృష్ణ, మూర్తి బావమరది అక్కడే కాలేజీలో చదువుకుంటున్నాడు. యింకొక 10 మైళ్ళు పోతే తాను దిగవలసిన స్టేషను రానేవస్తుంది. యింతలో యెవరో యిద్దరు స్టూడెంట్లు ఆ కంపార్టుమెంటులోనికి వచ్చేరు. అందులో రామకృష్ణ వుండడం చూచి మూర్తి తబ్బిబ్బు అయి పోయేడు. రామకృష్ణ కళ్ళు సంతోషంతో మిలమిలా మెరిసేయి.

"యిదేమిటి బావగారు! యింత ఆకస్మాత్తుగా మబ్బు లేని పిడుగులా వచ్చేస్తున్నారు" అన్నాడు నవ్వుతూ.

"యీ పిడుగు అంతేలే! యెక్కడకు వెళ్ళినా మబ్బులేనిపిడుగే" అన్నాడు మూర్తి రామకృష్ణ కళ్ళల్లో గోచరించే సీత కళ్ళల్లోని చిలిపితనాన్ని వింతగా చూస్తూ! రామకృష్ణ కూడా యింటికి వస్తున్నాడని తెలుసుకోవడంతో మూర్తి వూహించుకున్న తీయటి కలలన్నీ తలక్రిందులై పోయేయి. రామకృష్ణకు సీతకు పోలికలు చాలా వున్నాయి. కృష్ణ సీతకంటె కొంచెం పెద్దవాడైనప్పటికీ కొంచెం పొట్టిగా వుండడం వల్ల యిద్దరూ యించుమించు ఒకటే యెత్తు ఒకటే రంగు! ముఖ్యంగా అభ్యంతాన్ని సూచించే ఆ విశాలమైన కళ్ళల్లో కనుపించే

[illegible]

నవ్వేటప్పుడు చొట్టలుపడే ఆ బుగ్గలు వారికొక ఆభరణం. రామకృష్ణతో మాట్లాడుతూనే సీతను వూహించుకుంటూ కాలక్షేపం చేసేడు మూర్తి సరదాగా.

దిగవలసిన స్టేషను రావడంతో సామాను కూలి నెత్తినపెట్టి స్టేషనులోని పూల దుకాణంలో మంచి చేమంతి పొట్లం కట్టించి, వారపత్రిక ఒకటి తీసుకుని బావమరదితో కలసి అత్తవారింటికి వెళ్ళేడు మూర్తి.

యింటికి వెళ్ళే సరికి సాయంత్రం ఆరు గంటలయింది. షికారునుంచి తిరిగివచ్చి పడకకుర్చీలో పండుకుని తీరికగా లంక పుగాకు చుట్ట కాల్చుకుంటున్న మామగారు ఆనందంతో వుక్కిరిబిక్కిరి అయిపోయాడు. క్షేమసమాచారము లన్నీ అయిన తర్వాత ఆయనే స్వయంగా నౌకరులకు ఆజ్ఞలిచ్చి స్నానానికి నీళ్ళు,సబ్బు, తువాలు వగైరాల గురించి నానాహంగామా చేస్తుంటే మూర్తి నవ్వుకున్నాడు.

సీతను చూడాలని అతను తహతహలాడిపోతున్నాడు. కాని మామగారు విడిచి పెట్టడం లేదు. తన డ్యూటీలతో ప్రారంభించిన సంభాషణ ఈజిప్టును దురాక్రమణ చేసిన బ్రిటన్, ఫ్రాన్సులవరకూ సాగించేసేడు. తన లోకజ్ఞానం మామగారు పరీక్షిస్తున్నారేమో అన్న అనుమానం కూడా మూర్తికి కలిగింది.

తనను చూడాలనే కోరిక సీతకుమాత్రం వుండదా? ఒకవేళ యీ ప్రక్కగది కిటికీలోనుంచైనా చూడకుండా వుంటుందా అనుకున్నాడు. వెంటనే అతనికళ్ళు ఆత్రంగా నాలుగు మూలలకు పోయేయి. మాటలు తడబడ జొచ్చేయి. అనుకున్నట్లుగానే కిటికీ పూసల మధ్యనుంచి భిడియంతో చూచే రెండుకళ్ళు మూర్తి కళ్ళల్లోపడి తీయని కమ్మని సందేశాన్నియిచ్చి యెవరో వస్తున్న అలికిడి కావడంవల్ల మాయమయ్యేయి. మూర్తి దీర్ఘంగా నిట్టూర్చేడు. యింతలో చిట్టిమరదలు వచ్చి నెమ్మదిగా "అక్కతాళాలు యిమ్మంది" అని అడిగింది. మూర్తి తాళాలగుత్తి తీసి తివిగా మరదలుచేతిలో పెట్టేడు. కొద్ది సేపటికి ప్రక్కగదిలో తన పెట్టె తీసిన చప్పుడు, ఆ వెంటనే మొగలిపువ్వుసెంటు వాసన గదిలోంచి హైటికి వచ్చి నాసికాగ్రంలోనుంచి నషాళానికి పోయి మధురానుభూతుల్ని రెచ్చగొట్టేయి. మామగారి మాటలకు 'ఆ, 'వూఁ'సమాధానాలు మాత్రం చెబుతున్నాడు మూర్తి. మరో పావుగంటకు మూర్తికి భోజనానికి పిలుపు వచ్చింది.

"హమ్మయ్య!" అనుకున్నాడు మూర్తి.

యీసారి తప్పక సీత కనుపిస్తుంది అనుకున్నాడు. అతని గుండెలు ఆనందంతో వేగంగా కొట్టుకుంటున్నాయి. మర్యాదకు మామగారివద్ద సెలవుతీసుకుని భోజనాల గదిలోనికి బయలుదేరేడు. కొంపతీసి మామగారు తనతో తయారవడంలేదుగదా అని వెనుదిరిగి చూచేడు. ఆయన కూర్చున్నచోటనే వుండడంతో తృప్తిపడ్డాడు. పానకంలో పుడకలా రామకృష్ణ తయారవుతాడేమో! కాని అతని జాడలేదేమిటి అనుకున్నాడు. అతను రాకూడదని మనసులో కోరుకున్నాడు.

గదిలో రెండు విస్తర్లు వేసివున్నాయి. కావలసినవన్నీ ప్రక్కనే వెండి పాత్రలలో దగ్గరగా అమర్చబడి వున్నాయి. మూర్తి వెళ్ళి ఒక విస్తరివద్ద కూర్చున్నాడు. సందేహం లేదు రెండవది వాడికే! రామకృష్ణకు! అని మనసులోనే రామకృష్ణపై విసుక్కున్నాడు.

"సీతా! మీ ఆయనవచ్చి కూర్చున్నారు. నీవు కూడ వెళ్ళి కూర్చోవే" ఎవరిదో స్త్రీ కంఠం, బహుశః సీత స్నేహితురాలి కంఠం కాబోలు తియ్యగా అతని చెవుల్లో పడింది. కంటికి కనుపించని ఆ స్త్రీని దేవతగా వూహించుకుని మూర్తి ఆమెకు ధన్యవాదాలర్పించేడు. ఆ వెంటనే "రామకృష్ణా! నీవెందుకు ఇక్కడ? పోయి వీధిలో కూర్చో! వాళ్ళిద్దరినీ కులాసగా భోజనం చేయనియ్" అని శాసించింది. తరువాత కిలకిలమనే ఆడవాళ్ళ నవ్వులు సెలయేరు ధ్వనిలా గదిలోనికి వినిపించేయి. యెందుకో మూర్తికి కొంచెం సిగ్గువేసింది. కోర్కెలు అవధులు దాటుతున్నా, గుండెలు లోపల గంతులువేస్తున్నా, ముసిముసి నవ్వులతో ముఖం క్రిందికి దించుకున్నాడు. ఆ వెంటనే కమ్మని, తియ్యని మొగలిపువ్వు సెంటు వాసనగుప్పున కొట్టింది. క్రొత్త చీర, తాను కొనుక్కువచ్చిన, తనకిష్టమైన గులాబీరంగు సిల్కుచీరతో సీతవచ్చి రెండవ విస్తరివద్ద నెమ్మదిగా కూర్చున్నట్లు క్రీగంటితో, పెళ్ళిపీటలమీద పెండ్లికొడుకును చూడ ప్రయత్నించే పెండ్లికూతురులా చూచేడు. బైటకిలకిలా నవ్వినవారంతా తనను చూస్తారని అతనికి తెలుసు. కాని వెంటనే దభాలున తలుపు వేసిన చప్పుడు కావడంతో తల పైకెత్తేడు. ధైర్యంగా చిరునవ్వుతో సీతను చూచేడు. చూచిన వెంటనే త్రుళ్ళిపడ్డాడు. సీత చాలా మారిపోయింది. యిదేమిటి - యిలా నల్లబడిపోయింది? అసలు యీ వ్యక్తి తన సీత కానే కాదేమో అనిపించింది, దీర్ఘంగా ఆమె కళ్ళల్లోనికి చూచేడు. అవేకళ్ళు ఆ విశాలమైన అందమైన కళ్ళు! కాని యిదేమిటి? యీమె తన సీత అని తనకళ్ళు నమ్మలేకపోతున్నాయి. తనకళ్ళు తననే మోసం చేస్తున్నాయి. సీత నవ్వుతోంది నెమ్మదిగా. తలదించుకుంది సిగ్గుతో! పమిటె సర్దుకుంది వయ్యారంగా! మూర్తి తనమతిభ్రమించిందేమో ననుకున్నాడు. యీమె మరొక అమ్మాయి కాదుగదా? తన అత్తవారింటిలో తాను తెచ్చిన చీర కట్టుకుని తనకిష్టమైన సెంటు ప్రాసకుని తనతో కలసి భోజనం చేయడానికి తన సీతగాక మరెవరు సాహసిస్తారు? అయినా యేమిటో యీమె తన సీతకాదు! తనకళ్ళు తన్ను మోసం చేస్తున్నాయి. మూర్తి మరోసారి విచిత్రంగా ఆమెకళ్ళల్లోనికి చూచేడు. విశాలమైన ఆకళ్ళు వింతగా తనవైపు చూచి యేమిటన్నట్లు ప్రశ్నిస్తున్నాయి. నవ్వుతున్నాయి. ఆనందాన్ని ఆత్రుతను ముందుకు తోస్తున్నాయి. క్రొత్తవలపుల్ని కురిపిస్తున్నాయి.

మూర్తిని అనుమానం వెనక్కు లాగుతోంది. వలపు ముందుకు తోస్తోంది. అంతా తికమకలుగా వుంది.

"ఇదేమిటి యిలా అయిపోయేవు?" అన్నాడు మూర్తి!

"యెలా అయిపోయేను?" సిగ్గుతో జవాబిచ్చింది సీత.

యీ సమాధానంతో మూర్తి తటీమని పైకి లేచి పోయేడు. చూపుల్లో కోపం స్పష్టంగా తెలిసిపోతోంది! "యెవరు నీవు?" అన్నాడు కొంచెం గట్టిగా పోలీసు యిన్‌స్పెక్టరు దర్పంతో!

పక పక నవ్వుతూ పైకి లేచిన సీత విగ్గు లాగివేసి రామకృష్ణగా మారిపోవడం, కిలకిల నవ్వుతూ సీత, ఆమె స్నేహితురాలు లోపలకు రావడం ఒక్కసారే జరిగేయి.

అదే మూర్తికి మొదటి సంక్రాంతిసరదా! ★



# అలంకారాలూ పాతకొత్తలు

**బహుమతి పొందిన వ్యాసం**

మెడలో పూసలు, పులిగోళ్లు, మొలకు తోళ్లు చెట్ల ఆకులు మొదలైనవాటితో తియారయిన మోకాళ్లు దిగీదిగని దుస్తులు, నడినెత్తికి చేర్చి ముడివేయబడ్డ జుట్టు చుట్టు చుట్టబడిన పువ్వులతో బుజంమీద పిల్లాడిని కూర్చోపెట్టుకుని అమాయకపు నవ్వు వెదజల్లే ఆదిమజాతి స్త్రీ మూర్తినీ, కంటికి కాటుకు, కాలికి జోడుతో, బుజాలు దిగీదిగని కత్తిరింపుజుట్టుతో, సాటిన్ లోపావడ, షిఫాన్ చీర, వెల్వెట్ జాకెట్టులతో కావ్యనాయికల బింబాధరాన్ని జ్ఞాపకం చేసే రంగు (Lipstick) వేయబడిన పెదవులు గులాబిరంగు అంచు అంటని చెక్కిళ్లతో, శరీరంలోని ప్రతిభాగాన్ని కళాత్మకమైన అలంకరణతో నింపిన అధునాతన

మతుకుమల్లి సుశీల

స్త్రీమూర్తినీ ఒకేసారి మనోనేత్రంముందు సృష్టించుకోగలిగితే అనాదినుంచీ స్త్రీల అలంకరణలో అతివేగంగా వచ్చిన మార్పులన్నీ తెరమీది బొమ్మల్లా కనిపిస్తాయి.

## సహజం

అలంకరణయందపేక్ష ప్రాణికోటి కంతటికీ సహజమేనంటే ఆశ్చర్యంలేదు. కాని మానవునికి మాత్రమే విజ్ఞానాభివృద్ధితో పాటు అలంకరణసాధనాలను కూడా పెంపొందించుకునే శక్తి వున్నది. కాబట్టే అలంకరణ పద్ధతులు త్వర త్వరగా మారిపోతుంటాయి. స్త్రీ అలంకారప్రియ. ఆయాకాలములలో లభ్యమయే వస్తు సముదాయం సహాయంతో వీలైనంతవరకూ ఆకర్షణీయంగా కనుపించాలనే వాంఛ హెచ్చు. నలుగురు స్త్రీలు సమావేశమైనప్పుడు ఎవరికి వారే మిగిలినవారి దృష్టిని ఆకర్షించి అక్కడే నిలబెట్టాలని ప్రయత్నిస్తారు. ఇప్పుడు Out of date అయినా మొన్న మొన్నటి వరకూ మన స్త్రీల నగలమోజుకి ఇదే కారణం.

మా నాన్నగారు అంటుండేవారు: కుబ్బపాత్రానికి రెండు వైపులా బంగారు తాప



డం చేయిస్తే మెళ్ళో వేసుకు తిరిగేందుకు కూడా ఆడవాళ్లు సిద్ధమేనని.

ఒకవిధంగా చూస్తే ఏకాలపు అలంకరణ ఆకాలపు నాగరికతకు ప్రతిబింబమని చెప్పవచ్చు. నాగరికతలో క్రమేణా వచ్చేమార్పులన్నీ అలంకరణలో చాలావరకూ రికార్డు చేయబడతాయి. స్థూలంగా స్త్రీల అలంకరణ 4 భాగాలుగా విభజించవచ్చు. (1) ఆభరణములతో అలంకరణ (2) కేశాలంకరణ (3) వస్త్రాలంకరణ (4) ఇతర సాధనములతో అలంకరణ.

## రాతియుగపు నాతిరీతి

మన పరిశీలన ఆదిమకాలంనాటి స్త్రీల అలంకరణలో ప్రారంభిద్దాం. దానినే రాతియుగమంటారు చరిత్రకారులు. అప్పుడు భూభాగం చాలావరకు అడవులతో నిండి ఉండేది. కాబట్టి వారి ఆటవిక జీవితచ్ఛాయలువారిఅలంకరణలోకూడా ప్రస్ఫుటమౌతుంటాయి. అడవిలో విరివిగా దొరికే పూసలు, పులిగోళ్ళ దండలు గుచ్చి మెళ్ళో వేసుకునే వారు. (అప్పటికి లోహాముల ఉపయోగం తెలియదు) అలాగే పూసల దండలు పువ్వుల దండలు చేతులకు, కాళ్లకు, జుట్టుముడికీ కట్టుకునే వారు. వస్త్రములు నేయుట తెలియదు కాబట్టి జంతువుల చర్మములు, చెట్ల ఆకులతో తయారుచేయబడిన దుస్తులు నడుమునుంచి మోకాలికి కొంచెము క్రింద వరకూ కట్టుకునే వారు. ఇప్పటికీ మనదేశపు కొండజాతి స్త్రీల బొమ్మలలో శరీరోర్ధ్వ భాగం అనాచ్ఛాదితంగా వుండటం చూడవచ్చు

వేలకొలది సంవత్సరములు యీ విధంగా గడచిన తరువాత బహుశా చరిత్రలో సింధు నాగరికతా నిర్మాతలుగా పేర్కొన బడినవారు వస్త్రములు నేయుట, లోహాములతో పనిముట్లు, నగలు చేయటం కనిపెట్టారు. ఆ కాలపు నగలు మన దేశములోని పెద్ద పెద్ద పట్టణములలోని పురాతన వస్తుప్రదర్శనశాలల (మ్యూజియమ్స్)లో చూడవచ్చు. వీరందరూ క్రీస్తు పూర్వము 2, 3 వేల ఏండ్ల క్రిందటివారు.

## అజంతా కాంత

తరువాత ద్రావిడులు, ఆర్యులు మొదలైనవారంతా వచ్చి క్రీ. పూ. 600 నాటికి అంతా కలసి ఒక భారతజాతిగా ఏర్పడ్డారు. ఈ విశ్వతత్వరీతిగా నాగరికతలో కూడా

పూర్వులు సర్వదా పూజ్యులు. వారి వరవడి శిరోధార్యం. అయితే, దేశకాల పరిస్థితులు, సాధ్యాసాధ్యాలు, సవ్యాపసవ్యాలూ కూడా త్రోసిరాజనరానివే. వాటిని పాటించడంవల్ల ప్రాచీనాచారాలకు అపచారాలేమీ జరుగవు. సదసద్వివక్షణతో 'నిన్న'నూ 'నేటి'నీ సమన్వయించుకుంటూ 'రేపు' వైపు నడవడం నాగరికత లక్షణం. అంతే తప్ప, ఇది పూర్వులపద్ధతి అన్నకారణంగానే అనుకరించడమూ మంచిదికాదు; పూర్వులది కాబట్టే, మార్పు కావాలని నచ్చచెప్పుకొని మనకి నచ్చని పద్ధతులు అవలంబించడమూ తగదు. అలంకరణ పద్ధతుల పరిశీలనపై ఈ పోటీకి వ్యాసాలు వ్రాసిన మహిళల్లో నూటికి 90 మంది వెలిబుచ్చిన అభిప్రాయం ఇదే. ఒక్క ముక్కలో చెప్పాలంటే 'పాత కొత్తల మేలు కలయిక' అన్నమాట. ఈ పోటీలో బహుమతి పొందిన శ్రీమతి మతుకుమల్లి సుశీలగారి వ్యాసాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాము.

చాలా మార్పు వచ్చింది. సున్నితమైన వస్త్రములు నేయుట, వెండి, బంగారులతోనే కాక, నవరత్నములను కూడ నగలలో వుపయోగించేవారని ఇంచుమించు ఆ కాలములో వ్రాయబడిన భారతీయ ఇతిహాసముల లోని దేవతల వర్ణనలు, రాజుల, చక్రవర్తులు, వారి స్త్రీల అలంకరణవివరాలూ చూస్తే తెలుస్తుంది. అలాగే క్రీ. పూ. 623 నుండి క్రీ. పూ. 543 వరకు జీవించిన గౌతమ బుద్ధుని జీవితఘట్టాలు అజంతా, ఎల్లోరా గుహలలో శిల్పరూపంలో సాక్షాత్కరిచాయి. ఇందులోని స్త్రీమూర్తుల కేశాలంకరణ చూస్తే (Ajantha Hair Styles) కొంచె మించుమించు ఆ కాలములోని (సుమారు క్రీ. పూ. 4 వ శతాబ్దము) స్త్రీలు ఏ విధంగా తమ శిరోజాల్ని అలంకరించుకునే వారో ఊహించవచ్చు.

ఈ విధంగా అలంకరణ నానాటికీ అనేక మార్పులను చెందుతూ వున్నది. ప్రస్తుతం మనకి ప్రత్యక్షసాక్ష్యంతో సహా యిప్పటికి మూడు తరముల ముందు నాటి అలంకరణను గురించిన వివరాలు లభ్యమౌతాయి. అంటే గత శతాబ్దానికీ, యీ శతాబ్దానికీ సంధి కాలమునుంచీ, నేటివరకూ స్త్రీల అలంకరణలో వచ్చిన మార్పులన్నమాట. మన అమ్మమ్మల్నయినా, నాయనమ్మల్నయినా అడిగితే వారి చిన్ననాటి అలంకరణ పద్ధతులు, ఇప్పుడు వచ్చిన విలయం (!) అతి చాకచక్యంగా వర్ణిస్తారు. అదో కథలాగ.

## వేణీ సంహారం

పూర్వకాలంలో సాధారణంగా ప్రజ వారూ, ముఖ్యంగా స్త్రీలు, వారి వారి తాహతునుబట్టి నగలు ధరిస్తూవుండేవారు. పొడవైన, దట్టమైన శిరోజములు అన్ని కాలములలోను అందానికి ముఖ్యాంగముగా భావింపబడ్డాయి. మన పూర్వీకులు కావ్యనాయికలను కుటిలాలకా అనీ అరాళకుంతలా అనీ వర్ణించేవారు. సత్యభామ కృష్ణుణ్ణి తన జడలో కొట్టేదనే కథకూడా దీనికే



ఉదాహరణగా తీసుకోవచ్చు. ఆ రోజుల్లో అలంకరణకి కావ్యనాయికలు ఆదర్శంగా వుండేవారు.

అంటే ప్రతివారూ ఆవిధమైన అలంకరణ చేసుకునేవారని కాదు. కాని అలంకార ప్రియులైనవారు వారిని ఆదర్శంగా భావించేవారు. రాజగృహములలో తలదువ్వేందుకు ప్రత్యేకపు దాసీలు వుండేవారుట. వీరు తరతరాలుగా ఆ వృత్తిలో శిక్షణపొంది అనేక రీతులుగా కేశాలంకరణ చేస్తూండేవారు. జమీందారుల సంస్థానాధీశ్వరుల గృహాలలో కూడా వీరు ఉండేవారు. అన్ని విధములైన శిరోజాలంకరణల్లో, వాల్జడ ఎక్కువ అమలులో వుండేది. మన కవులుకూడా తమ గ్రంథాలలో "వెలది వేనలినీల విషధరంబై తోచు" యిత్యాది వర్ణనలు విదితమే.

శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబాలలో మాత్రం స్త్రీలు చక్కగా కుడిచెవికి దగ్గరగా నున్నగా నిగనిగలాడుతూ కొప్పు పెట్టుకుని దానినిండా పువ్వులు పెట్టుకునేవారు. ఇంకా కొన్నాళ్ళ తరువాత వయస్సు ముదిరిన స్త్రీలంతా కొప్పు పెట్టుకునేవారు. చెవి ప్రక్కనుంచి వచ్చే కొప్పుగొలుసు తళతళతో యీ కొప్పు సౌందర్యం పరమావధినందుకొనేది. ఈనాటికే మా అమ్మమ్మ కొప్పే పెట్టుకుంటుంది. కొప్పు గొలుసు మాత్రం లేదనుకోండి.

## అమ్మమ్మ స్వగతం

అమ్మమ్మా! నీ చిన్నప్పుడు ఏమేమి నగలు పెట్టుకున్నావంటే అరమోడ్పు కన్నులతో గతాన్ని స్మరించుకుంటూ వరుసక్రమంలో ఆ నగలన్నీ వర్ణించుకుపోతుంది.

పాపిటలో పాపిడిపిందిరీలు పాపిడికి రెండు వైపులా సూర్య చంద్రులు, తమలపాకు, మొగలిరేకు నడినెత్తికి కొంచెం క్రిందుగా నాగరమో, రాగిడీయో వేసుకుని జడమధ్యలో జడబిళ్ళ, చివర జడకుప్పెలు వేసుకునేవారట. జడబిళ్ళలు గుండ్రగా కొన్ని, నాగుపడగ ఆకారంలోనూ కూడా వుండేవిట. అప్పుడప్పుడు జడమీద బంగారపు జడ కూడా కుట్టుకునేవారుట.

ఇక చెవులకు దుద్దులు, పొట్టిగా పెద్దవిగా జూకాలు, చంపస్వరాలు, బావిలీలు వుండేవిట. కుడి ముక్కుకు ముక్కెర, ఎడమ ముక్కుకు బేసరి, మధ్య అడ్డబాస ధరించేవారుట.

చేతులకు మోచేతికి పైన దండకడియాలు (వీటినే నాగవత్తులని కూడా అంటారు) వంకీలు, మణికట్టువద్ద గాజు,గట్టి గొలుసులు, వేళ్ళకు వుంగరాలు పెట్టుకునేవారుట.

మెడలో కంఠమునకు దగ్గరగా గజ్జె

# ★ అలంకరణలో పాతకొత్తలు ★

పట్టెడ, జిగినీ గొలుసు, రాళ్ళ అడ్డిగ, కొంచెము క్రిందకు కాసులదండ, వరహాల పేరు, మొహిరీల పేర్లు, అన్నింటికంటె పొడుగుగా చంద్రహారాలు, అటుకుల గొలుసులు, గడియారపు గొలుసుల వంటివి వేసుకునేవారు.

నడుముకు ఒడ్డాణము. కాళ్ళకు అందెలు, కడియాలు, గజ్జల గొలుసులు, గట్టిగొలుసులూ పెట్టుకునే వారుట. అమమ్మ మాటలు వింటుంటే.

"ఘల్లు ఘల్లని కాళ్ళ
గజ్జెలందెలు మ్రోగ
కల హంస నడకల

కలికి ఎక్కడికే" అనే పాట చెవుల్లో మారోమ్రోగింది.

ఆ కవితా సుందరి ఛాయామాత్రంగా కన్నుల్లో కదిలింది. వివాహితలు యీ నగలన్నింటితోపాటు కాలి వ్రేళ్ళకు వెండితో చేసిన మట్టెలు పెట్టేవారట. సరే మెడలో మంగళ సూత్రములుధరిస్తారు.

అమ్మమ్మ కాలంనాటి నగలివి. ఎవరి తాహతుని బట్టి వారు ధరించేవారు. ఈ నగలన్నీ ఈ లోజుల్లో భరతనాట్యం చేసే వారు కూడా చాలవరకు పెట్టుకుంటూ వుంటారు.

బట్టల విషయంలో అమ్మమ్మని కదిలించటం భయం "గాలేస్తే ఎగిరిపోయేటు ఉల్లి పొరల్లాంటి ఆ చీర లేమిటే! మా కాలంనాడు బనారసు చీరెలు, కలంకారీ చీరెలు ఒంటికి నిండుగా ఎంత అందంగా వుండేవి" అంటుంది. అప్పుడన్నీ స్వదేశీ వస్త్రాలేగాని ఇప్పటంత విరివిగా విదేశీ వస్త్రాలు లేవేమో అనుకుంటూ నేను.

## విపరీతపు రీతులు

సుమారు 40 సంవత్సరాల క్రిందటివరకూ పైన చెప్పిన నగలలో తమలపాకు మొగలి రేకు ఇత్యాదులు తప్ప మిగిలినవన్నీ ధరిస్తూనే వుండేవారు. తల దువ్వుకోవటంలో కూడా కొంచెం మార్పువచ్చింది. కొప్పు స్థానంలో బిళ్ళచుట్టు, 'S' చుట్టు వచ్చాయి. కొంచెం పెద్దవాళ్ళు జడ అల్లి మధ్యపాయ తీసి గుండ్రముగా మెడకు కొంచెము పైగా బిళ్ళ చుట్టు చుట్టుకునేవారు. చిన్న వాళ్ళు 'S' చుట్టచుట్టుకునేవారు.

ఈ కాలంలో వచ్చిన మరియొక మార్పు దుస్తులు ధరించేపద్ధతిలో. ముఖ్యంగా రవికెల్లో ఈ మార్పు బాగా కనిపిస్తుంది. అమ్మమ్మరవికెకు మెడ కత్తిరింపు అంటూ ఏమీ లేదు. చేతులు మోచేతుల క్రిందికి వుండేవి. (చిన్న తనంలో మాత్రం కంటె మెడ చొక్కాలు, చేతులు ముంజేతుల వరకూ వుండి, కుచ్చెళ్ళు వుండేవి వేసుకునేవారలు) కాని ఈ రోజుల్లో రవికెకు చేతులు మోతుల పైకి పోయాయి. మెడకు గుండ్రని కత్తిరింపు అమలులోకి వచ్చింది. పూర్వపుచమ్కీ, పూసల అంచుల స్థానములో జరీ అంచులు, అద్దకపుటంచులు వచ్చాయి.

ఇంకా తరువాత—సుమారు 25 సంవత్సరాల క్రిందట నగలు ఎక్కువగా ధరించటం "మోటు" అయింది. "మోతాదుగా" ధరించే వారు. గజ్జెలపట్టెడ, జిగినీనాను కూడా మోటు అయాయి. వాటికి బదులుగా అక్కడక్కడ "నెక్లెసులు", జూకాలకు బదులు లోలకులు వచ్చాయి. బిళ్ళ చుట్టు, 'S' చుట్టుల స్థానాన్ని బర్మాముడి, 'బన్' చుట్టు ఆక్రమించాయి.

రవికెలలో విపరీతపుమార్పు వచ్చింది. అప్పటినుంచీ సినీమాల ప్రభావం నాగరికత మీద స్పష్టంగా కనిపిస్తుంది. అలంకరణకు ఆదర్శంగా ఉంటూవచ్చిన పూర్వపు కావ్య నాయికలను ఆనాటి సినిమాతారలు త్రోసి రాజన్నారు.

ప్రజలంతా సినీమాలు విరివిగా చూడక పోయినా, చూసినవారిని మిగతా వారనుకరించేవారు.

తత్ఫలితంగా రవికెలకు మెడలు 'V' ఆకారంలో బాగా పెద్దవయాయి. చేతులు కూడా మోచేతినుంచి జబ్బలపైకెగబ్రాకాయి. పూర్వం చిన్నపిల్లలు వివాహాత్పూర్వం పరికిణీలు, జాకెట్లు ధరించేవారు. ఈరోజుల్లో 9, 10 సంవత్సరాల బాలికలు గౌన్లు ధరిస్తున్నారు. ఇది ఆనాటి పాలకుల నాగరికతా ప్రభావము కావచ్చు.

## మార్పుల కారణాలు

యుద్ధకాలంలో, బంగారం ధర విపరీతముగా పెరగటంవలననైతేనేమి, పాశ్చాత్య నాగరికతా వ్యామోహంవల్లనైతేనేమి, లేదా అప్పటికి 10, 15 సంవత్సరములుగా బాపూజీనగలమీద వ్యామోహం తగ్గించుకోమని మహిళలకు చేస్తూన్న విజ్ఞప్తి ఫలితం అన్నా అనండి, మొత్తానికి ఎక్కువనగలు పెట్టుకోవటం పూర్తిగా ఫేషన్ కాకుండా పోయింది.

మెడలో సన్నని గొలుసు, చేతికి ఒకటి లేక రెండుజతల గాజులకంటె ఎక్కువ ధరించేవారు తప్పనిసరిగా అనాగరికుల జాబితాలో చేరేవారు. అందుకని, నగలున్న భాగ్యవంతులు కూడా పెట్టుకోవటం మాని వేశారు! వస్త్రధారణలో కూడా మార్పులు వచ్చాయి. రవికెలకు మెడలు చిన్నవయాయి. చేతులు పొట్టిగా కుచ్చులు

64-వ పేజీ చూడండి)

# ముగ్గుచూడు, ముగ్గందముచూడు

సంక్రాంతి-ముగ్గుల పండుగ, ముస్తాబుల పండుగ కూడాను. నేటి నవ యువతులు face powder లకు, సబ్బులకు అలవాటుపడిన స్త్రీలకు-పాతకాలపు అలంకరణలన్నీ యేవగింపు, అసహ్యము.

కాని ముగ్గూ, కళ్లాపికీ, పసుపుకుంకాలకు గల ప్రయోజనాన్ని, ప్రాముఖ్యాన్ని చాల మంది గమనించలేకున్నారు. గమనించినా పట్టించుకోకుండా వున్నారు.

మన కట్టు, బొట్టు, కౌటుక, అలంకరణము తీరు, గృహనిర్వహణము, నలుగురు కలుసుకొనడానికి ఏర్పడిన పేరంటము, ఆచార సంప్రదాయము మున్నగువాటియందు ఎంత అందమున్నది! ఆనందమున్నది! ఎంత ప్రయోజనం వున్నది. మన పెద్దలు వీటిని ప్రసాదించారు.

మనదేశపు స్త్రీ బట్టకట్టులోనే వున్నది-మన నాగరికత, మన శిల్పమూను. యావత్ భారతదేశంలోనూ, దేవతా స్వరూపిణిలా ద్యోతకమయ్యేది మన తెలుగుతల్లి. కుచ్చెళ్ళు మలచుకొని, ఒడ్డాణం పెట్టుకొని, పసుపు రాసుకొని, కుంకుమ దిద్దుకొని, సారాణ తీర్చుకొని, పాంజేబులు పెట్టుకొని పుణ్యాంగనలా తీర్చి దిద్దుకొన్న తెలుగుతల్లి దేవతలా కనుపిస్తుంది. ఇటువంటి సుగాత్రిని మనకు చిత్రాలలో స్వర్గీయ దామెర్ల రామారావు గారు చిత్రించి చూపారు.

అడవి బాపిరాజుగారి హిమబిందు, గోన గన్నారెడ్డి మొదలగునవి, విశ్వనాథవారి వేయిపడగలు చదువుతూవుంటే మన నాగరికత, మన అలంకరణలో ఇంపులూ, సొంపులూ ఏమిటో తెలుస్తుంది. వాటిని చదువుతూ వుంటే నేడు మనమున్న పరిస్థితిని చూచి యెంతయినా కించపడా లనిపిస్తుంది.

తెలుగు బాలికలకి-పరికిణీ, వోణీ, జూకాలు నెలవంక, జడకుప్పెలు, కుంకుమ తిలకం - ఎంతో అందంగా వుంటాయి. వీటిని జ్ఞాపకం చేసుకొని మరల మన పిల్లలని, చెల్లెళ్ళని యీ అలంకారములతో నింపుకోవాలి. చిట్టి తమ్ముళ్ళకు, శాయెత్తు, మొలకు మామిడి పిందెలు, కాళ్ళకు గజ్జెలు అందంగా వుంటాయి. అందాల మోసులెత్తే ఈ నగల సొగసులను మనము మరువకూడదు.

నేటి నవనాగరికులకు, విద్యావంతులైన స్త్రీలకు పసుపురాసుకోవడం, యేహ్యంగా వుంటుంది. కాని పసుపురాసుకోవడంవల్ల మన శరీరమునకు అంటుకొన్న సూక్ష్మజీవులు నశించుటయేకాక, శరీరమునకు ఒక విధమైన వర్చస్సుకూడ కలుగును. పల్లెటూళ్ళకు వెడితే అక్కడ మనకు యెక్కడ చూచినా పసుపురాసుకున్న పుణ్యాంగనలు కనిపించె

జనమంచి జాహ్నవి

దరు. ఏ యింటిని చూచినా కన్నులపండుగగా వుండును.

స్త్రీలు తెల్లవారుఝాముననే లేచి స్నానముచేసి యింటిముందు కళ్ళాపుచల్లి ఒకరికంటె వొకరు పోటీపై ముగ్గులను పెడుతూవుంటారు. వారి ఆనందమును, వుత్సాహమును చూచితీరాలి స్వయంగా.

అసలు కళ్ళాపు అంటేను, కళ్ళాపును ఎందుకు మనవారు ఆచరిస్తున్నారో నేటికాలపువారికి తెలియక హేళన చేస్తున్నా రనిపిస్తుంది. పేడను, నీళ్ళలో పలుచగా కలిపి చల్లుటనే కళ్ళాపు అందురు. మన ప్రాచీన రాజసౌధప్రాంగణములందు కస్తూరినికూడ కళ్ళాపుగా చల్లెడివారని మన పూర్వ గ్రంథములు చాటుచున్నవి.

అప్పుడే వేసినగోమయము కస్తూరితో సమానమని ఆయుర్వేదగ్రంథములో వున్నది. ఈగోమయముతో యిల్లలికినా, కళ్ళాపు చల్లినా, విష రోగక్రిములు, సూక్ష్మ జీవులు దరిచేరవు. ఇవి బొగ్గుపులుసు వాయువును ప్రాణవాయువుగా మార్చును. ఈ పచ్చని రంగుపైన తెల్లనిముగ్గు వేయుట వలన యెనా నందముగా వుండుటయే కాక సూక్ష్మ జీవులను దరిచేరనీయకుండా చేయును.

నీలపుటాకాశమున ధవళకాంతులనిచ్చు నక్షత్రలమును పరమాత్మ స్వరూపముగా తలచి, దానిని మన ఇంటిముందట ప్రతిష్టించడమే ముగ్గువేయడము అనవచ్చును.

జానపద గేయములలో ముగ్గును గురించి ముచ్చటైన పాటలున్నవి :

ఇల్లు చూడు-ఇల్లందము చూడూ-ఇంటి
లోని ఇల్లాలిని చూడు
ముగ్గుచూడు-ముగ్గందముచూడు- ముగ్గులో
వున్నా మురిపెము చూడూ...

రాజర్షి జనకుడుకూడ రాజకుమారికనియైన యెంచక సీతా దేవిచే ముగ్గులు వేయించె, నట :

"సంతానపరుడమ్మ, జనకమహాముని
తా ముద్దు



సంక్రాంతి ముగ్గు
చిత్రకారుడు : నేతులూరి లక్ష్మణరావు,
(నర్సరావుపేట)

# సంక్రాంతి ఆటలు

నాకు అప్పుడు తొమ్మిది సంవత్సరముల వయస్సు ఉంటుందేమో. నేనూ మా మామయ్యకూతురూ (నా ఈడుదే) తలంట్లు పోసుకొని, కొత్తబట్టలు కట్టుకొని, ప్రతి సందులోవున్న భోగిమంట చూడటానికి బయలుదేరాము. దారిలో యిక్కడది పెద్ద మంటే అంటే యిక్కడ పెద్దమంట అంటూ నెమ్మదిగా పదకొండున్నర గంటలకు యిల్లు చేరుకున్నాం. ఇంట్లో అడుగు పెట్టటానికే భయం వేసింది యేమంటారో అని. బిక్కు బిక్కుమంటూ హాలులోకి అడుగుపెట్టాం. వేళాకోళంగా మా అన్నయ్య, "ఒసే పాపా ఇంకా యెక్కడా మంటలు మిగిలిపోలేదా? చూడటానికి అంటూ ప్రశ్న వేశాడు. అన్నయ్యో మరేం అంటూ చూసినవి వర్ణించడం ప్రారంభించాము. "చాల్చాలు వెళ్ళి భోం చెయ్యండి. ఎండకొట్టిన ముఖాలూ మీరునూ" అని అన్నాడు. మరి మాట్లాడకుండ యింట్లోకి వెళ్లేం, కాళ్ళు, చేతులు కడుగుకొని వంటయింటివేపు నడిచాం.

తలుపు చేరవేసివుంది. మనుష్యుల అలికిడి లేదు. అందరు భోజనం చేసివేశారేమోనని భయంవేసింది. మేం ఊరిలోకి వెళ్ళేటప్పుడు అందరూ యింట్లోనే ఉన్నారు. వాళ్ళంతా ఏమయినారో మా కర్థంగాలేదు. అకస్మాత్తుగా మా అత్తయ్యగొంతు వినపడింది. "అది గొనేవ్. మా అమ్మగొంతు లాగా వున్నది"అంటూ దగ్గరగా జారవేసిన తలుపు తోసింది చిట్టి.

## వల్లూరి అంజనీదేవి

అక్కడ బొమ్మలు పెట్టడం పూర్తి కావస్తోంది. "చూశారా, మేం లేకుండా బొమ్మలు పెట్టేస్తున్నారూ అని చిట్టి గొణిగింది.

మీరు దేనికి, యిక్కడ? బొమ్మలుబద్దలు కొట్టటానికితప్ప దేనికీ పనికిరారు. పదండి. భోజనానికి అంటూ ఆ గది తలుపు గొళ్ళెం పెట్టింది అత్తయ్య.

భోజనాలు పూర్తిఅయ్యాక మా చిట్టి అక్కయ్యలు పట్టుచీరెలు కట్టుకొని పేరంటానికి బయలుదేరారు. మే మిద్దరము కూడ బట్టలు కట్టుకొని వస్తాం అని మారాంచేశాం.

"మీరెందుకే పిలవడానికి? అక్కడికే వచ్చేదినూ వాళ్ళ బొమ్మలు పగలగొట్టేదీను" అని విసుక్కున్నారు వాళ్ళు. మూగి వాళ్ళ లాగా మూతి ముడుచుకుని వాళ్ళ వెనకాలే యింట్లోవాళ్ళు యెటునడుస్తే అటు నడిచాం మేము. వాళ్ళు మమ్మల్ని మరిపించలేమని తెలుసుకొని చివరికి మా అత్తయ్యతోటి ఫిర్యాదు చేశారు. మీరు దేనికే పెళ్ళికి వెళ్ళుతూ పిల్లిని వెంటబెట్టుకొని వెళ్ళినట్టు అని ఒక్క కసురు కసిరింది. ఇద్దరం బిక్కమొగాలు వేసుకొని హాలులోకి పోయి, చెరి ఒక కుర్చీలోనూ కూర్చున్నాం ఒకరిమొహాలు ఒకరు చూసుకుంటూ. ఇంతలోకి, మా అన్నయ్య వచ్చి, "ఎందుకే అలా ఏడుస్తారు.? మీరు మీ క్లాసు పిల్లలను పిలుచుకురండి మంచి ఆటలు నేర్పాను. ఆడుకుందురు గాని. ఏడిచారంటే మరి చెప్పను." అని కళ్ళుతుడిచి పిలవటానికి పంపించాడు.

మేం వెంటనే మా స్నేహితురాళ్ళ యిండ్ళకి పరిగెత్తాం, అక్కడున్న మా స్నేహితురాళ్ళందరిస్థితీ మా లాగానే వుంది. అందరికన్నూళ్ళు వాచేఉన్నాయి. కొందరు గూట్లో కూర్చుని యేడ్చేవారు, ఇంకొందరు

# ముగ్గుచూడు ముగ్గందముచూడు

కూతురుని తాజేరపిలిచి ఆవుపేడదెచ్చి
అయినిళ్ళు
అలికి—గోవుపేడ తెచ్చి గోపురాలు
అలికి—ముత్యాలు
చెడగొట్టి ముగ్గులేయించి, పగడాలు చెడ
గొట్టి పట్టిలేయించి."

ఈ పై పాటవలన ముగ్గులకెంత ప్రాముఖ్యత ఉన్నది తెలియుచున్నది.

ఈ ముగ్గులలో అనేకరకములున్నవి. వాటిలో ఎంతయో భావముకలదు. దేశకాల ప్రాంతములు సూచించు ముగ్గులు వేయుట ఒక కళ. వీటిలో యనేక సంకేతములు ఇమిడియుండును. నవరసములను వర్ణించు ముగ్గులుకూడ కలవు. అందులో సంక్రాంతి ముగ్గుల కెక్కువ ప్రాముఖ్యము కలదు. అందు ముఖ్యంగా "నాగకుండలీ ఛందము." ఈ ముగ్గు ప్రజలు చలికెట్లా ముడుచుకొందురో తెలియచేయును. రాధాకృష్ణముగ్గు మానవ సంసారసుఖమును, పుష్పగుచ్ఛము ప్రజల సంతోషమును-జీవాత్మ-పరమాత్మ అనెడి ముగ్గు-ప్రజల యాధ్యాత్మిక భావమును తెలియచేయును.

మార్గశిర పౌర్ణమికే "కోర్లమ్మ పున్నానికి కోటి శిరస్సులు కావాలి? అంటారు. ఈ నానుడి సంక్రాంతికి ముందు కాలము అనారోగ్యకరమైనదనీ, అప్పుడు ప్రజలు వ్యాధిపీడితులైయుందురనీ తెలియుచున్నది. అందుకే మనవారు కోర్లమ్మకు సంబరాలు చేసి నెలపడతారు. దీనివలన మరణసంఖ్య తగ్గించుటకుగాను ఆమెను మొక్కుతారు.

సంక్రాంతి నెలపట్టినప్పటినుంచి యీ మరణములసంఖ్య తగ్గును. వాతావరణము పొడిగా వుండి యారోగ్యకరముగా వుంటుంది. ఎక్కడచూచినా సంతోషము వెల్లివిరుస్తూ వుంటుంది. దక్షిణాయన కాలంలో చనిపోయినవారికి పుణ్యగతులు లేవనియు ఉత్తరాయణంలో చనిపోయిన పుణ్యగతులు కలవని మనవారి అభిప్రాయము. అందుకే ఉత్తరాయణ సంక్రాంతికి మనవారెక్కువ ప్రాముఖ్యత నిచ్చినారు.

ఇంక గృహాలంకరణ. ఇప్పుడు చాలమంది వారి వారి గడపలకు, ద్వారబంధములకు—వార్నిషు రంగులను పూయుచున్నారు. ఇవి చూడడానికి అందముగా యున్నా పసుపు కుంకుమ లెందుకురాయాలో, దానిని రాయడంవల్ల మనకెన్ని విధముల లాభం వుందో గమనించడం లేదు.

పసుపు లక్ష్మీదేవి పరముగను, కుంకుమ గౌరీదేవి పరముగను యేర్పరిచారు మన పూర్వులు. రెండును మంగళప్రదమయినవే. సిరిసంపదల కాలవాలమయినవి. పసుపు గొప్ప ఓషధి. క్రిమిసంహారి. దీని మీదనుండి ప్రసరించు గాలి కూడ శుభ్రపడుతుంది. ఆయుర్వేద శాస్త్రరీత్యా అంటువ్యాధులను దరిచేరనీయవు. మామిడాకు అందము మరి దేనికీరాదు. ద్వారములకు పసుపు-కుంకుమలుపెట్టి ఈ ఆకుపచ్చని తోరణముకట్టిన ఇల్లువిందుగా, కన్నుల పండువగా ఉండును. ★



పాలవెల్లి

శ్రీమతి ఎ. వి. రమణ— సికింద్రాబాదు.

బలవంతంగా పుస్తకం చదివేవారు. యిలాగే మా అన్నయ్య కొత్త ఆటలు చెప్తాడుట వస్తారా అని అడిగాం. వాళ్ళు వస్తామని అన్నారు. అందరం మా పెరటిలో పోగయ్యాం. మా అన్నయ్య చెప్పిన ఆటలు ఆడుకున్నాం. చాలా బాగున్నాయి

ఆ మరుసటి సంవత్సరం మమ్మల్ని పేరంటం తిమలో పిలువడానికి మా అక్కయ్యలు రమ్మంటే మేం రాము అని నిక్కచ్చిగా చెప్పేశాం. కాని ఆ పై సంవత్సరము వాళ్ళు ఆ బాధ్యతనంతా మా మీద పెట్టేశారు ఎప్పుడూ మేమే నేమిటి మీరు వెళ్ళండి అని తోసేరు. పేరంటం పిలువటంకూడ సరదాగా నే ఉంది. ఎందుకంటే మేం చిన్నపిల్లలం పిలువడానికి వచ్చామని ఒకళ్ళు జామకాయలు కోసి తినమని యిచ్చారు ఒకళ్ళయింట్లో ఉసిరికాయలు, యింకోరి యింట్లో బొబ్బట్లు. ఇలాగా పిలవటం కూడా చాలా సరదాగా వుంది. మా లాగా ఏడ్చే పిల్లలకు మా అన్నయ్య చెప్పిన ఆటలు చెప్తాను ఆడుకున్నవారికి పేరంటం పిలువటంకంటే యిందులోనే సరదావుంది అని అనిపిస్తుంది.

## పోస్టాఫీసు

వయస్సు 9 సం॥ పైబడిన వారందరూ కూడా ఆడవచ్చు. అందరూ గుండ్రముగా కూర్చోవాలి. ఒక్కరు మాత్రము గుండ్రము మధ్యలో నిలబడి గుండ్రము కట్టిన ప్రతి ఒక్కరికి ఒక పట్టణము పేరు యివ్వాలి తనకు యిష్టమైన రెండు పట్టణముల పేర్లను జతపరచి అరుస్తాడు. అరచినప్పుడు ఈ పేర్లు కలవారు ఒకరిస్థానములకు మరివొకరు మారాలి. దొంగ కనుక ఒకరి స్థానమును ఆక్రమించుకుంటే ఆ పిల్ల మధ్యకు రావాలి. (11) యింకో పద్ధతి ఏమిటి అంటే, వీరిలో ఎవరిని తాకితే వారు మధ్యకురావాలి. జనరల్ పోస్టాఫీసు అని అరుస్తే అందరూ స్థానాలు మారాలి. ఎవరూకూడా అవుటు అవ్వకుండా ఆడాలి.

## గుడ్డివారి గుంపు

వయస్సు—12 సం॥ నుండి 17 వరకు వుండవచ్చును. ఈ ఆటలో యెంతమంది వుంటే అంత సరదాగా వుంటుంది. ఇద్దరు తప్ప మిగిలినవారంతా గుండ్రముకట్టి నిలబడాలి. గుండ్రముకట్టిన తరువాత చేతులు వదలివేయాలి వీళ్ళంతా తమ కళ్ళకు గుడ్డలు కట్టుకోవాలి గుండ్రమునకు మధ్య నున్న యిద్దరు త్రీలెగ్‌డ్ రేస్ (Three Legged Race)లో లాగా ప్రక్క ప్రక్క నిలబడి ఒకరి కుడి రెండవవారి ఎడమకాలూ కలిపి తాగుతో కట్టుకొని గుడ్డివారు తాకకుండా గుడ్డివారు కట్టిన గుండ్రము బయటకు రావాలి. ఏ యిద్దరు వీరిని ముట్టుకుంటారో మధ్యకు వచ్చి ఆటను కంటిన్యు చెయ్యాలి.



విస్తరాకు

కె. సుశీల— కాకినాడ.

## నీరూ, నిప్పూ, గాలి

8 సం॥ పైబడినవారంతా ఆడవచ్చును. దీనికి కావలసినది ఒక ముడివేసిన రుమాలు గాని, బంతిగాని. దీనికికూడ అందరూ గుండ్రం కట్టాలి. మధ్య ఒకరు నిలబడి తన చేతిలోని రుమాలు గుండ్రములో తిరుగుతూ ఒకరిముందు పడవేసి నీరూ, నిప్పు, గాలి అని అరచి పది అంకెలు తొందరగా లెక్క పెడతాడు నీరు అనంగానే నీటిలో జంతువు పేరు చెప్పాలి. గాలిఅనంగానే ఒకపక్షి పేరు చెప్పాలి. నిప్పు అంటే యేమీ మాట్లాడకూడదు. ఒకరు చెప్పిన పేరు చెప్పితే అవుటు అయిపోతాడు. లేక పది అంకెల లోపల చెప్ప లేకపోయినా, నిప్పు అన్నప్పుడు మాటలాడినాకూడ అవుటు అయిపోతాడు.



కుంకుమ భరిణె

డి. గీతాబాయి— అనంతపురం.

## రైతులూ - ఎద్దులూ

10 సం॥ ల నుండి 16 సం॥ ల వయస్సు వారంతా ఆడవచ్చును. మొత్తము అంకెను సగంగా విభజించి ఒక సగముంది రైతులు గాను, మిగిలిన సగం ఎద్దులు అని అనుకోవాలి. రైతులు కట్టిన గుండ్రములో ఎద్దులుండాలి. రైతులలో ఒకరు అకస్మాత్తుగా ఎద్దుమీదికి వచ్చి ఎద్దు కుమ్మినట్లు ఎద్దు పొట్టమీద కుమ్మాలి. ఎద్దు తప్పుకుంటే, రైతు కుమ్ము తప్పిపోతుంది. ఎద్దు వెళ్ళి రైతుస్థానము ఆక్రమించుకుంటుంది. రైతు ఆటనుండి తప్పుకోవాలి. ఎద్దుకు కనుక తగిలితే ఎద్దు ఆటనుంచి మానివేయాలి. ఆఖరికి ఎవరు మిగిలితే వాళ్ళు గెలిచినట్లు. దీనిని ఇంకోరకంగా కూడా ఆడవచ్చును. ఎద్దుకు తగిలితే ఎద్దు రైతుస్థానం ఆక్రమించుకుంటుంది రైతు ఎద్దుస్థానం ఆక్రమించుకోవాలి. ఇలాగా స్థానములు మారుతూ ఎంతసేపు కావాలంటే అంతసేపు ఆడవచ్చును.



# ఒరిస్సాలో రకరకాల ముగ్గులు ★

గొల్లపూడి వెంకటేశ్వరరావు

ఒరిస్సా రాష్ట్రమందు స్త్రీలు అనుదినము అలికి, ముగ్గులుంచు ఆచారములేదు. ప్రతిరోజు గృహముతోబాటు గృహ పరిసరముల తుడిచి, గోమయపునీరు చిలకరించి వదలివేయుదురు. వీరు పూజా సమయములందు, పండుగులకు మాత్రమే ముగ్గు లలంకరింతురు. వీరు ముగ్గుల చిత్రమును "ఝుటి" అని పిలుతురు. వీరి ముగ్గులందు అష్టదళ పద్మ మెక్కువ ప్రాధాన్యత చెందియుండును. ఆంధ్ర వనితలు ప్రకృతి సౌందర్యమును తమ ముగ్గులందు రూపొందింతురు. కాని, ఒరిస్సా మగువలు పద్మమునే పలురీతుల ప్రదర్శింతురు.

ఈ వ్యాసానికి సంబంధించిన ముగ్గుల చిత్రాలు మధ్య రెండు పుటలలో ప్రచురించాము. ఆ ముగ్గులన్నీ ఒరిస్సాలోని చీకటి, లోకనాథపురం గ్రామాల్లో రచయిత సేకరించారు.

పుష్యమాసమున ఆంధ్ర ప్రాంతమున ముగ్గుల అలంకరణమునకు ప్రాధాన్యత కలిగినట్లే, ఒరిస్సారాష్ట్రమున మార్గశిరమాసము ప్రాధాన్యత కలిగియుండెను. ఆంధ్ర వనితలు వీధంతయు తుడిచి, కళ్ళాపుచల్లి వెలితి లేకుండ రకరకముల ముగ్గు లలంకరింతురు. కాని, ఒరిస్సా పడతులు ముందు గోమయముతో నలికి, నియమిత ప్రదేశములయందు మాత్రమే ముగ్గు లుంచుదురు. ముగ్గునుంచు ప్రాంతమున ప్రత్యేకించి వృత్తాకారముగ జేగురు పూత పూసి, అది ఆరిన తరువాత, దానిపై ముగ్గును అలంకరింతురు. మెట్లపైగూడ అంతయు ముగ్గుంచక, మెట్లకు ఒకకొసనుగాని, రెండు కొసలగాని, మధ్యగాని జేగురుతో వృత్తములుగా నలికి, అందు చిన్నచిన్న చిత్రములనలంకరింతురు. ఆఖరు మెట్టుపై మాత్రము పూర్తిగా అలంకరింతురు.

ముగ్గుల చిత్రించుటకు వరిపిండిగాని, గుల్లముగ్గుగాని ఉపయోగించరు. బియ్యమును నానబెట్టి, అవి మెత్తగా రుబ్బుదురు. అందు చిన్న దూదిపింజెను ముంచి, వేళ్ళతో నొక్కుచు వుంగరపు వ్రేలితో ముగ్గును రూపొందింతురు.

మార్గశిరమాసమున ప్రతి గురువారము రోజున వీరు లక్ష్మీపూజ యొదురు. ధాన్యము చిన్నచిన్న గంపలకెత్తి, ఆ ధాన్యపు గంపల పూజింతురు. ఆ పూజ చేయు ప్రదేశమందు, వెనుక గోడపైన చతురముగగాని, దీర్ఘ చతురస్రముగగాని జేగురుతో నలికి అచ్చటగూడ నలంకరింతురు. ఈ మాసమున ప్రతిబుధవారము వుదయమున గోమయముతో నలకుట మొదలుపెట్టిన సాయంకాలమునకు ముగ్గుల అలంకరణ పూర్తియగును. ఈ అలంకరణమున అష్టదళ పద్మమునకు ప్రాధాన్యత నిచ్చినప్పటికి— శంఖము, చక్రము, కుంభము, స్వస్తిక్, పెరుగుకడవ, లక్ష్మీపాదములు, తులసికోట కూడ అలంకరింతురు. ధాన్యలక్ష్మిని పూజించుటవల్ల వరి వెన్నులు, గాదె చిత్రములుగూడ అందందు గాంచగలము.

మార్గశిరమాసమున ప్రతి గురువారము రోజున, సర్వకులస్థులు ఈ పూజలు చేయుదురు. చేలు కోతకువచ్చు కాలమగుటచే మొదటి గురువారము రోజున లక్ష్మీపూజ చేసిగాని, కోతలు మొదలుపెట్టరు. చేలు ముందు కోతకు వచ్చినప్పటికి ఈ లక్ష్మి ఆరాధన కొనసాగించి లక్ష్మినంతటి కొల్వానిందురు.





"అమ్మగారికి దండంపెట్టూ"

చిత్రకారుడు : పి. ఎస్. శాస్త్రీ—విజయవాడ.

# సంక్రాంతి ముగ్గుల పోటీ

## మొదటి బహుమతి ముగ్గు

### శ్రీ మహావిష్ణు చక్రము



యన్. వెంకాయమ్మ-కుయ్యేరు

రెండవ బహుమతి

అవిసె పువ్వు



పి. గాయత్రి - గుంటూరు




## రథము

యమ్.జి. కాంతమ్మ - ఆధోని.




అష్టదళపద్మము 1


ముగ్గులనలంకరించుతీరు


చక్రము

# ఉత్కళ మహిళల


గాదె


పూజామంది

అష్టదళపద్మము 3


పెరుగుకడవ



అష్టదళపద్మము 2



అష్టదళపద్మము 4



అష్టదళపద్మము 5





శంఖము



కుంభము



స్వస్తిక్

# ముగ్గుల తీరులు



గాదె



అలంకరణము

అష్టదళపద్మము 8





లక్ష్మీ పాదములు

అష్టదళపద్మము 6



అష్టదళపద్మము 7



అష్టదళపద్మము ౧









చాప

యస్. సరోజ- భీమడోలు.



పున్నాగ గుత్తులు

కోనా హైమప్రసన్న - విజయవాడ



**ద్రాక్ష పందిరి**

పి. కృష్ణభారతి

మద్రాసు



**తీగల ముగ్గు**

యం. శ్రీలక్ష్మి

పిఠాపురం

# సంక్రాంతి శంఖం

ఇవి చిన్ననాటి ముచ్చట్లు. హేమంతం జరుగుతుండగా ఒకానొకనాటి వుదయం నిద్రలేచి కళ్ళు నులుముకుంటూ యింటి ముంగిలికి వచ్చేసరికి గడపముందర వీధిలో రంగవల్లికల్లో పేడముద్దలపైన గుమ్మడి పువ్వులు కనిపించేవి. అవి కనబడగానే పండుగసెల ప్రారంభమైందనుకునేవాళ్ళం. ఆ రోజు సాయంత్రానికల్లా మావాడ పసుచులు వాళ్లవల్లో చేమంతులు నవ్వుతుండగా గొబ్బెమ్మను తట్టలో తంగేడుపువ్వుల్లో కూచోబెట్టి గ్రామసంచారానికి బయల్దేరేవారు. మగపుట్టుక పుట్టీ, సంకురాత్రి సంబరాన్నంతా దోచుకునేందుకులా బయల్దేరే ఆడపిల్లల్ని చూస్తూ వూరుకోలేక వాళ్ళవెంట మేమూ బరాబరులు తిరిగేవాళ్ళం. మేము గడుగ్గాయి కుర్రాళ్లమనీ, నోరూ వాయీ లేని ఆడబిడ్డల్ని ఏడిపించుక తింటామని వున్న గుమ్మడిపువ్వును చూచి కవులు హేమంత ఋతుసీమంతిని అందం అనుపమమని తలపోశారు. ఓ సేమా! హేమంతం అందమైన ఋతువే కావచ్చు. కానీ గులాబీకి ముళ్ళుంటాయి. హేమంతంలో చలి జనాన్ని వేపుకతింటుంది. అందులోనూ మాది కొండకోనలమధ్య బిక్కు బిక్కుమంటుండే పల్లెటూరు కావసంచేత, ఎముకల్ని కొరికివేసే చలితాలూకు భయానక స్వరూపం మాకయినట్టు మరొకరికి అర్థం కాదు. పట్టణాలకి వెళ్ళినప్పుడు, మావూరు ప్రకృతిమాత ఒడిలో గారాబు బిడ్డ అని మేము సగర్వంగా చెప్పుకునే మాట నిజమే! ఐతేనేం! అలా చెప్పడంచేత మా వూళ్ళో చలిబాధ లేదన్న భావం సూచింపబడదు గదా!

ఆ రోజుల్లోనేమి, ఈరోజుల్లోనేమి మా వూళ్ళో చలిబాధ ఎదుర్కోడానికి రెండంటే రెండు పద్ధతులుమాత్రం వున్నాయి. మా వూరు పల్లెటూరని ముందే చెప్పాను. ఉన్న నలభై యిళ్లలో కలిగినవాళ్లవి నాలు

## మధురాంతకం రాజారాం

ఊళ్ళో ఒక అపప్రథ వుండేది. ఇలా మనుమరాంద్రని వెనకేసుకొచ్చే తాతయ్యల్ని చూచి మేము ఏ మాత్రం భయపడేవాళ్ళం కాము. అమాటకొస్తే "చెప్తేచేస్తారు! పండుగలొచ్చేదెందుకు? పిల్లలు అల్లరి చేయడానికి కాకపోతే" అని అంగరక్షకుల్లా నిలబడ్డానికి మాకూ కొందరు హేమాహేమీలు లేకపోలేదు. అలా మమ్మల్ని వెనకేసుకొచ్చే వాళ్ళందరూ మా నాయనమ్మలేనని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదనుకుంటాను. మగవాళ్లు ఆడవాళ్లపైన, ఆడవాళ్లు మగవాళ్ళపైన అభిమానం చిలికించడం ప్రకృతి సహజమని నాకప్పుడు తెలియదు.

ఋతువర్ణనల్ని ఆసక్తితో చదివేవాళ్ళకి తెలుగు కవులకి వసంతంపైన్నే గాక, హేమంతంపట్ల గూడా మమకారం లేకపోలేదని అవగతమౌతుంది. తులసి మొగలో దివ్వెలా నాలిడిగూటిపైన వలికే హేమ కణాన్ని చూచి, ఆకురాలుటను పొతచీర విప్పడానికి ముందు మంచులో తొనమాడు తరుపాలిని చూచి, మద నోషికృతికి కుమ్మెద సోమపీఠికై అవనికి దిగివచ్చినట్టి తంతలా



జంగందేవరలు

—ఫొటో: కి. ఎస్. ఎస్. సోమయాజులు

గైదు పెంకుటిళ్ళు తప్పితే, మిగిలినవన్నీ పూరిళ్ళు, తాటాకుపాకలు. కలిగినవాళ్లకు పెంకుటిళ్లు ఎలాగైతే వున్నాయో, అలాగే దుప్పట్లు, శాలువలుకూడా వుంటాయి. వాటిలో ఒళ్లు ముడుచుకొని ఇనప్పెట్టె ల్లాంటి గదుల్లో నిద్రపోవడానికి హేమంతంలో వాళ్లు అలవాటు పడిపోతారు. కానీ పాకల్లో వున్నవాళ్లగతి? వాళ్లు అర్ధరాత్రి నుంచీ పొద్దు కరకర పొడిచేవరకూ, చలిమంటలచుట్టూ కూచుంటారు. చలికాలం రాబోతుందనగా, పెంకుటిళ్ళవాళ్ళకు కొన్నూరు శాలువలు, నారాయణవనం దుప్పట్లు అవసరమైతే, పాకల్లోవాళ్ళకి కందికంపలు అవసరమయ్యేవి.

మాది పెంకుటిల్లు. ఆ రోజుల్లో మా నాన్నగారు నాకొక చిన్న శాలువకూడా కొని తెచ్చారు. ఐనా నాకు చలిమంట అనగానే ప్రాణం లేచివచ్చేది! ఏ తెల్లవారుఝామునో లేచి చప్పుడు లేకుండా తలుపు తీసుకుని కిష్టిగాడి గుడిసెదగ్గరకు వెళ్ళిపోయే వాణ్ణి. నాలుగైదురోజుల్లో, ఈ నా పలాయనం పట్ల ఇంట్లోవాళ్ళకు మరీ శ్రద్ధ ఎక్కువై మాఅన్నయ్య తలుపుదగ్గరే మంచం వేసుకునే వాడు. వాడి అభిప్రాయం ప్రకారం చలిమంటదగ్గర కూచోడం ప్రాణాపాయకరం. అందువల్ల ఒళ్ళంతా ఉరపం కలుగుతుంది. కడుపులో మంట బయలుదేరుతుంది. ఇంకా ఏమిటేమిటో కొంపమునిగేంత ప్రమాదాలు సంభవిస్తాయి!

అప్పుడు నేను రెండోతరగతి చదువుతున్నట్టు జ్ఞాపకం. అమ్మ పండక్కి కొనుక్కురావలసిన బట్టలేవో నాన్నగారికి పురమాయిస్తోంది.

"పెద్దబ్బాయి వులెన్ మఫ్లరు కావాలంటున్నాడు. అమ్మాయికి పావడా పైకి దావిణితెండి. మీరూ ఒకజత సేలంపంచలు తెచ్చుకోండి," అంది అమ్మ.

మా అమ్మ అదో తరహామనిషి. అందరికీ తెమ్మంటుంది గానీ, తనకిమాత్రం ఫలానా బట్టలు కావాలని నోరువిడిచి చెప్పదు. మనసులో అనుకుంటుందేమో మరి, నాకు తెలియదు. కానీ మానాన్నగారేమో ఆవిడ మనసులో జొరబడి, అక్కడున్న వివరాలు గ్రహించినట్టు ఆమెకేదో ఒక చీర కొని తెచ్చేసేవారు. ఆశ్చర్యం! "ఇలాటి చీరైతే బాగుంటుందనుకున్నాను. సరిగ్గా అదే తెచ్చారు," అంటూ ఆమె మెల్లగా నవ్వబోయేది. సరే. అంతాబాగానేవుంది. అమ్మ ఏచీర తనకు బాగుంటుందని అనుకుంటుందో నాన్నగారికి తెలుసు. కానీ నా సంగతి? నాకు లాగూ చొక్కా తెమ్మని చెప్పనందుకు అమ్మపైన నాకు కోపం వచ్చింది.

"మరి ఈకుర్రవెధవమాట!" అన్నారు నాన్నగారే!

"వాడికేమీ తేవద్దండీ!" అంది అమ్మ.

అమ్మ దొంగా! అదంతా వట్టినాటకం. నాకు తెలియదేమిటి! అమ్మ కావాలనే నన్ను వుడికించడానికి అలా అంటోంది.

"అంతేనండీ కావలసిన బట్టలు. ఇంక నన్ను వెళ్ళనీండి. అవతల పొయ్యిమీద ఎసరు కాగిపోతోంది," అంది అమ్మ.

"మరి ఈయేడుగూడా గురులింగంమాట మరచిపోతే ఎలాగు?" అన్నారు నాన్నగారు.

"అవునవును. అవేవో ఆ నల్లంచు పంచలున్నాయి చూడండి, అవి పట్టుకరాండీ! పాపం, ముసలాడు. ఈసారివస్తాడు. మళ్ళీ వస్తాడో రాడో ఎవరుచూచారు," అంది అమ్మ.

ఎవరీ గురులింగం! నాకాపేరు విన్న జ్ఞాపకం లేదు. మావూళ్ళో ఆ పేరుగల మనిషి లేడు. మా బంధులోకంలో సైతం అలాటివాడొకడున్నట్టు నాకు తెలియదు. అంతగా నాకపరిచితుడైన గురులింగానికి పంచలచాపు బహూకరించవలసిన అవసరంఏమిటి? అమ్మనడుగుదామనుకుంటుండగా, అన్నయ్య వచ్చేశాడు. వాడు ఇంట్లోవున్నంతవరకూ నేను అదేమిటి, ఇదేమిటి అని అమ్మనో, నాన్నగారినో అడిగి సందేహనివృత్తి చేసుకోడానికి వీలుండదు. "వ్రేలెడంత లేవు, అప్పుడే నీకు పెద్దమాటలెందుకురా," అంటూ వతను అప్పటికి తనేమో హిమాలయమంత ఎత్తున్నట్టు!

నాన్నగారు పట్నంనుంచీ క్రొత్తబట్టలతోసహా వచ్చారు. యుద్ధం జరుగుతున్న రోజులు. వెల కాస్త గిరాకీగావున్నట్టు, తీసుకెళ్ళిన డబ్బుగాక, నటకలవారి అంగడిలో పాతికపైగా బాకీ మిగిలినట్టు చెప్పారు. డబ్బు దుబారాచేయడం అమ్మకుగిట్టదు. "ఐతే ఈ నల్లంచుపంచ లెందుకు తెచ్చారండీ? ఎప్పటిలాగా గురులింగానికి ఒకపాత గుడ్డేయిస్తే సరిపోయేదిగా!" అంది.

నాన్నగారు నివ్వెరపోయినట్టు, "అదేమిటే! వచ్చే ఏడాదికతడు వస్తాడో రాడోనని నిట్టూర్చింది నువ్వేగా! పోనీ తెమ్మన్నావుగనుక తెచ్చాను," అన్నారు.

చుట్టుపట్ల కలయజూచి, అన్నయ్య లేడని నిర్ధరించుకుని, "ఎవరు నాన్నా ఆ గురులింగం" అన్నాను.

"తెలియదంట్రా! పండుగనెల్లో వస్తుంటాడు," అన్నారు నాన్నగారు.

"వాడికేం తెలుసండీ! పోయినసారి గురులింగం వచ్చినప్పుడు, నేను పని గట్టుకుని లేపినా, వీడు గుర్రుపెట్టి నిద్రపోయాడు," అంది అమ్మ.

అప్పుడెప్పుడో గుర్రుపెట్టి నిద్రపోయినందుకు నాకు నాపైన్నే ఇంచుక ఆగ్రహం కలిగింది. అమ్మా, నాన్నా మాటల్ని బట్టి చూస్తే గురులింగం ఎప్పుడంటే అప్పుడు వచ్చేవాడిలా కనిపించడంలేదు. సంవత్సరానికోసారి, అదీ పండుగనెల్లో వస్తాట్ట! ఎందుకొస్తాడో మరి! ఈసారి గుర్రుపెట్టి నిద్రపోగూడదు, కాదని నిద్రపోయినా, అమ్మ లేపేసరికి లేచి కూచోవాలి. పొద్దు



తెల్లవారగ చిట్టితల్లులు
తీర్చిదిద్దిరి రంగవల్లులు

ఫోటో: పసల కృష్ణకుమార్.

గురులింగం! ఆవచ్చేవాడు కాస్తా పగలే రాకూడదూ!

*   *   *

పడమటి వీధి వెంబడే వెళ్తున్నాం, గొబ్బిదట్టేవాళ్ళ వెంటబడి! 'ఆకొండ ఈ కొండ నల్లంజి కొండ' అని అక్కడ కిష్టి గాడి చెల్లెలు పదమందుకోగానే, ఇక్కడ కిష్టిగాడు ఆపదాన్ని బెంకాయ పీకలో "ఫీ! ఫీ!" మని పలికిస్తున్నాడు. రాముడు ఆపాటకు ఖాళీ కిరసనాయిలుడబ్బాపైన మృదంగం మ్రోగిస్తున్నాడు. నిజం చెప్పొద్దూ! నేను అల్లరి పిల్లల్లో ఒక్కడి నైనా, అల్లరి చేసే విద్యలో అంతటి పరా కాష్ఠ నందుకోనివాణ్ని. మేము బుచ్చమ్మ గారి ఇంటి ముందర తిష్ఠవేసి, ఏక్ ధమ్మున అల్లరి సాగించేస్తున్నాం. వున్నట్టుండి సభలో కలకలం చల్లారింది. "ఏమిటది, ఏమి టది," అన్నాను.

"అదా! తెలియదూ? శంఖం!" అన్నాడు కిష్టిగాడు.

"శంఖమ?" విస్తుపోయాను.

"అవున్రా! మా అమ్మ చెప్పింది. అది సంక్రాంతి శంఖమట."

ఏం సంక్రాంతో, ఏంశంఖమో దాని వృత్తాంతం సమగ్రంగా తెలుసుకోవాలని పించింది నాకు. శబ్దం వచ్చినదిశకు పరు గెత్తాను. నావెంట పిల్లలు చాలామంది పరు గెత్తి వచ్చారు.

నడివీధిలో జనం ప్రోగయ్యారు. జన సమూహం మధ్యనిలిచి ఒక ముసలాతడు, 'భంభం' అని శంఖధ్వానం చేస్తున్నాడూ.

అతణ్ని చూడగానే నాకు మా ఆశక్కయ్య నాలుగో తరగతి పుస్తకంలో వున్న త్యాగయ్య బొమ్మ జ్ఞాపకం వచ్చింది. ఆ చిన్నతనంలో అతడే త్యాగయ్యని అనుకున్నానేమో, ఇప్పుడు స్మృతికి రావడంలేదు. పొడవుగా ఒక దుప్పటి అతడి తలపైన్నుంచీ క్రిందికి వ్రేలాడుతోంది. భుజాలకుపైన అదితలతో ఐక్యమై పోయినట్టుండి, క్రిందికి రాను, రానూ వదులుగా వ్రేలాడుతూ, అతడి కది మంచి ఆచ్ఛాదనంగా ఉపకరిస్తోంది. ఫాల భాగంలో, కంఠసీమలో, వీపుంపైనా విభూతిపట్టెలు మెరిసిపోతున్నాయి. మెడలో ఎర్రటి దారానికి నల్లటి శివలింగం వ్రేలాడుతోంది? కుడిచేతితో అతడు గంట కదలిస్తూ, ఎడమచేతితో శంఖంపైకెత్తి పూరిస్తున్నాడు.

ఆ వృద్ధుడికి ప్రక్కన నాకింకొక అపరి చితుడు కూడా కనిపించాడు. ఇతడు యువ

# ★ సంక్రాంతి శంఖం ★

కుడు. ఇతడికీ మెడలో శివలింగం వ్రేలాడుతోంది. ఇతడూ గంటవాయిస్తూ, శంఖం పూరిస్తున్నాడు. ఐతే వృద్ధుడిలా ఇతడు దుప్పటి కప్పుకోలేదు. పంచకట్టుకుని, పైన చొక్కా వేసుకున్నాడు. ఎర్రటి తువ్వాలుతో తలగుడ్డ చుట్టుకున్నాడు.

ఆ ఇద్దర్ని చూడగానే, నాకు రెండు నెలల క్రితం మా వూళ్లో జరిగిన సంఘటన ఒకటి జ్ఞాపకం వచ్చింది. గారడీ పనులు చేస్తామంటూ సరిగ్గా ఇలాగే ఒక ముసలి వాడూ, ఒక పడుచు వాడూ వచ్చినడివీధిలో ఎన్నెన్నో తమాషాలు చేసి చూపెట్టారు. ఐతే వాళ్ళకి మల్లే వీళ్ళు నల్ల కోట్లు తొడుక్కుని, నేతులకు తాయెతులు కట్టుకొని, కోర మీసాలపైన మినుకు మినుకుమంటున్న పిల్లి కళ్లతో మమ్మల్ని భయపెట్టలేదు. ఎందుకో కారణం చెప్పలేనుగానీ, నాకు వాళ్లెంత చెడ్డవాళ్లుగా కనిపించారో, వీళ్లంత ఆత్మీయులుగా కనిపించారు.

కిష్టిగాడికైతే వీళ్లనిగురించి బాగా తెలిసి వుంటుందని, వాడికోసం జనంలో వెదికాను. వెధవ, ఎక్కడ నక్కికూచున్నాడో కనిపించలేదు. పోనీ, మరెవరినైనా అడుగుదామనుకుంటుండగా, అరుగుపైన్నుంచీ అన్నయ్య, "ఇంకా తిరుగుతున్నావట్రా చదువుకోకుండా" అని కేకవేశాడు. ఇంక అక్కడ వీపు చిట్లించుకోడానికి మనస్కరించక, ఇంటికి దౌడుతీశాను. అమ్మ మండువాలో విస్తర్లు కుట్టుకుంటోంది.

"అమ్మా అమ్మా! ఎవరో వచ్చారు. చూద్దుగానిరా" అన్నాను గసబోసుకుంటూ.

"ఎవర్రా? ఆ శంఖం వూదేవాళ్లేనా?" అంది అమ్మ.

"వాళ్లే, వాళ్లే" అన్నాను.

"వాళ్లని నే నెన్నోసార్లు చూచానులే. ఆ ముసలాతణ్ని చూచావుగదా! అతడే గురులింగం!"

"మరి ఇంకొకడు?"

"గురులింగం కొడుకు."

"గురులింగం, గురులింగంఅంటావు. నీకైతే వాళ్లెవరో తెలుసు. నాకేం తెలీడంలేదు." అన్నాను.

అమ్మ నవ్వుతూ, "వాళ్లు జంగాలురా! ప్రతి పండుగనెల్లోనూ, ఇలా ఊళ్లుతిరుగుతూ మనల్ని దీవించిపోతుంటారు." అంది.

దీవించడమంటే ఏమిటో నాకు తెలియదు. బహుశా అదేవో ఘనకార్యమే అయివుంటుంది. లేకుంటే, వాళ్లకి కొత్తపంచలెందుకు సమర్పించుకుంటాము!

తెలుసుకుందా మనుకుంటుండగా వాకిట్లో అన్నయ్య ఎవరితోనో మాట్లాడ్డం వినిపించి, చరచరా గదిలోకి పరుగెత్తి, పుస్తకాలు పైకి తీశాను.

ఆరాత్రి తెల్లవారుఝామున గురులింగం పుత్రసమేతంగా మా ఇంటికి వచ్చాడు. అమ్మా నాన్నా దీపం వెలిగించుకుని అతడికోసం వేచి చూస్తూ కూచున్నారు. వీధిలో నిలబడి గురులింగం ఒకసారి శంఖధ్వానంచేసి ఏదోపాట ప్రారంభించాడు.

"పర్వతాల సాంబశివుడు భద్రేశ్వరా!
వచ్చీ వాకిటనిలిచినాడు భద్రేశ్వరా!"

అమ్మ తలుపు తెరిచింది. గురులింగం లోపలికి వస్తూనే, నాన్నగారిచేతికొక విభూతిపండిచ్చాడు. అమ్మ చాపవేసింది. చాపపైన కూచుంటూ, జంగాలిద్దరూ మళ్లీ పదమందుకున్నారు.

"భాగ్యనోమూ లిచ్చేవాడు భద్రేశ్వరా!
పున్నెపు నోమూ లిచ్చేవాడు భద్రేశ్వరా!
ఓరుగంటి శివశంభుడు భద్రేశ్వరా!
వాలాలాడే వేళలయ్యా భద్రేశ్వరా!"

"భద్రేశ్వరా, భద్రేశ్వరా" అని ఊతపదం మాత్రం కొడుకు చెబుతుండగా, గురులింగం పాటమాత్రం పాడుకుంటూ పోయాడు.

"ఒళ్లెల్లాను విభూదీతో భద్రేశ్వరా!
వాలాలాడేను పరమశివుడు భద్రేశ్వరా!
జటజడానా కోటివేలు భద్రేశ్వరా!
చంద్రకాంత శివలింగాలే భద్రేశ్వరా!

దినదినమునూ రామురాము భద్రేశ్వరా!
అనుదినమునూ రామురాము భద్రేశ్వరా!
ఏడాదికి ఒక్కదినము భద్రేశ్వరా!
వేడుకైన సంకురాత్రి భద్రేశ్వరా!
తరమునాటి తమపెద్దలు భద్రేశ్వరా!
ఎదురుచూచే వేళలయ్యా భద్రేశ్వరా!"

గురులింగం దాదాపు అరగంటసేపు పాట పాడాడు. పాడుతూ మధ్యమధ్య శంఖం పూరించి గంట మ్రోగించాడు. నాన్నగారు అమ్మని పంచలు తెమ్మని, వాటికి పసుపూ కుంకుమపెట్టి గురులింగం చేతపెట్టారు-గురులింగం, "హరహర మహారాజేశ్వరా, పుత్రపౌత్రాభివృద్ధి గలిగి, అందలంపాలకీలు కలిగి, అమృత మహాలక్ష్మీకృప అమరంగ కలిగి," అంటూ మళ్ళీ ఏదో దండకంలాంటి వచనం మొదలెట్టాడు.

పాటలు, వచనాలు పూర్తిఅయిన తర్వాత నాన్నగారు "నిరుటికీ, ఈసారికీ బాగా చిక్కిపోయావు గురులింగం," అన్నారు.

"ఇంకే ముందండీ! కథంతా అయిపోవస్తోంది. ఆ సాంబమూర్తి నాకెప్పుడో కనరాలేదు," అన్నాడు గురులింగం.

"ఏంమాటల్లే గురులింగం! నువ్వింకా పదికాలాలపాటు చల్లగా బ్రతుకుతావు. ఐనా ఇప్పుడు, నీకేం కొఅవైంది? కొడుకులు నీకేం తక్కువ చేయడంలేదు గదా", అన్నారు నాన్నగారు.

"అబ్బే లేదండీ! నాకొడుకులు నేను గీచిన గీటు దాటరు. వీడు పెద్దవాడు. వీడికంటే చిన్నవాళ్లు నలుగురున్నారు. అందరూ చేతికెదిగి, మడిచేసుకుంటున్నారు. కుక్కకు టెంకాయబ్బినట్టు నాకు మడీమెట్టా ఏడెనిమిదెకరా లబ్బినాయ్. ఆ ఆసరా చూచుకుని కుర్రాళ్ళు కులవిద్యకే ఎసరుపెట్టేయాలనుకుంటున్నారు."

తనకెవరో తాంబూలంపెట్టి పిలిచినట్టు అన్నయ్య అక్కడ స్వయంగా కలుగజేసుకుంటూ, "లేకుంటే ఏడెనిమిదెకరాల సేద్యముండగా ఇంకా భిక్షాటనం తిరగడమేం కర్మం?" అన్నాడు.

"జంగందేవరలకు భిక్షాటనమే కులవిద్య చిన్నబాబుగారూ! పరవిద్య లెన్నియైనను, కులవిద్యకు సాటిరావన్నారు" అన్నాడు గురులింగం.

"కాలం మారిపోయింది. జంగాలకు మునుపున్నట్టుగా గౌరవంలేదు. ఏమైనా నాన్నగారిమాట తోసివేయలేక ఆయన వెంటబడి తిరుగుతున్నామండీ!" అన్నాడు గురులింగం కొడుకు.

తరువాత గురులింగం మా కుటుంబానికి సంబంధించిన విషయాల్ని ప్రస్తావించాడు. చనిపోయి స్వర్గంలోవున్న మా తాతయ్యని తలచుకుంటుండగా, అతని కంఠం గద్గదికమైంది. వ్యాపారం చేసుకుంటూ పట్నంలో స్థిరపడిపోయి, స్వగ్రామాన్ని మరచిపోయిన మా చిన్నాన్నగారిని గురించి మాట్లాడుతూ మనుషుల్లో బంధుప్రేమ తగ్గిపోతోందని అతడు నిట్టూర్చాడు. ఆతరువాత ప్రసంగం మా అన్నయ్యవైపు తిరిగింది.

"పెద్దబ్బాయిగారి చదువు పూర్తయినట్టే కదండీ!"

"అయినట్టే మరి! వుద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాడు. దూరా భారంగా వెళ్తేగానీ వుద్యోగం దొరికేట్టులేదు," అన్నారు నాన్నగారు.

"వుద్యోగం మనం కూచున్నచోట దొరుకుతుందా మరీ" అన్నాడు అన్నయ్య!

"దొరక్కపోతే, పోనీలే! మనకు వుద్యోగాలు, ఊళ్ళేలడాలు అక్కర్లేదు. వున్నవాళ్ళందరూ ఒకచోట వుంటే చాలు" అంది అమ్మ.

"అమ్మగారు మంచిమాట చెప్పారు" అంటూ గురులింగం నాన్నగారివైపు చూస్తూ "ఐతే అబ్బాయికి సంబంధాలేమైనా

వాళ్లు మా ఇంటికెప్పుడొస్తారో అడిగిపడి వుండవలసింది. మహానుభావుడికి దయ చూస్తున్నారాండీ" అన్నాడు.

"అదొక్కటే తక్కువ," అన్నయ్య గొణుక్కున్నాడు.

"వాడికేమో మేనరికముంది. అమ్మాయికి కూడా తగిన సంబంధం చూచి రెండు కార్యాలూ ఒకేసారి చేసేయాలనుకుంటున్నాను" అన్నారు నాన్నగారు.

* * *

"మంచిదే. అలా చేసేయండి," అంటూ మేము చేసినవి, చేయబోయేవీ అన్నీ మంచి పనుల క్రిందే జమకట్టి, గురులింగం మా నాన్నగారి దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

పదేళ్ళు గడచిపోయాయి. కాలం మా కుటుంబంలో ఎన్నో మార్పులు తీసుకొచ్చింది. మన్యపుజ్వరంతగిలి నాన్నగారు హఠాత్తుగా చనిపోయారు. ఆయన చనిపోయిన నాలుగురోజులకు పండుగనెల ప్రారంభమైంది. ఆ తరువాత వారందినాలకు గురులింగం మావూరొచ్చాడు. కానీ పర్వతాల సాంబశివుడు ఆ సంవత్సరం మా వాకిటకి వచ్చి నిలబడలేదు. అంటూ సొంటూ తగిలిన ఇళ్ళల్లో ప్రవేశించగూడదని జంగం దేవరల నియమమని తరువాత తెలిసింది. ఐనా, గురులింగం వీధిలో నిలబడి, "అమ్మగారూ!" అని కేకవేశాడు. అమ్మ తలుపు వెనుక నిలబడి, "ఏం గురులింగం అంది."

"మనిషెలాటివాడైందీ చచ్చేనాటికి తెలుస్తుందన్నారు. పెద్ద బాబుగారు పుణ్యాత్ములు. రోగం, రొష్టూ లేకుండా వున్నట్టుండి కళ్ళు మూసేశారు. అలాటి చావు అందరికీ రమ్మంటే రాదు. నేనూ వున్నాను. పదిబారలు నడవడానికి ఓపికుండడంలేదు. చూపు బాగా తగ్గిపోయింది. బాబుగారిలాంటి మహారాజులుండి నాలాటివాళ్ళు పోతే, లోకానికేమీ నష్టంలేదు. ఏం చేద్దాం తల్లీ! మంచివాళ్ళు త్వరత్వరగా దాటుకుంటారు. మనం గుండె రాయిచేసుకోవాలి. లేకుంటే పిల్లలు దిగులుపడిపోతారు."

ఆ తెల్లవారుఝామున, పాలిపోతున్న వెన్నెల్లో నేను స్వప్నంగా చూచాను. గురులింగం కళ్ళల్లోంచీ కన్నీటి చుక్కలు టపటప నేలరాలినాయ్.

హైస్కూల్లో చదువుకుంటూ పట్నంలో వుండిపోయినందువలన తరువాత ఐదారేళ్ళు నేను గురులింగాన్ని చూడ్డం సంభవించలేదు. గడచిన సంవత్సరం పరీక్షలకు రెండు నెలలు ముందుగా క్రిస్‌మస్, సంక్రాంతి సెలవులు రెండూ కలిసివచ్చాయి. ఎప్పటిలాగే ఒకానొకనాటి సాయంకాలం గురులింగం నడివీధిలో శంఖం పూరించాడు. గురులింగం నానాటికీ జవసత్వాలుడిగి ముసలి వగుగా మారిపోతున్నమాట నిజమే! కానీ ఆ శంఖధ్వానంలో మాత్రం మార్పులేదు. వేషంలోనూ అంతే! అవే విభూదిపట్టెలు, అదే గంట, అదే శంఖం, మెడలో అదే శివలింగం!

తోట దగ్గరినుంచీ వస్తూ, నడివీధిలో జనం మధ్య నిల్చున్న గురులింగాన్ని చూచాను. అతడి ఆకారం కళ్ళబడగానే, "ఇదే ఆఖరుసారి. ఇక గురులింగం నీకు కనబడడు" అని ఏదో ఆకాశవాణి నా చెవుల్లో వూదినట్టయి నిర్ఘాంతపడిపోయాను. అవును! రాలిపోవడమే శుష్కపత్రాల స్వభావం! కానీ, గురులింగం మాకు కేవలం ఒక వ్యక్తిమాత్రుడు కాడు. ప్రాచీన జనపథాల్లోని సంఘవ్యవస్థ తాలూకు ఒక సంప్రదాయమే మూర్తిగా రూపొందినవాడు గురులింగం. జంగాలు యేడాది కోరోజు తమకుల వృత్తిని మననంచేసుకుంటూ భిక్షాటనం బయల్దేరడం కొందరికి దుస్సాంప్రదాయంగా గోచరించినా గోచరించవచ్చు. అది సత్సంప్రదాయమని వాదించవలసిన అవసరం కూడా నాకు కనిపించడంలేదు. అదెలాటి సంప్రదాయమైనా, గురులింగంతోబాటూ మరుగున పడిపోనున్న మాటమాత్రం నిజం!

ఆరోజురాత్రి గురులింగం తమకులం పూర్వప్రశస్తిని కొంత మా అమ్మతో చెప్పాడు. "అమ్మగారూ! రోజులు మారిపోయాయి; మేము వీరశైవులం. మా తాతయ్య చెప్పేవాడు. ఒకప్పుడు మా వీరశైవ మతానికి ఈ తెలుగుగడ్డలో ఎదురుండేదికాదట. మా ఇంట్లో ఇంకా ఒక పాత తాటాకుల కట్టవుంది. దానిపేరు బసవపురాణం. అందులోనూ వీరశైవుల్ని గురించి వివరంగావుంది. మా మతానికి మూలవిరాట్టు బసవేశ్వరుడు కులాలే లేవు పొమ్మని ఢంకా బజాయించి చెప్పేశాడు. లేకుంటే మనుషుల్లో ఇన్ని కులాలెందుకు? ఆయన మాబాగా సెలవిచ్చాడు..."

అక్కడ మా అన్నయ్య అడ్డొచ్చి "మీ బసవేశ్వరుడు గొప్ప అభ్యుదయ వాదిలా వున్నాడే గురులింగం," అన్నాడు.

అభ్యుదయ మంటే ఏమిటో, అభ్యుదయ వాదులంటే ఎవరో గురులింగానికి తెలిసినట్టులేదు. అతడు కొంతసేపు ఆలోచించి, "ఏమిటో బాబూ! మీమాటలు మాకు అర్థం కావు," అని ఉపోద్ఘాతాన్నంతటితో విరమించి శంఖంపూరించి తన పాటందుకున్నాడు.

గురులింగం పాట నేను చిన్నప్పటి నుంచీ వింటున్నాను. అతడు మొదటిసారి ఎలా పాడాడో. అప్పుడూ అలాగే పాడాడు. ఉచ్చారణలోగానీ, రాగంలోగానీ, మార్పులేవు. నేను కొత్తట్యూనుల కోసం విహ్వలించిపోయే నాగరిక ప్రపంచాన్ని 'బాయ్‌కాట్' చేసినవాణ్ణేమీ కాను. ఐనా, గురులింగం పాటలో ఏదో ఒక ఆకర్షణ ఊహకు అందీ అందని కులగిరుల గాంభీర్యంలా నన్ను తనవైపుకు లాక్కునేది. ఈ రోజుల్లో వెనుకచూపు క్షంతవ్యం కావని నాకు తెలుసు. ఐనా పాట వింటూ నేను గతించిన శతాబ్దాల చీకటితెరలను చీల్చుకుని బసవేశ్వరుడి, పండితారాధ్యుడికి చెందిన పాల్కురికి సోమనాథుడికాలానికి వెళ్ళిపోయినట్టుండేది.

ఆశీర్వచనాలు పూర్తయిన తర్వాత గురులింగం తన మామూలు ప్రకారం మా కుటుంబం గొడవల్లో జొరబడ్డాడు. అప్పుడు మేము రెండుమూడు సంవత్సరాలతరబడి ఒకటిరెండు భీకర సమస్యల్ని పరిష్కరించుకోలేక సతమతమౌతున్నాం. అక్కయ్యకు పెళ్ళయింది. అయిందన్నమాటే గానీ, అది పట్టుమని పదిరోజులు అత్తగారింట్లో కాపురం చేయలేదు. కారణం నే నెంత తరచి అడిగినా అమ్మ దానికీ దాని మొగుడికీ పొంతన కుదరలేదని చెబుతుంది! పొంతనాలు కుదిరి అది కాపురాని కెప్పుడు వెళ్తుందో నామట్టుకు నాకు అనూహ్యమై వుండిపోయింది. దాని విషయమలావుండగా, అన్నయ్య తనకు ససేమిరా పెళ్ళివద్దంటే వద్దంటున్నాడు. అవతలివైపున మా మామయ్య ఈడొచ్చిన బిడ్డని ఎంతకాలమని అట్టేవుంచుకోనని గోల చేస్తున్నాడు. ఒకరిద్దరు పెద్దమనుషులు అన్నయ్యకు నచ్చజెప్పలేక ఆపిల్లను తెచ్చి నాకే అంటగట్టేయాలని ఈమధ్య ఎత్తులువేశారు. 'చచ్చాంరా బాబూ!' అనుకున్నాను. ఆ అమ్మాయి నాకంటే పదిరోజులు పెద్దది!

"ఐతే చిన్నబాబుగారికేమీ మెత్తబడటం లేదా అమ్మగారూ," అన్నాడు గురులింగం.

"ఊహూ. వాడేం చిన్నవాడా గురులింగం! వాడంతకు వాడే ఆలోచించుకోవాలి. నాకు మునుపటిలా వంటలూ వార్పులు చేయడానికి ఓపిక చాలడంలేదు. మా అన్నయ్య ఎప్పుడెప్పుడని ఉత్తరాలపైన ఉత్తరాలు వ్రాస్తున్నాడు," అంది అమ్మ.

"కాలం కలిసివస్తే, అన్నీ జరిగిపోతాయమ్మగారూ! వచ్చే పండగనెల కల్లా అబ్బాయికి పెళ్ళవుతుంది. అమ్మాయి కాపురానికి వెళ్తుంది," అన్నాడు గురులింగం.

ఏనమ్మకంతో గురులింగం అలా చెప్పాడో నాకు తెలియదు. కానీ ఆరునెలలకల్లా అతడిమాటలు అక్షరాలా నిజమయ్యాయి. కానీ ఈ సంవత్సరం పండుగనెల ప్రారంభమయ్యేసరికి ఆకఠోర వార్త కొస్తా మా ప్రాంతమంతటా గుప్పుమని వ్యాపించిపోయింది. అన్నయ్యకు పెళ్ళయింది. అక్కయ్య బావతో లక్షణంగా కాపురం చేసుకుంటోంది. కానీ ఈ శుభవార్తలు వినడానికి గురులింగం లేడు. మమ్మల్ని దీవించడానికి సంక్రాంతి శంఖం ఇకరాదు! 

# మేలుకొలుపు

ప్రాచీన గాథాలహరి

పి. గణపతిశాస్త్రి

"ఇంకా ఊరు మాటుమణిగిందో! లేదో! అప్పుడే ఏమిటీ నిద్ర! లేలే!"

అలాగ రంగనాయకి ఎంతసేపు పిలిచినా శ్రీవిరాజితం మారుపలకలేదు. పైగా ఒళ్ళంతా కప్పుగున్న కాశ్మీరుశాలువ ఇంకా కాళ్ళదాకా బాగా ముసుగుతన్ని కొంచెం పక్కకి ఒత్తిగిలి పడుకుంది. కాని రంగనాయకి శ్రీవిరాజితం లేచేదాకా విడిచిపెట్టలేదు. శ్రీవిరాజితం జబ్బచేత్తో దొరకబుచ్చుకుని నెమ్మదిగా అటూ ఇటూ గుంజింది. అయినా శ్రీవిరాజితం లేవలేదు. రంగనాయకి ఆమెముఖం మీది శాలువా ముసుగు తొలిగించింది. దీపకాంతిలో ఆమె ముఖం చూడగానే రంగనాయకి కేదో కొంచెం అనుమానం తగిలింది. ఎంతో ఆప్యాయంగా ముఖంమీదకి ముసురుకొన్న ముంగురులు సవరించింది:

"ఇదేమిటి! ఏదో జెంగపెట్టుకున్నట్టున్నావే వేళ! లేలే! ముద్దుకృష్ణప్ప నాయనింగారీ వేళ రాత్రికి విజయం చేస్తున్నామని కబురు పంపించారు కూడాను! ఇలాగ మూతిముడుచుకుని పడుకుంటే ఎలాగ?"

"ఎప్పుడు వచ్చిందా కబురు?"

"ఇందాకానే."

"ఓహో! అలాగా!"

అని శ్రీవిరాజితం ఆవిషయం వినీ విననట్టుగా మాట్లాడకూడకుని ఉసూరుమని ఒక్క వేడినిట్టూర్పు విడిచిపెట్టింది. పడకగది కిటికీపక్కనే పండువెన్నెలలో కలకలలాడే ముద్దబంతులకేసీ చేమంతులకేసీ పగడాలలా మెరిసిపోయే చంద్రకాంతాలకేసీ పరధ్యానంగా చూస్తూ తిరిగీ మెల్లిగా నిట్టూర్చింది.

విజయనగర రాజవీథులన్నీ చాలావరకు సద్దుమణిగాయి. అయినా అశ్వికుల విలాస మందగమనాల సందడి ఇంకా అక్కడక్కడ చూచాయగా వినిపిస్తూనే ఉంది. విట్ఠలస్వామి దేవాలయంలోను, హజారా రామస్వామి దేవాలయంలోను కల్యాణోత్సవాల సందడి భోరుమని మారుమోగింది. శ్రీవిరాజితం భవంతి కల్లంతదూరంలో ఉన్న శ్రీకృష్ణస్వామి దేవాలయంలో గోదాదేవి కళ్యాణమహోత్సవంలో పాశురాలు మంద మందంగా వినిపించాయి. మళ్ళీ ఇంకొకమారు రంగనాయకి శ్రీవిరాజితంకేసి చూసింది. ఆ సమయంలో ఆమె కనుగొలుకులలో రెండు చిన్నచిన్న కన్నీటిబిందువులు కనిపించాయి. రంగనాయకి ఆమెముంగురులు సవరిస్తూ మళ్ళీ అడిగింది:

"ఇదేమిటిలా గున్నావీవేళ? ఇదిగో! చెప్పకపోతే నన్ను చంపుకుతిన్నట్టే!"

అయినా శ్రీవిరాజితం సమాధానం చెప్పలేదు. అలాగే పులుకూ పులుకూ రంగనాయకికేసి చూసింది. రంగనాయకి మళ్ళీ ఆమె బుజాలు గుంజి చెప్పక తప్పదన్నట్టు బలవంతం చేసింది. శ్రీవిరాజితానికి చెప్పక తప్పలేదు:

"ఏమని చెప్పను! ఈవేళ ముత్యాలహారం కోసం సందువాపెట్టె తీస్తే అడుగు అరలో శెవ్వప్పనాయనింగారు చిన్నప్పుడు నాకు వేలికి పెట్టిన ముద్దుటుంగరం కనిపించింది. ఎక్కడో పోయిందనుకున్నాను గాని తలవని తలంపుగా ఈవేళ అది నాకంటపడింది."

రంగనాయకి అది విని ఆలాగే విస్తుపోయింది:

"ఈ శెవ్వప్ప ఎవ్వరే!"

"ఎంటుకులే ఇప్పుడదంతా!"

అని శ్రీవిరాజితం మళ్ళీ నిట్టూర్చింది. కాని రంగనాయకి ఆ సంగతి అంతటితో విడిచిపెట్టనీయలేదు. శ్రీవిరాజితం గాలిలో కదలాడే చంద్రకాంతాలకేసి చూస్తూ మొదలుపెట్టింది:

"రంగా! నాకప్పుడింకా పట్టుమని పదహారేళ్ళయినా నిండాయో లేదో! అవి అప్పుడే కొత్తగా గజ్జెకట్టిన రోజులు. ఒకనాడు శ్రీకృష్ణస్వామి వారి కళ్యాణోత్సవాల్లో భామకలాపం జరుగుతూండగా——"

"శెవ్వప్ప సంగతి అడిగితే మధ్యన ఈ భామకలాపం అంతా మొదలుపెట్టావేమిటి?"

"నువ్వెప్పుడు ఇంతే! చెప్పేది తిన్నగా వినిపించుకోకుండా మధ్య మధ్యన అడ్డుపుల్లలు వేస్తావు! చెప్పేదాకా వేపించుకు తింటావు. తీరా ప్రారంభించేసరికి అడుగడుక్కి అడ్డప్రశ్నలే!"

"అపరాధం! అపరాధం!"

అని రంగనాయకి మళ్ళీ బతిమాలింది. శ్రీవిరాజితం మళ్ళీ మొదలుపెట్టింది:

"శెవ్వప్పనాయనింగారు రోజు రోజు అక్కడికి వచ్చేవారు. ఆయన కంటబడిన క్షణంనించీ నా మనస్సేమో అదోలాగైపోయింది."

"తరవాత?"

ఆపైన శ్రీవిరాజితం కొంతసేపేదో ఆలోచిస్తూ ఉసూరుమని నిట్టూర్చింది:

"రంగా! చిన్నతనంలో కలిగిన మమకారమే మమకారమనుకో! ఇక ఆ తరవాతివన్నీ ఉత్తుత్తి మమకారాలే!"

"అయితే శెవ్వప్పనాయనింగారికీ నీకు బాగా చిన్నప్పుడే చెలిమి కలిసిందన్నమాట!"

"అయ్యో రాత! ఆ మాత్రం అదృష్టం కూడా నా నాకు!"

"ఏం ఏమి జరిగింది?"

"వారిది అంతగా భోగభాగ్యాలున్న కుటుంబం కాదు. పైగా ఆయన తండ్రిచాటుబిడ్డ. అందుచేత మాఅమ్మ ఆయన మన గడప తొక్కడానికి వల్లపడదని పట్టుపట్టింది."

"అయితే మీ అమ్మ ఇదంతా ముందుగానే పసిగట్టిందన్నమాట!"

"పసిగట్టడమేమిటి? నా ప్రాణాలు కొరికి వేసిందనుకో!"

"పోనీ! మీ రిద్దరు ఎప్పుడైనా ఒకమారైనా ముచ్చటగా కలిసి మెలిసి కాలక్షేపం చేశారా?"

"లేదు!"

"నిజంగా!"

"నిజమే!"

"ఎందుచేత?"

"అమ్మ కెప్పుడు భాగ్య భోగ్యాలమీదికన్ను! ఎవరైనా మేళానికి ముందుగా నాతో కొంచెం సరసాలాడితే వారి పుట్టుపూర్వోత్తరాలన్నీ గట్టిగా ఆరా తీసేది."

"మరి శెవ్వప్ప నాయనింగారు నీ కోసం ఎప్పుడూ కబురు పంపించలేదా?"

"పంపిస్తే మాత్రం ఏం లాభం! అమ్మ ఆయన్ని మన గడప తొక్కనిస్తేనా?"

ఆ పైన రంగనాయకి కొంచెం సేపేదో ఆలోచించింది:

"అయితే ఆయన ఇప్పుడు మన రాజధానిలోనే ఉన్నారా?"

"ఉంటే ఈ పాటికి రెక్కలు కట్టుకుని అక్కడవాలి పోకపోయానా!"

"ఇప్పుడాయన ఎక్కడ ఉన్నారో?"

"పాండ్య రాజ్యానికి వెళ్ళిపోయారనీ నాగమనాయనింగారి కొలువులో కుదిరారనీ అంటున్నారు మరి."

"మళ్ళీ నీ వెప్పుడు ఆయన్ని చూడనే లేదా?"

"లేదు."

"అయితే మరి ఈ ముద్దు కృష్ణప్పనాయనింగారితో నీకు జోస్తీ ఎప్పుడు కలిసింది?"

"ఇంచు మించుగా ఆ రోజుల్లోనే!"

"ఈయనగారి భాగ్యభోగ్యాలుచూసిమురిసిపోయి మీ అమ్మ చెవ్వప్పనాయనింగారిని నీదరిమూనానికి కూడా రాకుండా చేసి ఉంటుంది. అంతేనా?"

"అంతే!"

అంతలో రంగనాయకికి ముద్దు కృష్ణప్పనాయకునిమాట జ్ఞాపకం వచ్చింది:

"అన్నట్టు ముద్దుకృష్ణప్పనాయనింగారు వచ్చేవేళ అయినట్టుందే! ఒకసారి వీథిగుమ్మందాకా వెళ్ళి చూసిరానా?" అని రంగనాయకి బయలుదేరబోయింది.

"ఆ వస్తే వస్తారు! అంత ఎదురు సన్నాహం చెయ్యవలసిన అవసరమేమీ లేదులే!"

అని శ్రీ విరాజితం రంగనాయకిని చెయ్యిపట్టుకుని ఆపి వేసింది. రంగనాయకి తొందరగా చెయ్యి విడిపించుకుంది.

"నీకేం? ఏదైనా కొంచెం అమర్యాద జరిగితే మీ అమ్మ నా గొంతుక్కి ఉరి బిగిస్తుంది. ఇప్పుడే వస్తానుండు!"

అని చెంగున గంతేసి రంగనాయకి వీథిగుమ్మంవైపు వెళ్ళిపోయింది.

౨

రంగనాయకి తిరిగి వచ్చేదాకా శ్రీ విరాజితం అలాగే పడుకుని పండు వెన్నెలకేసి చూసింది. మిద్దెమీద పావురాల జంటల కలకూజితాలు మధుర మధురంగా వినిపించాయి. చూరులలో వేళ్ళాడే సరికొత్త వరివెన్నుల గుత్తులమీద ఎగిరే పిచ్చుకల రెక్కలు రెపరెప లాడుతూ మెరిశాయి. దూరంగా ఒక పారిజాతం కన్నీరు రాల్చినట్టొక్కొక్క పువ్వే జారవిడిచింది. శ్రీ విరాజితం తన వేలిమీది ముద్దుటుంగరం ఒక్కసారి మనసారా



కోడిపందెం

చిత్రకారుడు: పి. నాగేశ్వరరావు - క్రోసూరు.

ముద్దుపెట్టుకుంది. అంతలోనే రంగనాయకి తిరిగివచ్చి అది చూసింది:

"అన్నట్టు అడగడమే మరిచిపోయాను. ఈముద్దుటుంగరం ఎప్పుడు సంపాదించావే!"

"అదే చెబుతూంటే అంతలోనే తుర్రుమని పారిపోయావు. విను మరి."

అని శ్రీ విరాజితం ఒక్కమారు అటు ఇటు జాగ్రత్తగా పరకాయించి చూచి తన ముద్దుటుంగరం కథ మొదలుపెట్టింది:

"ఒకనాడు మా అమ్మ అలిమేలు మంగతాయారమ్మవారికి ఏడుకొండలవాడికీ ముడుపు చెల్లించాలని బయలుదేరి వెళ్ళింది."

"అమ్మయ్యా! నీ రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాట! తరవాత?"

"నా అదృష్టంకొద్దీ చెవ్వప్పనాయనింగారప్పుడిక్కడే ఉన్నారు."

"ఇహనేం! నువ్వు ఎగిరి గంతేసి వారి భవంతిలో వాలిపోయావన్నమాట! అంతేనా?"

"లేదు!"

"మరి?"

అని ఎంతో ఆత్రంగా అడిగింది రంగనాయకి.

"నేనే వారినిక్కడికి రమ్మని కబురు పంపించాను."

"అదెలాగ సాధ్యపడింది? ఇక ఈ ఇంట్లో ఎవరు లేరా?"

"లేకేం మాణిక్యం అనే దాసీది ఉండేదిలే! దాన్ని ఎలాగో అలాగ మంచిమాట చేసుకుని మాఅమ్మతో చెప్పవద్దని కాళ్ళావేళ్ళా పడి బతిమాలుకున్నాను."

"ఇంతకీ చెవ్వప్పనాయనింగారిక్కడికి వచ్చారా?"

"ఒక పట్టాని రాలేదు. అమ్మకిష్టంలేదని ఆయన మా ఇంటికి రావడాని కంగీకరించలేదు."

"ఆపైన నువ్వేం జేశావు?"

"అమ్మ తిరుమల క్షేత్రానికి వెళ్ళిందనీ, ఇంతట్లో తిరిగిరాదనీ, మాణిక్యంచేత చెప్పించి పరిపరివిధాల బతిమాలించాను."

"తరవాత ఏమైంది."

"మాణిక్యం తిరిగివచ్చింది. బతిమాలుకోగా బతిమాలుకోగా చిట్టచివరి కాయన అంగీకరించారనీ ఆ రాత్రే విచ్చేస్తామన్నారనీ చెప్పింది."

"మీఅమ్మకళ్ళే కప్పివేశావే! నీవెంతకైనా తగినదానవే! ఆ తరవాత?"

తరవాత శ్రీ విరాజితం తిరిగీ ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టింది:

"రంగనాయకీ! ఆ రాత్రి నా జన్మలోనే నెన్నటికీ మరిచిపోలేదు. అప్పుడే ఆయన నాకీ ముద్దుటుంగరం వేలికి పెట్టారు. అది

# సంక్రాంతి

**కొమరగిరి వేంకటసుబ్బారావు**

తెల్లవారెను, తేగు పండ్లెల్ల రాలె,
చెల్లి! నిద్దుర లే లెమ్ము, పిల్లలంద
రేరుకొనకుండ ముందుగా నేగి మనము
తెచ్చుకొని మంచి ముగ్గుతో మచ్చలైన
రథము, చిలుచాప, విసనకర్రయును, మల్లె
పందిరియు, మంచి గుమ్మడి పండు, పెండ్లి
పీట మొదలైన వెన్నియో పెద్ద చిన్న
బొమ్మ లెన్నింటినో మన గుమ్మమందు
వేసి, గొబ్బెమ్మలన్ జేసి వేగ పెట్ట
వలయు, సంక్రాంతి పురుషుడు వచ్చువేళ
యగును, లెమ్ము చెల్లీ! తలలంటుకోసి
జడలు వేసుక బొమ్మల చక్కగాను
పేర్చి పేరంటమును బిల్వ వెళ్ళవలయు.

"అమ్మ బొట్టెట్టుకొనుడు, సాయంత్రమునకు
పండ్లుపోతుము మాచెల్లి పద్మినికిని,
గాన తప్పక మీ రట కరుగుదెంచి
యందరికి పోలె దీవించుడమ్మ! సెలవు"



# మెరుపు



సరిగా గోదాదేవి కల్యాణం రోజుల్లోనే జరిగింది. అది జరిగి అప్పుడే నాలుగేళ్ళయింది. సరీగా ఇంచుమించుగా ఇదే సమయంలో ఆ పారిజాతంచెట్టు కొనుకొని నేను సెవ్వప్ప నాయనింగారి రాకకోసం ఎదురుచూస్తూ నిలుచున్నాను. అంతలో ఆ ఎదురుగా ఉన్న గుమ్మం తలుపు తట్టిన చప్పుడైంది. అది వినగానే నా గుండె గుబగుబ లాడింది—"

శ్రీ విరాజితం అంతవరకు చెప్పి హఠాత్తుగా ఆగింది. అంతలో ఆ భవంతి వీథి గుమ్మం దగ్గిర భోరుమని మంగళతూర్యాల సందడి మిన్నుముట్టింది. రంగనాయకి ఆ సందడి వింటూనే అదిరిపడి లేచింది:

"అదిగో! స్వామి కళ్యాణోత్సవం ఊరేగింపు మన గుమ్మంముందే నిలబడ్డట్టుందే! ఇద్దరం వెళ్ళి త్వరగా స్వామికి మంగళహారతి ఇచ్చివద్దాంరా!"

అని రంగనాయకి ఆ కథ పూర్తికాకుండానే తొందరగా తనతో కలిసి రావలసిందని శ్రీవిరాజితాన్ని బలవంతపెట్టింది. కాని శ్రీవిరాజితం రంగనాయకి మాట వినిపించుకోలేదు:

"మంచి రసకందాయంలో కథ వినకుండా పరిగెత్తుకు పోతానంటావు! నువ్వెప్పుడూ ఇంతే! నే నిప్పుడు నీతో రాలేను సుమా! కావలిస్తే నీవు వెళ్ళిరా!"

అని రుసరుస లాడింది. రంగనాయకి మరిచేసేదేమీ లేక తొందరలొందరగా భవంతి సింహద్వారం దగ్గిరికి వెళ్ళిపోయింది. శ్రీవిరాజితం మరి చేసేదేమీ లేక గది తలుపు తెరిచి ఒయ్యారంగా అడుగులు వేసుకుంటూ పారిజాతం దగ్గిరికి వెళ్ళింది. నేలమీద రాలుతున్న పువ్వు లొక్కొక్కటే ఏరి సిగలో తురుముకుంది.

ఆ విధంగా ఆ పువ్వులు సిగలో తురుముకుంటూంటే ఆమెకుపూర్వం ఆ ప్రదేశంలో తా ననుభవించిన ఆనందం అంతా ఒక్కమారుగా జ్ఞాపకం వచ్చింది. ఆ పూర్వానుభూతి సంస్మరణలో మునిగిపోయిన శ్రీ విరాజితం అయిదారు నిమిషాలవరకు పాలరాతి ప్రతిమలా అలాగే నిలబడింది. ఆమె ఆ ఆనందానుభూతి అంతా చెలికత్తెతో చెప్పుకోవాలని ఎంతైనా అనుకుంది. కాని అంతలోనే రంగనాయకి స్వామికి హారతి ఇవ్వాలని వీధి గుమ్మంలోనికి వెళ్ళిపోయింది.

'రంగనాయకి ఎప్పుడూ ఇంతే'అని రుసరుసలాడుతూ శ్రీవిరాజితం ఇంకా కొంతసేపటివరకు అక్కడే నిలబడింది.

## 3

తరవాత శ్రీ విరాజితం తొందరగా అడుగులు వేసుకుంటూ పడకగదిలో ప్రవేశించింది. ఆమెకెదురుగా కొలువా ముసుగు కనిపించింది. అదిచూచి శ్రీవిరాజితం కొంచెం ఆశ్చర్యపడింది

"రంగనాయకి అప్పుడే లోపలికి వచ్చి వేసిందే! అడుగుల చప్పుడైనా వినబడ లేదే! పరధ్యానంగాఏదోఆలోచిస్తూంటే నాకేమీ వినబడలేదు కాబోలు!"

అని తన అలసత్వానికి కొంచెం కించపడింది. వంటనే మిగిలినకథ రంగనాయకితో చెప్పడం మొదలుపెట్టింది :

"రంగా! నీవప్పుడే తిరిగి వచ్చివేసిన సంగతి నేను గమనించనే లేదుసుమా! ఆ తరవాత ఏంజరిగిందో తెలుసునా! ఆయన గుమ్మంతలుపు తెరుచుకుని తటాలున లోపలికి వచ్చారు. నే నాయన్ని చూస్తూనే శిలాప్రతిమలా నిలబడిపోయాను. ఆ సమయంలో నాకు కాళ్ళాడలేదు. ఆయన లోపలికి వస్తూనే నన్ను బిగువుగా గుచ్చి కౌగలించుకున్నారు. అలాగ ఆ కౌగిలింతలో ఎంతసేపున్నానో నాకే తెలియదు! అదంతా నాకొక్కక్షణంలో కన్ను మూసి తెరిచేనంతలో జరిగిపోయినట్లనిపించింది. ఆక్షణం నేనెన్నటికీ మరిచిపోలేను రంగనాయకీ!"

అని శ్రీవిరాజితం ఒక పేటి నిట్టూర్పు

విడిచిపెట్టింది. తరవాత రంగనాయకి కేసిచూసింది. రంగనాయకికి అడుగడుక్కీ ప్రశ్నలు వెయ్యడం అలవాటు. కాని ఆమె శ్రీవిరాజితం చెప్పింది విని ఊకొట్టనైనా ఊకొట్టలేదు.

"అదేమిటి రంగనాయకీ! నన్నింతో బలవంతపెట్టి చెప్పేది కడకంటూ వినకుండా అప్పుడే కునికిపాట్లు పడుతున్నావా?"

అని శ్రీవిరాజితం రంగనాయకి ముఖంవైపు కొంచెం పరిశీలనగా చూసింది.

ఆ పరిశీలనతో శ్రీవిరాజితాని కొక్కసారిగా గుండె జలదరించింది. ఒళ్లంతా ముచ్చెమటలు పోశాయి!

అక్కడ ముసుగు తన్ని పడుకున్నది రంగనాయకి కానేకాదు! ముద్దుకృష్ణప్ప నాయకుడు! అతడెప్పుడు లోపలికి వచ్చాడో ఆమెకు తెలియనేలేదు. బహుశః స్వామి ఊరేగింపు ఇంటిముందర నిలిచినప్పుడాయన నెమ్మదిగా లోపలికి వచ్చాడేమో! అది గమనించి రంగనాయకి మళ్లీ లోపలికి రావడమే మానివేసిందేమో!

అలాగ శ్రీవిరాజితం మనస్సులో ఎన్నెన్నో ఊహాపరంపర లొక్కక్షణంలో క్రొక్కారు మెరుపుల్లా మెరిసిపోయాయి.

శ్రీవిరాజితం ముద్దుకృష్ణప్ప నాయకుని ముఖం మళ్ళీ బాగా పరిశీలనగా చూచింది. అతడు మేలుకున్నా నిద్రపోతున్నట్టే నటిస్తున్నాడు. తిరిగి పడకగదిలోకి వచ్చినప్పటినించీ తాను చెప్పినదంతా అత డాలకించాడేమోనని ఆమెకు కొంచెం భయంవేసింది. అక్కడ పడుకున్నది రంగనాయకే అని భ్రమించి ఆమె ఆవిధంగా తన పూర్వగాథ ఏకరువు పెట్టింది.

ఆమెకొ క్షణంలో మెరుపులా ఒక



భోగిమంట

చిత్రకారుడు: పి. నాగేశ్వరరావు,—కోనూరు

ఉపాయం తట్టింది. ఏమీ ఎరగనట్టుగా తన కథ మళ్ళీ మొదలు పెట్టింది:

"రంగనాయకీ! అప్పుడే కునికిపాట్లు పడుతున్నావా! నేను చెప్పేదంతా అయిపోయిందిలే! ఈ కొస్తా కొంచెం శ్రద్ధగా విను మరి!

"నేనలాగ ఎంతసేపున్నానో నాకే తెలియదు. ఆ తరవాత మా అమ్మవచ్చి నే నింకా లేవలేదేమని నా పడకగది తలుపు గట్టిగా తట్టింది. దానితో ఆ పాడు పీడకల అంతా ఒక్కసారిగా మంచు కరిగినట్టుగా కరిగిపోయింది. రంగా! లేచాక ఆ పాడుకల తలుచుకుని నన్ను నేనే చీదరించుకున్నాను. ముద్దుకృష్ణప్పనాయనింగారి ఒద్దికలో హాయిమంటూ కాలక్షేపం చేస్తున్న నాకీ పాడిలాంటిపాడుకలవచ్చిందే అని ఎంతైనా నొచ్చుకున్నాను. ఆయన నట్టింట లేకపోవడం వల్లనే నా కిలాంటి అనరాని వినరాని పాడుకల వచ్చిందనుకొని ఆ మర్నాడు ప్రొద్దునే లేచి సచేలస్నానం చేశాను. నాకు వచ్చిన పాడుకలంతా ఇది."

అని శ్రీవిరాజితం ఎంతో మెలకువగా ఆ ఇరుకులోనించి తప్పించుకొని తేలిగ్గా ఇవతల పడింది.

తరవాత నెమ్మదిగా ముద్దుకృష్ణప్పనాయకుని ముఖంమీది ముసుగు తొలగించి ఎంతో ఆప్యాయంగా ఒక్క ముద్దు పెట్టుకుంది:

"ఇదిగో! మీ రెప్పుడు లోపలికొచ్చారు! పిల్లిగా అడుగులు వేసుకుంటూ మెల్లిగాలోపలికొచ్చిపడుకున్నారా! అమ్మదొంగా! మీ రంత కైనాతగినవారే! ఇందాకటినించీ మిమ్మల్ని చూసి రంగనాయకే అనుకున్నానుసుమండీ?"

అని శ్రీవిరాజితం ముద్దుకృష్ణప్పనాయని ముఖంమీద తిరిగీ ఆపేవనిగా ముద్దుల వర్షం కురిపించింది.

ఆ ఉపాయంతో కొంచెం అనుమానంగా ఆమె చెప్పే కథ వింటున్న ముద్దుకృష్ణప్ప నాయని మనస్సులోని అనుమానాలన్నీ ఒక్కసారిగా పటాపంచలై పోయాయి.

అంతవరకు అతడు మేలుకునే ఉన్నాడు కాని నిద్రపోతున్నట్టే నటించాడు. అయితే ఇప్పుడు నిజంగానే మేలుకొన్నట్టుగా నటించి లేచి కూర్చున్నాడు. శ్రీవిరాజితం తన వాచాలతకి సంతోషంతో అతన్ని మరింత విరివిగా కౌగిలించుకుంది.

ఆ గాఢాశ్లేషంతో అతని నేత్రాలు మళ్ళీ నిద్రాభారంతో తూలిపోయాయి. ★




ఇప్పుడు సంకురాంతిరి వచ్చింది గదా. బామ్మ సంకురాత్రి అంటుంది. బామ్మకి తెలీదనుకో. ఇంగ్లీషుకూడా రాదు బామ్మకి.

మరి నేను పెద్దాడిని అవుతే కలకటేరు అవుతాడు అంటుందిబామ్మ.

కలకటేరు అంటే యింగ్లీషు. అస్సలది కలట్ కర్ అన్నమాట. బామ్మకి తెలీదనుకో. అందుకని కలకటేరు అంటుంది. యేం చేస్తాం.

యేం. ఇప్పుడు యీ సంకురాంతిరి అంటే భోగి. భోగి అంటే భోగి పళ్లు పొయ్యడం.

కాణీలూ రేగి పళ్లూ కలిపితే భోగిపళ్లు అంటారు. అవి మన నెత్తి మీద, పోస్తే మనం ఆ కాణీలు ఏరేసుకుని దాచేసుకోడం అన్నమాట.

పూర్వకాలంలో అంటే నాచిన్నప్పుడుకాదు, నీ చిన్నప్పుడు దంబిడీలు వుండేవిలే. ఇప్పుడు తేవ్వుటలే.

భోగి మంచి పండగ.

ఇలా అని బాబాయి కూడా చెప్పాడు. బాబాయికి భోగి పళ్లు పొయ్యరనుకో. అయినా వాడికి ఒద్దుటకూడా.

అసలు సంకురాంతిరి అంటే భోగి కాదుట. భోగి అంటేనే సంకురాంతిరిట. ఇలా అని బాబాయి చెప్పాడు.

సంకురాంతిరి అంటే, సుబ్బలష్మి, సూరీడు, సావిత్తిరి వాళ్లందరూ పొద్దున్నేనూ, సాయింతరమూనూ ముగ్గులు పెయ్యడం అని అర్దంట. గొబ్బిళ్లుపెట్టి డాన్సు చెయ్యడంట.

అప్పుడు చూట్టానికి బాగుంటుందట. ఇది బాబాయి అభిప్రాయం.

వాడిదగ్గర ఇలాంటివి చాలా వున్నాయని చెప్పానుగా. ఇవేకాదు. బాబాయిదగ్గర అభిప్రాయాలూ, పిచ్చివేషాలూ, రంగుపువ్వుల చొక్కాలూ, సిగరెట్లు, ప్రదణాలూ, ఘాగరుమోత్తనం పోకిరీ గుణాలూకూడా ఉన్నాయి. నాన్న ఇవన్నీ చూశాడుట. నేను చొక్కాలూ, సిగరెట్లు మాత్రంచూశాను. మిగతావి చూళ్లేదనుకో—

సిగరెట్లు తెల్లగా ఉంటాయిలే. వీటిని బాబాయిలాంటి కుర్రాళ్ళు కాలుస్తారు. కుర్రాళ్లే కాలవాలిట సిగరెట్లు. ఇలా అని బాబాయి చెప్పాడులే.

మరి నేను పెద్దవాణ్ణిగా. అందుకు కాలవను. నేను యింఖా పెద్దవాడయ్యాకా జెటకా బండీయేనా రైలింజనేనా తోలుతాను. అందుకని బీడీలు దాస్తాననుకో!

యేం. మరి ఈ సంకురాంతిరి ఉందా. ఇది మెడ్రాసులో లేదు. మా నిజెం వూళ్లో వుందన్న మాట. కాని నిఝంగా చెప్పాలంటే మాది మెడ్రాసే అనుకో. అసలు సంగతి చెప్తాను.

ఇప్పుడు మా వూళ్లో భోగిమంట వేస్తారు గదా. దానికి పిడకలు చాలవుగదా. మరి కుర్చీలూ, కర్రలూ, కాయితాలూ, అట్టలూ లేకపోతే యలా.

మరి మనింటో, మా నాన్న కాయితాలూ, మా నాన్న విరిగిపోయినకుర్చీలూ అవీ భోగిమంటకి వేస్తే నాన్న చంపలు వాయిస్తానంటాడుగదా.

అందుకని మా యింట్లో నాన్న కాయితాలకన్నా, విరిగిపోయిన పక్కింటివాళ్ళ కుర్చీలు బెస్టు. విరిగిపోయిన పక్కింటివాళ్ళ పుస్తకాలూ కాయితాలూ కూడా బెష్టే.

బెష్టంటే మనకి ఇంచక్కా ఉండేది; ఇంకోళ్ళకి కోపం ఒచ్చేది. ఇలా అని బాబాయి చెప్పాడు.

ఏం? నేనిలా విరిగిపోయిన పక్కింటివాళ్ళ కుర్చీలూ, అవీ రౌడీలకి చూపించి భోగిమంటలో వెయ్యమంటానా. అప్పుడు, పక్కింటివాడు, వాళ్ళ పెళ్ళానికి చెప్తాడు. వాళ్ళ పెళ్ళాం మా నాన్న పెళ్ళానికి చెప్తాడు.

మా అమ్మ అప్పుడు నాన్న వినేలా నన్ను కోప్పడేస్తుంది. నాన్న అప్పుడు నన్ను బామ్మ వినకుండా చెంపలు వాయించేస్తానంటాడు. కాని బామ్మ వినేస్తుంది.

బామ్మకి అస్తమానూ చెముడు లేదుగా. ఎప్పుడేనా ఒకోసారి ఉంటుంది.



"...మనకి కొత్తబట్టలూ అవీ కుట్టించుకుంటారు."



ఇంకోళ్లింట్లో కాణీలన్నీ మనం తెచ్చుకుంటామనుకో. మనింట్లో కాణీలన్నీకూడా మనం తెచ్చుకోవద్దూ?

అప్పుడేమో బామ్మ నన్ను వెనకేసుకొచ్చి నాన్నతోటీ అమ్మతోటీ పోట్లాడుతుంది.

బామ్మ లావుగా వుంటుందిగా. అందుకని, నన్ను వెనకేసుకొస్తే నేను అస్సలు కనబడను.

కాని ఒక్క సంగతి ఉంది.

అది యిప్పుడే గ్నాపకం వచ్చేసింది.

అస్సలు బామ్మ లావుగా లేకపోయినా, నన్ను వెనకేసుకు రాకపోయినా నాన్నా అమ్మా నిఝంగా నన్ను కొట్టరు. కొట్టినా ఘట్టిగా కొట్టరు తెలుసా?

వాళ్ళు మంచివాళ్ళు. అందుకని.

మనం అంటే పాపం చాలా యిష్టం అందుకని.

ఇపుడు, అమ్మ నన్ను కొట్టేస్తానందనుకో. నాన్న సన్నంగా ఉన్నా వెనకేసుకొస్తాడు.

నాన్న నన్ను హన్నా అని కోప్ప చేస్తున్నాడనుకో. అప్పుడు అమ్మ చెంగు పట్టుకు నించున్నామంటే చాలు. మనకేం భయంలేదు. అమ్మ రక్షిస్తుంది.

ఏం. ఒక్కోసారి అమ్మా నాన్నా ఇద్దరూ 'హూ' అంరారనుకో. అప్పుడు బామ్మ రక్షిస్తుంది.

ఇలాగ వాళ్ళందరూ నను రక్షిస్తారు. నేనూ వాళ్ళని రక్షిస్తాననుకో.

ఒక్కోసారి నాన్న నిద్దర పోతున్నాడనుకో. అప్పుడు నాకు జాలేస్తుంది. పోన్లే పాపం అని అల్లరి చెయ్యకుండా వదిలేస్తాను.

అలాగన్నమాట.

ఇప్పుడు భోగిపండగగదా. నేను అల్లరి చెయ్యొచ్చు. పండగప్పుడు మనం అల్లరి చేసినా యెవళ్ళూ కొట్టరు. అందుకని.

కాని అందుకనే నేను అట్టే అల్లరి చెయ్యను. అల్లరి చేసినా యేం లాభం? ఆట్టే కోప్పడ్రుగదా.

అందుకని, పండుగప్పుడు మనం అమ్మనీ నాన్ననీ కాస్త రక్షించాలి. ఎందుకంటే పండుగగదా మరి.

పండుగ వచ్చిందని వాళ్ళు మనకి కొత్త బట్టలూ అవీ కుట్టించుకుంటారు. ఏవో ముస్తాబూ అదీ చేసి సరదాగా ఉంటారు.

కాని ఒక్కటి; పోనీ అని మనం వూరుకుంటే, తలంటి పోస్తానంటారు.

దానికీ సరేఅంటే, ఒళ్ళు నల్చుకో అని పేచీ పెడతారు.

పండగ కాబట్టి ఇలా వాళ్ళు కాస్త చాలా అల్లరి చేసినా మనం వాళ్ళని కోప్పడకూడదు.

యెందుకంటే, వాళ్ళు మంచి వాళ్ళు.

బామ్మకన్న, బాబాయికన్న, నీకన్నా, నాకన్నా చాలా చ్ఛాలా ఎక్కువ మంచ్చి వాళ్ళు. మనం తలంటి పోసుకుని వాళ్ళకి దండం పెట్టి ముద్దివ్వాలి. అదీ సంగతి. ★

(హింకా వుంది)




# బావా మరదళ్ళ - సరసాలు

బొహరా వేంకటసుబ్బారావు

పండగనాటికి కొత్త అల్లుడూ
అత్తారింటికి వచ్చాడు.
మొట్టమొదటనే అందరికంటే
చిట్టి మరదలే చూచింది.

మర: "అమ్మా! మన బావొచ్చాడే!
అక్కా! నీ మొగుడొచ్చాడే!
చక్కని పూవులు తెచ్చాడే!
నాక్కూడా నీవిస్తావా!

"బావా! అక్కని రమ్మంటే
'శేరాఖో' అని అందిగదా?
కిటికీ తలుపుల సందుల్లోంచీ
తానెందుకు నిను చూస్తోంది?"

బావ: "చిట్టీ మరదలు బావను చేరి
సేరా లేమని చెబుతోందో నని
చాటున మాటున వింటోంది,
గబుక్కున పోయీ పిలుచుకురా
మరి!"

మర: "నాతో గమ్మతు చేస్తావా?
అక్కను ఊరికె పిలుస్తావా?
పట్నంనుంచీ ఏమైనా మరి
నాకోసం నువ్ తెచ్చావా?"

బావ: "గులాబి, సంపెగ, మల్లె
పూవులూ,
ఎరుపూ, పసుపూ, నల్లరిబ్బన్లూ
నిగనిగలాడే జడగంటల్లూ
ఇంకా చాలా తెచ్చాను."

మర: "అయితే బావా వింటావా!
నీకో సంగతి చెప్పాలి.
పండక్కోసం కొత్తల్లునికి
నాన్నా చాలా కొన్నారు."...

బావ: "అవునా! చిట్టీ! ఇట్లా రా!"
అని మరదలునూ పిలిచాడు.
"నాన్న రేమిటి కొన్నారో
నాతో అన్నీ చెప్తావా?"...

మర: "బజారుకెళ్ళీ పంచలచాపులు,
వాచీ కూడా కొన్నారు.
ఉంగరమని నే పేచీ పెడితే
నిన్ననె వెంటనె కొన్నారు"...

తనకే ననుకొని అల్లుడు ఎంతో
ఆనందంతో మురిశాడు.
"బలే తమాషా చేసాన"నుకొని
మరదలు మరలా ఇట్లంది...

మర: నిన్ననె ఇంట్లో బొమ్మలపెళ్ళీ
అయింది కనుకనె కొన్నారు.
మా కొత్తల్లుని కిచ్చారూ"
అంటూ చేతులు తిప్పింది...

బావ: "అంటె ఇక నే తెచ్చినవన్ని
నీకేనని అనుకొన్నావా?
కొత్తకోడలని పండగనాటికి
మరచిపోక నే తెచ్చాను"...

బావామరదలు సరసాలూ
అమ్మా అక్కా విన్నారు.
ముసిముసి నవ్వులు నవ్వారూ,
ఇంతలో నాన్న వచ్చారు...



# శ్రీరాముని జీవిత గమనం

పూర్వము దుర్వాసుడు వసిష్టాశ్రమములో వర్ష కాలమున యజ్ఞము చేస్తున్నాడు దశరథుడు కులగురువయిన వసిష్టుని చూడ వసిష్టాశ్రమానికి వెళ్లాడు. అక్కడ యజ్ఞాన్ని చూస్తూ మునులను సేవించసాగాడు తీరిక సమయములో దుర్వాసునికి నమస్కరించాడు:

'స్వామిూ' మా వంశము భూమియందు ఎందాకా ఉంటుంది? రాముడెన్నేండ్లు జీవిస్తాడు? తక్కిన కొడుకులు ఎంతెంత కాలము జీవిస్తారు? రాముడికి కుమారులెంతమంది? నా వంశము భవిష్యత్తు ఎలాంటిది?' అని ప్రార్థించాడు.

అప్పుడు దుర్వాసుడు పూర్వ గాథ చెప్పాడు. "పూర్వము దేవాసురులకు యుద్ధము వచ్చింది. దేవతలకు భయపడి రాక్షసులు భృగు మహర్షి భార్యను శరణుజొచ్చారు. ఆమె వారికభయమిచ్చింది. విష్ణువు దేవతలపక్షమున యుద్ధము సాగిస్తూ దుర్మార్గులైన రాక్షసులకు శరణు ఇచ్చిందని కోపించి భృగు భార్యను తన చక్రప్రయోగముచే సంహరించాడు.

అడివికి వెళ్ళి తిరిగివచ్చిన భృగు మహర్షి తన భార్యను కానక శిష్యులచే సంగతి తెలుసుకుని విష్ణువును, "జనార్దనా! నివు క్రోధముతో విచక్షణ జ్ఞానమును కోల్పోయి వధింపరాని నా భార్యను చంపావు నాకు భార్యావియోగము కలుగజేశావు.

## రామప్రియ

గనుక నీవు మనుష్యలోకమున జన్మించి పెక్కు సంవత్సరములు భార్యావియోగముతో బాధపడు" అని శపించాడు. కాని భృగువు కొంత సేపటికి భగవంతుణ్ణే ఎందుకు శపించానా అని చింతించి పశ్చాత్తాపుడై విష్ణువును పూజ చేశాడు. విష్ణువు వాని తపస్సుకు మెచ్చి అతనిని వదిలివేశాడు

ఆ విష్ణువే నీ కడుపున పుట్టి రాముడని పేరుపొందాడు. అతడు భృగు శాపము అనుభవిస్తాడు. అయోధ్యకు రాజై చాలాకాలం పరిపాలిస్తాడు కొంత కాలముభార్యావియోగముతో బాధపడతాడు. పదకొండు వేల సంవత్సరాలు రాజ్యముచేసి తరువాత వైకుంఠము చేరుతాడు. సీతవల్ల ఇద్దరు కొడుకులను పొందుతాడు. వారు అయోధ్యలో పుట్టరు. తరువాత రాముడే సీతాకుమారులకు పట్టాభిషేకము చేస్తాడు. వారితరువాత కొంత కాలానికి అయోధ్య శూన్యమై యుండి చాలకాలము పేరుప్రతిష్టలు లేకుండా ఉంటుంది తిరిగి ఋషభుడను రాజు పాలనలో పూర్వపు వైభవాన్ని పొందుతుంది "

రాముని జీవిత గాథను విన్న దశరథుడు ఎవరికీ ఈ విషయము తెలియకుండ గుప్తముగా వుంచాడు. సుమంత్రుడనే మంత్రికి ఒక్కడికే ఈ విషయము తెలుసును. దశరథుడు అతనికి కట్టుబాటు చేశాడు. తరువాత లక్ష్మణుడు రామాజ్ఞ మీూద సీతను అడవిలో వదిలి విచారపడుతున్నపుడు సుమంత్రుడు లక్ష్మణునికి ఈ కథ చెప్పి అతని విచారాన్ని మాన్పాడు.

అందుచేతనే రాముడు వివాహమయినతరువాత బహు కొద్ది కాలము సీతా సహవాస సౌఖ్యాన్ని పొందాడు. అరణ్యవాసములో సీతను పోగొట్టుకొని చాలకాలము భార్యా వియోగబాధ అనుభవించాడు. పెద్ద యుద్ధముచేసి రావణుని వధించి సీతతో అయోధ్యకు

(51-వ పేజీ చూడండి)

[illegible]



అత్తవారు పిలిచిన అల్లుడు
చిత్రకారుడు: ప. నాగేశ్వరరావు, (క్రోసూరు.)

# చింకి చొక్కా

పిళ్లా
సుబ్బారావుశాస్త్రి

"ఏమిట్రా...అబ్బాయ్! చొక్కా బయటపడేశావు?" అంటూ అడిగింది అమ్మ.

"మంచిదికాదే!... చింకి చొక్కా..." అన్నాను.

"చింకిచొక్కా అయితేనేం?... పెట్టెలో ఉండనీ..." అంది అమ్మ.

"పోనిద్దూ!...గొడవా!...ఇల్లు రాచుకుందుకు పనికివస్తుందిలే!" అన్నాను, తల దువ్వుకుంటూ.

"బావుందిరా!...దుక్కంత చొక్కాతో ఇల్లు రాయమంటా వేమిట్రా?...ఒక్క భుజందగ్గర్నే.. కదరా చిరిగింది! కుట్టించుకుంటే... పనికివస్తుందిలే!" అంటూ మడత వేసింది చింకిచొక్కాని, అమ్మ.

"నీతో...యిదేనమ్మా పేచీ! ఇన్ని చొక్కాలుండగా చింకిచొక్కా తొడుక్కోవలసిన ఖర్మం ఏమొచ్చిందీ?" అని - అమ్మమీద చిరాకుపడ్డాను.

"ఉండనీరా..." అంటూ, అమ్మ పెట్టెతీసి, చింకిచొక్కాని అట్టడుగున పడేసింది! నేనేం మాట్లాడలేదు. గడియారంవంకచూసి, బాత్ రూమ్ లోకి పరుగుతీశాను.

ఇది మూడునెలల కిందట జరిగిన సంగతి! ఒక్కసారిగా కళ్ళముందు తిరిగింది!

"వాడిలా చేస్తాడంటే...బట్టలు వేసేవాణ్ణికే! — ఉతుక్కుండే వాణ్ణిగా!" అన్నాను అమ్మమీద రుసరుసలాడుతూ!

"వాడలా చేసేవాడు కాదురా! వాడిపిల్లకి ఒంట్లో బాగులేదుట! వాడికున్న బాధలు వాడికీ ఉంటాయి! పాపం!...ఇవాళ రేపుకి వెళ్ళివుంటాడు" అన్నది అమ్మ.

"నువ్వందర్నీ ... ఇలానే వెన కేసుకు వస్తావు! అందువల్లనే ప్రతీ వెధవా చిన్నా-పెద్దా లేకుండా... తిరగబడుతూ వుంటారు. ఆ రామి గాడి కేమన్నా గౌరవం, మర్యాదా ...ఉన్నాయా? వాణ్ణి పనివాడిలా చూడనే చూడవు!" అన్నాను—

"ఒరే...సూర్యం! ఒక్క విష యం జాగ్రత్తగా ఆలోచించు!... రామిగాడు పనివాడే కావొచ్చు! వాడూ నీలాటి మనిషే!...వాడు పని వాడుకదా అని నీచంగా బానిసలా చూస్తావా?...ఐతే, మనలో వున్న గొప్పతనం ఏమిట్రా? ... అలాగని రామిగాణ్ణి 'ఏమండీ!'అని పిలవమని కాదు! వాడి కష్టాల్ని గురించికూడా

ఆలోచించాలి!" అంది అమ్మ—

"నువ్వు మొదట్నుంచీ...యింతే నమ్మా! ఇలా అయితే యీ లోకంలో బ్రతకడం కష్టమే!... ఈ రోజుల్లో ఉన్నదంతా అన్యాయం! అధికారం!! మనకున్న అధికారాన్ని అవసరమయినంతవరకూ ఉపయోగించుకోవాలి! అధికారానికే అంతా లొంగుతారు!"

"బియ్యే...పాసయ్యావని ఊరికే గానీ...మంచి గుణాలేవీ...నీ కబ్బలేదురా సూర్యం!...నీకు అధికారం ఉందని దాన్ని దుర్వినియోగం చేస్తావా?" అంటూ సూటిగా అడిగింది అమ్మ.

ఇక-అమ్మకేంసమాధానం చెప్పలేకపోయాను. "సరేలే—ఇప్పుడు నే...ఇంటర్వ్యూకి వెళ్లడం ఎలాగూ? ...ఒక్క-చొక్కా అయినా యింట్లో వుంచకుండా 'క్యాంప్' ఉందని అన్ని బట్టలూ పడేశావు! మూడు ఇంటర్వ్యూలు తగలడ్డాయి!"

నా మాటలకి అడ్డొచ్చి-"అదికాదురా! ఆ 'క్యాషియర్' వుద్యోగం వస్తుందన్నావుగా! ఏమయిందదీ?" అని అడిగింది అమ్మ.

"ఏమయిందీ...! ఆ మహానుభావుడు నన్ను ప్రత్యేకంగా పిలిపించాడు. ఉద్యోగం యిస్తాడనే అనుకున్నాను. తీరా వెళ్లినతర్వాత-మా అమ్మాయిని 'కట్నం'లేకుండా పెళ్లి చేసుకుంటావా-అని అడిగేడు! వాళ్ళమ్మాయిని చేసుకుంటే, కట్నంగా ఉద్యోగం యిస్తానని-అన్నాడు. నీ ఉద్యోగం లేకపోతే మానిపోయెను, మా నాన్నకి తెలిస్తే...చితక తంతారు!...అంటూ వచ్చేశాను" అన్నా—

"అదేంమిటీ! ముక్కూ-మొగం తెలీకుండా పెళ్లేమిట్రా?...అయినా ఈ వుద్యోగమన్నా వస్తుందని నమ్మకం ఉందా?" అంటూ, అంతవరకూ 'ఉద్యోగపర్వాలు' తిరిగేస్తున్న బొమ్మ అందుకుంది!

"ప్చ్...లేదు!"

"ఏం?..."

"ఏం ఏమిటి?...వేసుకుందుకు చొక్కా-యే లేదు!...ఇంటర్వ్యూకి ఏం వెళ్లనూ?" అన్నాను.

"పోనీ, ఆ చింకిచొక్కా...అలా మీ బొమ్మకి యిస్తే-నువ్వు స్నానం చేసి వచ్చేలోగా కుట్టియిస్తుందిగా!" అంది అమ్మ.

"ఆ చొక్కా-తొడుక్కొని వెళ్లేకంటే-ఇంటర్వ్యూకి వెళ్ళడం మానేస్తే మంచిది!" అన్నా-వళ్లు మండిపోయింది నాకు!

"అదేమిట్రా?"

"అంతే నమ్మా!...ఆ చొక్కా చూడగానే...వీడెవడో...లేబర్ క్లాస్ దబ్బా అని-నిర్ణయించేసుకుంటాడువాడు!" అన్నాను. అంతేగా మరి!

"ఫర్వాలేదులే! వస్తేవచ్చింది...లేకుంటే లేదు! వెళ్లు!!" అంది అమ్మ.-ఇక అమ్మమాట తీసేయలేక, ఆ చింకిచొక్కా-తోనే ఇంటర్వ్యూకి వెళ్లాను!

ఇంతకీ విశేషం, ఏమిటంటే-నాకు ఉద్యోగం అయింది! ఆ పనికిరాని చింకిచొక్కా-యే, నాకు యీనాడు ఉద్యోగం యిప్పించింది! అందువల్లనే ఆ పనికిరాని చింకి చొక్కాని భద్రంగా పెట్టెలో దాచేను!-అసలు పనికిరాని వస్తువంటూ వుండదేమో!...మరి...! ★

## శ్రీరాముని జీవితగమనం

(49 వ పేజీ తరువాయి)

వచ్చిన కొంతకాలానికి లోకాపవాదము కొఱకు తిరిగి ఆమెను అడవిలో వదిలిరమ్మని స్వయంగా లక్ష్మణుణ్ణి పంపాడు. అప్పటికి గర్భిణిగావున్న సీత వాల్మీకి ఆశ్రమంలో కుశలవులను ప్రసవించి, వారు పెరిగి పెద్దవారైన దాకా భార్యా వియోగముతో బాధపడ్డాడు. వాల్మీకి సీత ఋజువర్తనమును లోకానికి ఋజువు చేసినప్పటికి భూదేవి సీతను తీసికొని పోవుటచే తిరిగి భార్యావియోగము కలిగి జీవితాంతమువఱకు బాధపడ్డాడు. భృగు మహర్షి శాపము రాముని జీవితాంతము వఱకు వెంటాడింది. దుర్వాస వాక్యముల ప్రకారం కుశలవులు అయోధ్యలో జన్మించలేదు. వారు తరువాత రాజ్యానికి వచ్చారు. వారి అనంతరము అయోధ్య పాడుబడిపోయింది. తిరిగి ఋషభుడను రాజు పాలనలో అయోధ్య పూర్వ వైభవాన్ని పొందగలిగింది. ★

# సినిమా

## ★ నక్షత్ర రజతోత్సవాల వేళ... ★

ఇది శబ్ద చిత్రాల పండుగ అయినా, నిశ్శబ్ద చిత్రాల ఉత్సవంవతుగా సాగుతోంది. నిజానికి పండుగరోజు పదినెలల క్రితమే వచ్చి వెళ్ళింది. అప్పటికి పరిశ్రమ పెద్దలు సమాలోచనల ఘట్టంలోనే ఉన్నారు. చివరకి సకాలంలో, సగౌరవంగా పండుగ జరిపి, అర్దేషిర్ ఇరానీని సత్కరించినవారు ఫిలిం జర్నలిస్టులు...

ప్రజానీకం నిత్యజీవిత కార్యక్రమాలలో దాదాపు అంతర్భాగం అయినట్టుగా పెనవేసుకుపోయిన చలనచిత్రాలు, ఇంతగా విస్తరించడానికి మూలకారకులూ మార్గదర్శకులు అయిన పెద్దలు పలువురు ఈనాడు మన మధ్యనే ఉండి పండుగలో పాలుపంచుకోవడం ముదావహం. వారందరికీ శుభ కాంక్షలు

## ఆదియుగం; సోదియుగం

ఈ పండుగవేళ, పండుగగదా అన్న భావంతో కాకుండా, నిర్వికారమైన మనసుతో చలనచిత్రాల కథను చదువుకుంటే, స్థూలంగా ఆదియుగమూ, కొద్ది మినహాయింపులతో సోదియుగమూ అని రెండు భాగాలు గోచరిస్తాయి.

ఆదియుగంలో అందరాని పండు అయిన శబ్దగ్రహణ సదుపాయం, ఈ రెండవ యుగంలో పోను పోను మితిమీరిపోయింది. భాష అనవసరమైన సందర్భాలలోనూ, భాషకి అందని సందర్భాలలోను కూడా మాటల్ని గుప్పించడం, పరిపాటే అయిపోయింది.

చలన చిత్రకళకి శబ్దం ఒక్క హంగే తప్ప సర్వమూ కాదన్న సత్యంమీద గురిఉంచి, ఆలోచిస్తే మూకీల యుగంలోనే చలన చిత్రకళ పరమావధి నందుకొన్నదని చెప్పకోవాలి. ఈమాటమీద గురి ఉన్న చాప్లిన్ వంటి పెద్దలందరూ, ఈనాడు టాకీలు తీస్తున్నా, మాటలను బహు పొదుపుగానే వాడుతారు తప్పవాటిలో విన్యాసాలు చేయించరు. శతఖండాలుగా అంతర్జాతీయ ఖ్యాతిగడించిన అనేక టాకీ చిత్రాలు భాష తెలియకపోయినా, యావన్మందికీ సులభంగా అర్థం అవుతాయి.



తెలుగుటాకీ చిత్రపరిశ్రమ పితామహుడు శ్రీ హెచ్. ఎం. రెడ్డి నిర్మించిన తొలి తెలుగు శబ్దచిత్రం "భక్త ప్రహ్లాద"లో లీలావతిగా నటించిన సురభి కమల.

మనదేశంలో నిర్మితమైన చిత్రాలలో కూడా 'పథేర్ పాంచాలీ' వంటివి ఈ నిజాన్ని నిరూపించాయి.

రాజ్ కపూర్ చిత్రం "జాగ్ తేరహో" లో ఈ ప్రయత్నం చెప్పుకోతగ్గ విధంగా జరిగింది.

ఇలాంటి మినహాయింపులు లెక్కలోకి తీసుకొనకుండా స్థూలంగా పరిశీలిస్తే, మాటల మీద విన్యాసాలతో, నినాదాలతో మునిగి తేలుతున్న నేటిచిత్రాల యుగాన్ని సై విధంగా అభివర్ణించడం సత్యదూరం కాదు.

## నీతిశకం; నాతిశకం

ఇక, ఈటాకీల యుగాన్ని మూడురకాల శకాలుగా భాగించవచ్చు.

నీతి శకం, నాతిశకం, గీతిశకం.

మొదటి భాగం ఏడెనిమిదేళ్ళలోను, పౌరాణిక చిత్రాలు చాలా వచ్చాయి.

క్రమేపీ సాంఘిక చిత్రాలు పుంజుకొన్నాయి. రెండవ ప్రపంచయుద్ధం ముగిసేసరికి ఇవి, వీటితోపాటు తారల గిరాకీ, ఉచ్చస్థాయిని అందుకొన్నాయి. అప్పుడే నటీనటుల పేర్లు చిత్రానికి ప్రధానాకర్షణలు అయ్యాయి. 'సెక్స్ అప్పీల్' చలన చిత్రకళకు అత్యంత ప్రధానమైంది. ఈనాతిగయుం నేటికి పూర్తి కాలేదు కాని, దీనితోపాటే ఈనాడు సంగీతానికి దాదాపు సమాన ప్రాధాన్యం లభించింది. ముఖ్యంగా బొంబాయి చిత్రసీమలో ఇది సంగీతశకం.

తెలుగు చిత్రాలకు సంబంధించినంత వరకూ, నీతి శకానికీ, నాతిశకానికీ మధ్య మరొక మహాశకం ఉంది. దాన్ని "స్వర్ణశకం అని చెప్పుకోవచ్చు. ఆకాలంలోనే, విప్లవాత్మకమైన కథలతో ఉత్తమ సాంఘిక చిత్రాలు గృహలక్ష్మి, మాలపిల్ల, రైతుబిడ్డ, సుమంగళి, వందేమాతరం, మళ్ళీపెళ్ళి, వరవిక్రయంవంటివి నిర్మించబడ్డాయి.

యుద్ధానంతర కాలంలో తయారైన సాంఘిక చిత్రాల్లో ఘనంగా గర్వంగా చెప్పుకోతగ్గవాటిని వేళ్లమీద లెక్కపెట్టవచ్చును.



మొట్టమొదటి టాకీ చిత్రం "ఆలం ఆరా" లో నాయకి భూమిక నిర్వహించిన జుబిదా. మాస్టర్ విఠల్ ఇందులో నాయకుడు. నిర్మాత ఖాన్ బహదూర్ అర్దేషిర్ ఇరానీ, టాకీ రజతోత్సవాలను పురస్కరించుకొని ఈ చిత్రాన్ని పునర్నిర్మించి ఇటీవలే విడుదల చేశారు.

## చిత్తశుద్ధి; విత్తసిద్ధి

పూర్వం, అందరూ పౌరాణికాలు తీస్తున్నపుడు సాంఘికాలు తీసినవారికీ, కొత్తదనం కోసం ప్రయత్నించినవారికీ కూడా డబ్బులంటే సరదా లేకపోలేదు. కాని, ఆ విత్తబుద్ధికి తగినంత చిత్తశుద్ధి ఉండేది. చేస్తున్నపని కేవలం వ్యాపారం కాదన్న భావానికి తావుండేది.

ఆవిధంగా చిత్తశుద్ధితో సాహసించిన వారికి విత్తసిద్ధి విషయంలో లోపం జరుగలేదు.

దేవకీబోస్, శాంతారాం, బి. ఎన్. సర్కార్, చందూలాల్ షా, జయంత్ దేశాయ్, బిమల్ రాయ్ దక్షిణాదిన బి. ఎన్. రెడ్డి, హెచ్. ఎం. రెడ్డి, స్వర్గీయగూడవల్లి రామబ్రహ్మం, వై వి. రావు ప్రభృతులు అలా ప్రయత్నాలు చేశారు.

ఈనాడు చలనచిత్ర నిర్మాతలకూ, దర్శకులకూ చలనచిత్ర కళపట్ల గౌరవం లేదని చిత్తశుద్ధి లేదని ఎవ్వరూ అనరుగాని, మొత్తం మీద, నేటి చలనచిత్ర కళపై అజ్మాయిషీ చేసేవారిలో చిత్తశుద్ధి గల వారికన్న ప్రధానంగా విత్తబుద్ధి గలవారే ఎక్కువ అని అంగీకరించక తప్పదు.

అందువల్లనే, కొంతకాలంవరకూ పెరుగుతూ వచ్చిన స్థాయి హఠాత్తుగా ఒకచోట ఆగిపోయి, పరిశ్రమ మటుకు విస్తరించడం జరుగుతుంది. ఈపరిస్థితులను చక్కదిద్ది, సవ్యమైనపంథాలో, పరిశ్రమతోపాటు, స్థాయీవృద్ధి కావడానికి కట్టుదిట్టమైన ప్రయత్నాలు చేయకపోతే, టాకీల స్వర్ణోత్సవాల వేళకూడా చెప్పుకోతగ్గ ఛలోక్తి ఒకటి సిద్ధంగా ఉంటుంది. ఛలోక్తి అనుకున్నా విమర్శ అనుకున్నా ఇంకేమనుకున్నా అనుకోవచ్చు. అది చలనచిత్ర పరిశ్రమలో ఒక ప్రముఖుని ప్రవచనం :

## శ్రవ్యకావ్యం; దృశ్యకావ్యం

షేక్స్పియర్ నాటకాలను చూడబోయినవాడు గుడ్డివాడు అయినా ఏం ఫరవాలేదు. నాటకం అంతా అర్థం చేసుకుని ఆనందించగలడు; అలాగే ఐసెన్స్టైన్ నిర్మించిన టాకీ చిత్రాలను చూడబోయినవాడికి బ్రహ్మచెముడున్నా ఏమాత్రం ఇబ్బంది ఉండదు. నిక్షేపంలా చిత్రాన్ని అర్థం చేసుకొని ఆనందించగలడు.

—జె. బి. ఎస్. హాల్డేన్.

## సాలుకు 200!

ఈమధ్య కొన్నాళ్ళ క్రితం న్యూ థియేటర్స్ వారు "[illegible]" అనే పిల్లల చిత్రం నిర్మించడం విదితమే. నిర్మాణం పూర్తి అయిన తరువాత ఒకనాడు, న్యూ థియేటర్స్ అధిపతి శ్రీ బి. ఎన్. సర్కార్ ప్రభృతులు కబుర్లు చెప్పుకుంటున్నారు.

"మనదేశంలో తయారైన మొట్టమొదటి బాల చలనచిత్రం ఇదేకదూ" అన్నారొకాయన.

"అబ్బెబ్బె, బాలచిత్రాలు మన దేశంలో సాలుకు రెండు వందలు తయారవుతున్నాయి" అన్నారు శ్రీ సర్కార్. ★

## చలన చిత్ర పరిశ్రమ ఫలాలు

ఇంతవరకూ భారత దేశంలో తయారైన చలనచిత్రాలు 5 వేల పైచిలుకు వున్నాయి. వీటిలో దక్షిణ భారతంలో నిర్మించబడినవి 1140.

1956-వ సంవత్సరాంతానికి తెలుగులో విడుదల అయిన చిత్రాలసంఖ్య 297.

అత్యధిక చిత్రాలు (31) విడుదల అయినది 1953 లోనూ, 54 లోనూ.

# ★ అగ్రతాంబూలాలు ★



"షావుకారు" ఒక మైలురాయి

విజయవారు కొత్తపద్ధతిలో రూపొందించిన ఈ చిత్రం (1950) తెలుగు చిత్రాలను కొత్తదారిన పెట్టింది. నేటి ప్రముఖ నటి జానకి తొలిచిత్రం ఇదే.

## మొట్టమొదటి టాకీ

ఇంపీరియల్ ఫిలిం కంపెనీవారి "ఆలం ఆరా" (హిందీ)-దర్శకుడు, నిర్మాత, ఛాయాగ్రాహకుడు ఖాన్‌బహదూర్ అర్దేశిర్ ఎం. ఇరానీ. జుబేదా నటించింది. ప్రస్తుతం మద్రాసులో వివిధ చిత్రాలకు ఛాయాగ్రాహకుడుగా పనిచేస్తున్న ఆది ఎం. ఇరానీ ఈ చిత్రానికి కెమెరామన్‌గా పనిచేశారు.

మొట్టమొదటి తెలుగుటాకీ కృష్ణా మువీటోన్‌వారి 'భక్త ప్రహ్లాద.' దర్శక నిర్మాత హెచ్.ఎం. రెడ్డి. సురభికమల, ఎ. సుబ్బయ్య నటించారు.

మొదటి తమిళటాకీ ఇంపీరియల్ ఫిలిం కంపెనీవారి 'కాళిదాసు.' ఇది తెలుగులోను తమిళంలోనూ కూడా తయారైంది. టి. పి. రాజలక్ష్మి నటించింది.

దక్షిణ భారతంలో తయారైన తొలి తెలుగుటాకీ వేల్ పిక్చర్స్ వారి 'సీతాకళ్యాణం' (1934) నిర్మాత పి. వి. దాస్. ఇందులో శాంతకుమారి నటించింది.

తొలి తమిళటాకీ కూడా అదే సంవత్సరంలో తయారైంది - 'శ్రీనివాస కళ్యాణం' నిర్మాత ఎ. నారాయణన్. ఆర్. బి. లక్ష్మిదేవి నటించింది.

దక్షిణాదిన తయారైన తొలి హిందీ చిత్రం 'ప్రేమసాగర్' (1939). దర్శక నిర్మాత కె. సుబ్రహ్మణ్యం.

భారతీయుడు దేశాంతరంలో నిర్మించిన తొలి ఆంగ్ల చిత్రం: 'కర్మ'. నిర్మాత హిమాంశురాయ్ (1933). నటి దేవికారాణి.

మన దేశంలో తయారైన తొలి ఆంగ్ల చిత్రం వాడియావారి "కోర్టు డాన్సర్." ఇందులో సాధనాబోస్ నటించింది.

మొట్టమొదటి వర్ణచిత్రం నిర్మించిన ఘనత, టాకీ పితామహుడు అర్దేషిర్ ఇరానీదే. ఆచిత్రంపేరు "కిసాన్‌కన్య" (1938.)

ప్రయోజనాత్మకమైన సాంఘిక చిత్రాలను తొలిసారిగా (1938) నిర్మించిన తెలుగు సంస్థలు: రోహిణీ పిక్చర్స్ (హెచ్. ఎం. రెడ్డి) - "గృహలక్ష్మి." కాంచనమాల, కన్నాంబ, నాగయ్య నటించారు. సారధీవారు (స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మం) నిర్మించిన "మాలపిల్ల". డా॥ గోవిందరాజుల సుబ్బారావు నటించారు. ఐతే తొలి సాంఘిక చిత్రంమటుకు 'ప్రేమవిజయం' (1936) నిర్మాత కృత్తివెంటి నాగేశ్వరరావు.



పేరే తిక్క-శంకరాయి...

"వాహిని" సంస్థ ఉత్తమ చిత్రాలనేకం నిర్మించి ఆంధ్రుల గౌరవాభిమానాలందుకొంది. "పెద్దమనుష్యులు" ప్రభుత్వ బహుమానంకూడా అందుకొంది. ఈ చిత్రంలో ఈ తిక్కశంకరం, ధూమిక (రేలంగి) లాంటి రకం తెలుగుచిత్రాలలో ఎక్కువ తక్కువ.



రంగారావు కిది తురాయి

"షావుకారు" చిత్రంలో రౌడీపాత్ర నిర్వహించిన రంగారావు సర్వేసర్వత్రా ప్రశంస లందుకున్నాడు.

హాస్యం ప్రధానంగా తయారైన తొలి తెలుగు చిత్రాలు: బారిష్టర్ పార్వతీశం, చదువుకున్న భార్య, బొండాంపెళ్లి (1940) ఆర్. ఎస్. పిక్చర్స వారు వీటిని నిర్మించారు. ఈ మూడూ ఒకమారే విడుదల అయ్యాయి.

విదేశీయుల కథలు ఆధారంగా. కట్టుదిట్టమైనపద్ధతిలో తయారైన హాస్యచిత్రాలు "భలేపెళ్ళి' 'తారుమారు' (1942) జగన్నాథ్ ప్రొడక్షన్స్‌వారు వీటిని నిర్మించి జంటగా విడుదల చేశారు. వీటిలో 'తారుమారు' కథకు మూలం థార్న్ స్మిత్ "టర్న్ అబౌట్" కొడవటిగంటి కుటుంబరావు ఈ కథను వ్రాశారు.

భలేపెళ్ళి కథను, మొలియర్ నాటకం ఆధారంగా పింగళి నాగేంద్రరావు వ్రాశారు. ఈ రెండిటికి దర్శకుడు జగన్నాథ్.



అన్నపూర్ణా పిక్చర్స్‌వారి సంక్రాంతికానుక "తోడికోడళ్లు" చిత్రంలో సూర్యకాంతం, రేలంగి, జగ్గయ్య, మాస్టర్ కుందు.

జంటగా విడుదల అయిన (1936) తొలి తెలుగు చిత్రాలు:— ఈస్టిండియా ఫిలిం కంపెనీవారి ధృవ, అనసూయ. (సి. పుల్లయ్య. దర్శకుడు.)

పురుషభూమిక నిర్వహించిన తొలి మహిళ కె. బి. సుందరాంబాళ్ — నందనార్ (1935). తొలిసారిగా ఒక చిత్రానికి లక్ష రూపాయలు పుచ్చుకున్న నటికూడా ఈమే. (నందనార్). మూడు లక్షలు ఖర్చుఅయిన తొలిచిత్రం "నందనార్."



18 ఏళ్ళక్రితం డైరెక్టర్ జగన్నాధ్ ఛార్లిస్మిత్ కథ ఆధారంగా 'తారుమారు' అనే ఉత్తమచిత్రం తీశారు. అందులో హీరోకి హాఠాత్తుగా ఆడారి లక్షణాలు అబ్బుతాయి. డి. హేమలత, కీ॥ శే॥ పరబ్రహ్మశాస్త్రి నటించారు.

దక్షిణ భారతంలో మొట్టమొదటి సౌండ్ రికార్డిస్టు ఒక మహిళ. ఈమె, తొలి తమిళ టాకీ 'శ్రీనివాస కల్యాణం' నిర్మాత ఎ. నారాయణన్ సతి. ఆ చిత్రానికే శబ్దగ్రహణం నిర్వహించింది.

అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో బహుమతి నందిన తొలిచిత్రం "సంత్ తుకారాం" (1937 వెనిస్). ప్రభాత్ ఫిలిం కంపెనీవారు నిర్మించారు. ఇందులో విష్ణుపంత్ పగ్నిస్ నటించాడు.

న్యూథియేటర్స్ వారి "ప్రెసిడెంట్" కూడా ఆఉత్సవంలో ప్రదర్శించబడింది.

హాలీవుడ్ వెళ్ళి చలన చిత్రకళ నభ్యసించిన తొలి ఆంధ్రుడు స్వర్గీయ ఆర్.ఎస్. ప్రకాష్. ఈయన తండ్రి స్వర్గీయ ఆర్. వెంకయ్య మద్రాసులో తొలిసారిగా చలన చిత్ర ప్రదర్శనశాలలు నిర్మించినవారు. గెయిటీ, క్రౌన్, రాక్సీ థియేటర్లను 1917 ప్రాంతాలలో ఈయన నిర్మించారు. పదేళ్ల అనంతరం స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిలిం కంపెనీ పేరిట వెంకయ్య, ప్రకాష్‌గారలు చలన చిత్ర నిర్మాణానికి పూనుకొని గజేంద్ర మోక్షం, భీష్మప్రతిజ్ఞ ప్రభృతి చిత్రాలు నిర్మించారు.

ప్రకాష్ బొంబాయిలో చాలాకాలం ఉన్నారు. ఆయన నిర్మించిన చిత్రాలు చిన్నవీ పెద్దవీ కలిపి రెండువందల వరకు ఉన్నాయి.

దేశంలోని మొట్టమొదటి టాకీ ప్రదర్శనశాల 1929లో కలకత్తాలో నెలకొన్నది. దానిపేరు ఎలిఫిన్‌స్టన్ పిక్చర్ పాలెస్.

మొట్టమొదటి డిస్ట్రిబ్యూటర్ జె. ఎఫ్. మదన్ (1907).

ఆంధ్రదేశంలో ప్రప్రథమంగా (1936) నెలకొన్న డిస్ట్రిబ్యూషన్ సంస్థ క్వాలిటీ పిక్చర్స్ (విశాఖ పట్టణం) వ్యవస్థాపకులు జి.కె. మంగరాజు. ఈసంస్థే దరిమిలా పూర్ణా పిక్చర్ పేరిట పేరు గడించుకొంది. ★



జగన్నాధ్ నిర్మించిన మరో హాస్య ప్రధాన చిత్రం "భలే పెళ్ళి." ఇదీ తారుమారు, జంట చిత్రాలుగా విడుదల అయి విజయవంతంగా సాగాయి, ఇందులో నాయకి సురభి నాగరత్నం. డా॥ శివరామకృష్ణయ్య, జయంతి గంగన్న మొదలగువారు నటించారు.

# ★ చలనచిత్రాలు: నాడూ, నేడు ★

**‘భరద్వాజుడు’**



పన్నెండేళ్ళనాడు సొహ్రాబ్ మోడీ నిర్మించిన "హసంతి"లో నసీమ్.

వాక్చిత్రాలు మనదేశంలో పుట్టి 25 సంవత్సరములైనది. "కాల చక్రమండి" అంటూంటారే అది ఈ మనపరిశ్రమలో కూడ రుజువౌతూంది. ఏలాగంటే, ఆరంభంలో నాటకాలను నాటకాలలాగే తెర మీద చిత్రాల రూపంలో చూచాము. మరల నేడు కూడా ఆలాంటి చిత్రాలనే కొన్నింటిని చూడ కలుగుచున్నాము.

చలనచిత్రాలలోకి శబ్దాన్ని ప్రవేశపెట్టినపుడే చార్లీ చాప్లిన్ అంతటి నిర్మాత, నటుడు, ఇక 'ఫిలిం టెక్నిక్ చెడిపోతుంది' అన్నాడు. మూగ చిత్రాలలో నటుడు ప్రదర్శించవలసినంతటి హావ భావములు వాక్చిత్రాలలో చూడబోము అని అతని అభిప్రాయము. ఈమాట ముమ్మాటికి నిజమైనదని మూగచిత్రాలను సహా చూచినవారికందరికి విదితమే.

ఇందుకు కారణాలు చాలా ఉన్నాయి. ముఖభావంతో ప్రేక్షకులకు తనమనసులోని అభిప్రాయాన్ని తెలిపితే చాలిన సందర్భాలలోకూడ కొన్ని డైలాగులను మాట్లాడించుట, అనవసరములు, అసంబద్ధములూ అయిన పాటలు, కథలో యిముడని హాస్యములు, "డాన్సే, లేకపోతే ఏలాగయ్యా" అంటూ ఒకటో రెండో, ఏ జాతికి చేరని, నృత్యాలను చొప్పించుట, తెరమీద చూపకపోయినా ప్రేక్షకుల కర్థమయ్యే భాగాలను సైతము చిత్రీకరించి ఫిలిము పొడుగును పెంచి "టెంపో" ను చంపుట, యిత్యాదులె కొన్ని కారణాలు.

అందుకే నోరు విప్పకుండా భావప్రకటన ద్వారా తన మనసును వెళ్ళబోసుకునే నేర్పు లేకపోయినా వాక్చిత్రాలలో ప్రముఖ నటులు కొగలుగుచున్నారు.

ఏ చిత్రంలో చూచినా ఒకేమోస్తరు కోతి చేష్టలు చేస్తూ, ఔచిత్యాన్ని మీరిన



పదేళ్ళనాటి కథ "పన్నాదాయ్" (ప్రదీప్ పిక్చర్స్)లో విలన్‌గా ఆనాటి తెరవేలుపు చంద్రమోహన్

కూతలు కూస్తూ, ఎందు జూచినా తాను నటించే పాత్రయొక్క నైజాన్ని తెలుపక తన వ్యక్తిత్వాన్నే ప్రదర్శిస్తూండే వారందరూ నటులైనారు. గ్రుడ్డి ప్రేటుగా ఏ కథా స్వారస్యము చేతనో, లేక నటుల ప్రతిభవల్లనో, లేక తనకే తెలియని ఏ కారణంవల్లనో ప్రజాదరణ పొందిన చిత్రముల దర్శకులందరు తక్షణం మేటి దర్శకులైనారు. నాలుగురాళ్ళు అందివ్వగల ప్రతి సాహుకారూ చిత్రం ఏలా తయారుచేయవలసినది దర్శకులకు నేర్పించేందుకు సాహసించగలిగాడు నేడు.

ఆదిలో పౌరాణికాలతో ప్రారంభమైంది పరిశ్రమ. పిమ్మట సాంఘికా లొచ్చాయి. పిమ్మట ముసలమ్మ కథలు, కాశీ మజిలీలు వగైరా జానపదాలన్న పేరుతో తయారైనాయి. మళ్ళీ పౌరాణికా లారంభమైనాయి. కానీ జానపదాలు సాంఘికాలు ఆగలేదు. అయితే యిప్పుడొచ్చే జానపదాలు కాని సాంఘికాలు కాని కథలలో ఏలాంటి క్రొత్తదనాన్ని చూపుటలేదు. ఏ రెండు మూడు పాత చిత్రాలలోని సంవిధానాలనో కూర్చి ఒక క్రొత్తపేరుబెట్టి తయారు చేస్తుండుట చూస్తున్నాము. ఈ జానపదాలుగాని సాంఘికాలు కాని నూతనసృష్టికి ఎంత అవకాశాన్నైనా యివ్వగలవు. కాని పాటుబడి క్రొత్త కథలను అల్లుటకు బద్ధకించి ఇతర చిత్రాల నుంచి దొంగిలించి క్రొత్త చిత్రం క్రింద బయట పెడుతున్నారు.

పరిస్థితు లిలా వున్నా దేశంలో చిత్రాలను చూచే సంఖ్య విశేషంగా పెరిగినందున ఎంత బాగుగా లేదంటున్నా చిత్రాల ఖర్చు వస్తూనే యుంది.

నిర్మాతకు చేతులు కాలిననాడు కాని ఆకులు వెతుకొక్కడు. ఇది మనువ



క్రిందటి తరంలో చలనచిత్రసీమ రాణి... దేవికారాణి రోరిక్. "ప్రేమ్‌కహానీ" అనే చిత్రంలో. మనదేశపు తొలి ఆంగ్ల చిత్రం "కర్మ" (హిమాంసురాయ్)లో ఈమె ముఖ్యభూమిక నిర్వహించింది.



'పథేర్ పాంచాలీ' ప్రభావం

భారత చలనచిత్రసీమకి గర్వకారణమైన ఈ చిత్రం ప్రపంచవ్యాప్తంగా ప్రశంస లందు కొంది. అందుకని డిటో-చిత్రాలు రావాలనికాదు గాని, చలనచిత్రకళపట్ల గౌరవం దీని ప్రభావంవల్ల ఇతోధికం కాగలదని ఆశించవచ్చు.

నైజమేగా! కనుక మన చిత్రాలు చక్కని పంథాలోనడచి లోకోపకారకంగా తయారు కావలెనంటే ప్రేక్షకులకూ ఒక పెద్దబాధ్యత వుంది. ఏలాంటి సందేశాన్ని గాని ఇవ్వజాల నట్టియు, ఏ సంస్కారాన్ని గాని చేయజాల నట్టియు, ఏ నీతినీ బోధించ జాలనట్టియు చౌకబారు చిత్రాలను ఆదరించకుండుటె ప్రేక్షకుల బాధ్యత.

దేశానికి, ప్రజానీకానికి కళ్లు విప్పి నిజాన్ని గుర్తింపచేయగల అమోఘ సందేశాల నివ్వగల శక్తి సాంఘిక చిత్రాలలో వుంది. కాని అట్టి సమస్యలను దృష్టిలో వుంచుకొని నవరసభరితంగా కథనల్లి చిత్రిస్తే ఈ పరిశ్రమ ధనార్జనకేగాక దేశోపకారకంగా కూడ ఉంటుంది. ఇప్పటికీ సంఘంలోని కుళ్లునంత వెళ్లబెట్టేందు కింకా ఎన్నో అవకాశా లున్నాయి. పైగా క్రొత్త సమస్యలు రోజూ బయలుదేరుతూనే యున్నాయి. కథావస్తువు లేకపోలేదు. యోచించి క్రొత్త కథలను వ్రాసేవారే చాలకున్నారు.

సులభంగా డబ్బు సంపాదించాలనే యోచన పరిశ్రమలలో ప్రతిఒక్కరికీ పోవాలి. కేవలం డబ్బే ప్రధానం కాకుండా దేశాభ్యున్నతికికూడ తోడయ్యే చిత్రాలను నిర్మించుకొనే ప్రతిఒక్కరి అత్యాశ మేనాడౌతుందో ఆ నాడే పరిశ్రమ ఇందలి ప్రతిఒక్కరి జీవితమూ సార్థక మనిపించుకుం టుంది. ఆ దినం శీఘ్రంగా వచ్చు గాక! ★

## జెక్ భారతదేశాల సంయుక్త నిర్మాణం

జెకొస్లావాకియా ప్రభుత్వ ఫిలింసంస్థ, భారతప్రభుత్వంకలసి, కీలుబొమ్మలతో చలన చిత్రాలు నిర్మించడానికి ఒప్పందంకుదిరింది.

ఆదిలో, కొన్ని హ్రస్వచిత్రాలను ప్రాగ్ నగరంలో జిరీ త్రికా ఆధ్వర్యాన నిర్మిస్తారు. వీటికి, భారత జానపద గాథలనుండే కథలు తీసుకుంటారు.

మరొకవంక, ఈ కీలుబొమ్మలతో చలన చిత్రాలు నిర్మించడంలో భారత టెక్నిషి యన్‌లకు జెక్ ప్రభుత్వం తరిఫీదు ఇచ్చి తోడ్పడుతుంది. ఇందునిమిత్తం, భారత సమాచార, బ్రాడ్‌కాస్టింగ్ శాఖవారు ముగ్గురు టెక్నిషియన్‌లను త్వరలోనే ఆదేశం పంపిస్తున్నారు.

* * *

రాజ్‌కపూర్ 32 వ పుట్టినరోజు పండుగ సందర్భంలో డిసెంబరు 14 న ఆర్. కె. ఫిలింస్ తొమ్మిదవ చిత్రానికి ప్రారంభోత్స వం జరిగింది. రాజ్‌కపూర్ ఈచిత్రాన్ని పూర్తిగా "సోవోకలర్"లో నిర్మిస్తున్నాడు.

నర్గీస్, అతడూ ముఖ్యభూమికలు నిర్వహి స్తారు. దర్శకత్వం రాజ్‌దే.



భాషకి అందని భావం

"జాగ్ తే రహో"లో రాజ్‌కపూర్

# చలనచిత్రగోష్ఠి పై నివేదిక



వి. ఎన్. ఫిలింస్‌వారి రామదాసులో ఎ. వి. సుబ్బారావు, లింగమూర్తి

భారత చలనచిత్ర పరిశ్రమ స్థితిగతులూ, మంచి చెడ్డలూ పరిశీలించి, అనుసరణ యోగ్యమయిన విధానాలు ఆలోచించడం కోసం అఖిలభారత నాటక అకాడమీవారు 1955 లో చలనచిత్ర పరిశ్రమపై ఒక గోష్ఠి ఏర్పాటు చేశారు. ఆ ఏడాది ఫిబ్రవరి 27 న ప్రధాని నెహ్రూ దానికి ప్రారంభోత్సవం జరిపారు.

మార్చి 4 వ తేదీవరకూ సాగిన ఆగోష్ఠిలో యావద్భారతంలోని చలనచిత్ర పరిశ్రమ ప్రతినిధులూ-వివిధ శాఖలకు చెందినవారంతా పాల్గొన్నారు.

గోష్ఠికి శ్రీ బి. యన్. సర్కార్ అధ్యక్షత వహించారు. నిర్వహణ, ఏర్పాట్లభారమంతా ఎగ్జిక్యూటివ్ డైరెక్టరుగా శ్రీమతి దేవికారాణి రోరిక్, సంయుక్త నిర్వాహకుడు శ్రీ పృథ్వీరాజ్ కపూర్ వహించారు.

గోష్ఠికి దేశదేశాల చలనచిత్ర పరిశ్రమల నుండి శుభసందేశాలు వచ్చాయి. చైనానుండి ఒక ప్రతినిధివర్గం వచ్చి పరిశీలకులహోదాలో పాల్గొన్నారు. ఇంగ్లాండ్ టెక్నికలర్ లెబారెటరీ అధిపతి కె. హెండర్‌సన్ ప్రభృతి సాంకేతిక ప్రవీణులు కొందరు అతిథులుగా వచ్చి ప్రసంగించారు.

కథ, రచన, నటన, చిత్రణ వంటి కళకు సంబంధించిన విషయాలేకాక, ఆర్థికాది సమస్యలూ, పరిశ్రమగా ఇది వర్ధిల్లడానికి ఈనాడు అంతా అనుసరిస్తున్న మార్గాలూ, వాటివల్ల ఏర్పడే సమస్యలు, అనుసరించతగు మార్గాలూ మొదలైన విషయాలన్నిటిపైనా ఆయారంగాలలో ప్రముఖులు సమగ్రమైన వ్యాసాలు వ్రాసి చదివారు. తరువాత వాటిపైన కూలంకషంగా చర్చలు జరిగాయి.

నేటి చలనచిత్ర పరిశ్రమ సమగ్ర చిత్రం ఈ గోష్ఠిలో ప్రతిబింబించింది. దాన్ని చూడగోరే వారికీ, తెలుసుకోనగోరే వారికీ, ఆ గోష్ఠిపై వెలువడిన నివేదిక అత్యంతోపయోగకారి కాగలదు. ఈ నివేదిక ప్రతి ఇటీవలనే మా కార్యాలయానికి చేరింది.

సంగీత నాటక అకాడమీ అధ్వర్యాన, శ్రీమతి దేవికారాణి ఈ నివేదిక ప్రచురణ ప్రశంసనీయంగా నిర్వహించారు. సంపాదకుడు శ్రీ ఆర్. ఎం. రే.

ఈ పుస్తకం ¼ డెమ్మీ సైజులో 300 పుటలు ఉంది. ఆర్టు పేపరుపై ఛాయాచిత్రాలూ, గోష్ఠిలో పాల్గొన్న వారి జీవిత విశేషాలు పొందుపరచిన ఒక అనుబంధం మొదలగు వాటితో ఆకర్షణీయంగా దీనిని రూపొందించారు. వెల పది రూపాయలు. ప్రాప్తిస్థానం: సంగీత నాటక అకాడమీ న్యూఢిల్లీ.



ఒక న్యాయవాది తన దగ్గిర పనిచేసే జూనియర్‌కు ఒక సలహా ఇచ్చాడు. "నీకు కేసు వివరాలు బాగాతెలిసి 'లా' ఏమీ తెలియదనుకో. కేసునుగురించే బాగా వాదించు. 'లా' బాగా తెలిసి కేసు ఏమితెలియదనుకో. కేసు సంగతి ఎత్తకుండా 'లా' పాయింట్లనేబాగా వాదించు. కేసూ, 'లా' రెండూ తెలియవనుకో. నీమాట లెవరికీ వినబడకుండా బల్ల గుద్దుతూ వాదించు."








# ప్రభుత్వపు కొత్త దిగుమతి విధానం

దిగుమతులపై భారత ప్రభుత్వపు కొత్త విధానమూ, వ్యవసాయ మంత్రుల సమావేశమూ ఢిల్లీలో ఇటీవలి విశేషాలు.

దిగుమతుల కొత్త విధానము లోగడ దిగుమతి సలహాసంఘం జరిపిన చర్చల కనుగుణంగానే ఉంది. కొత్త వాణిజ్యశాఖమంత్రి శ్రీ మురార్జీదేశాయిగారి ఈ విధానము మాజీ వాణిజ్యమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి విధానానికి విరుద్ధమైనది. శ్రీ టి. టి. కె. నిత్యావసర వస్తువుల దిగుమతులను కొద్ది కొద్దిగా అనుమతించేవారు. విదేశీ వస్తువుల స్థాయిని మనదేశపు వస్తువు లందుకునేలాగ చేయడానికి, దిగుమతి పన్ను ద్వారా రాబడి పెంచడానికీ ఆ విధానం ఉపయోగపడింది. ఇప్పుడు ఆ కొసిని దిగుమతులను కూడా ఆపివేశారు.

దిగుమతులను ఆపివేయడంవల్ల మన విదేశీద్రవ్య మారకం పరిస్థితి గడ్డుగా ఉందని బాహాటంగా ఒప్పుకున్నట్లయింది. ఈ గడ్డు పరిస్థితి ఎందువల్ల ఏర్పడింది?

దిగుమతి కంట్రోళ్లు ఏర్పాటుచేసినప్పటి నుంచీ ఆరేసి నెలల కొకసారి విదేశీ మారకం బడ్జెట్ తయారుచేస్తున్నారు. మన దిగుమతి విధానం ఈ బడ్జెట్‌మీద ఆధారపడి ఉండేది. విదేశీ ద్రవ్యం ఎంతెంత లభ్యమవుతుందో ఈ బడ్జెట్‌వల్ల తెలిసేది. విదేశీ ద్రవ్యం ఎంత లభ్యమవుతుందో తెలపడానికి రిజర్వు బ్యాంకు కూడా సహాయం చేసేది. అయినప్పటికీ విదేశీ ద్రవ్యమారకం ఇలా గడ్డుపరిస్థితిలో పడిందంటే బాధ్యత ఎవరిది? సమష్టి బాధ్యతా సిద్ధాంతంమీద పనిచేసే కేంద్ర ప్రభుత్వానిదేనని చెప్పాలి.

ఆర్థికశాఖ పనిచేయడం మానివేసిందో, లేక ఆ శాఖ సలహాలు ఎవరూ పట్టించుకోవడం లేదో తెలియడం లేదు. లేకపోతే ఈ పరిస్థితి ఎలా ఏర్పడింది? ఆర్థికశాఖ తగు జాగ్రత్తమీద ఉంటే ఈ సమస్య వచ్చేదే కాదు.

ఆర్థికశాఖ తాలూకు కంట్రోళ్లన్నిటినీ దాదాపు నాశనంచేసింది అశోకచందా నివేదికలపైవచ్చిన వివాదాలే. ప్రభుత్వంలోని ప్రతి శాఖా దేనికదే స్వతంత్రమైపోయి, ఆర్థిక

**శ్రీ కృష్ణ**
(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

శాఖనుంచి ఎంత కావాలంటే అంత కప్పం వసూలు చేయసాగింది.

ఖర్చుపెట్టే శాఖలన్నిటికీ డబ్బు సప్లయి చేయడమే ఆర్థికశాఖపనిగా పరిణమించింది. ఇది గడ్డుపరిస్థితి ఏర్పడడానికి ఒకకారణం మాత్రమే. మరొక కారణం, ఆర్థిక సమస్యల పట్ల మన మవలంబిస్తున్న సిద్ధాంత వైఖరి.

డిసెంబరు నెల కరపత్రంలో రిజర్వు బ్యాంకి, బాకీ చెల్లింపులలో ఏర్పడిన లోటును ప్రస్తావిస్తూ ఇలా తెలియజేసింది: "బట్టలమీద రాబడి నూటికి 9 వంతులు పడిపోయింది. ఎగుమతులు తగ్గడమే ఇందుకు ముఖ్యకారణం. ప్రపంచమంతటా వస్త్రాల సప్లయి పెరగడం, కొత్త పోటీదారులు వ్యాపారంలోకి ప్రవేశించడంవల్ల మన వ్యాపారానికి దెబ్బ తగిలింది. వస్త్రాల నాణ్యం, జపానువంటి ప్రధాన పోటీదేశాల ఎగుమతి విధానాలవల్ల కూడా భారతీయ వస్త్ర వ్యాపారానికి దెబ్బ తగిలింది."

1956-వ సంవత్సరమంతా భారతీయ వస్త్ర పరిశ్రమను అధునిక పద్ధతులలో నడిపించాలనే విషయంపై మాజీ వాణిజ్యమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారికీ, ఇతరులకూ వివాదాలు జరిగాయి. పైన చెప్పిన రిజర్వు బ్యాంకి కరపత్రాన్నిబట్టి శ్రీ టి. టి. కె. విధానమే సరైందని స్పష్టపడుతోంది. ఇప్పుడు శ్రీ టి. టి. కె. విదేశీ ద్రవ్య మారకంపై కంట్రోలరు. విదేశీద్రవ్యం సంపా

# ★ న్యూఢిల్లీ లేఖ ★

ధించే బాధ్యత ఆర్థికమంత్రిది కాదు. ఆయన ఎంత విదేశీ ద్రవ్యం లభ్యమైతే అంతే ఇతర శాఖలవారికి అందజేయగలరు. కొత్త దిగుమతుల విధానం ఆరునెలల్లో రూ 30 కోట్లు ఆదా చేయడానికి ఉద్దేశింపబడింది. కొత్త పరిశ్రమలను స్థాపించడానికి లైసెన్సులైతే ఉన్నాయి గాని, అందు కవసరమైన యంత్రాల దిగుమతి లైసెన్సులు మాత్రం దొరకవన్నమాట.

విదేశీ ద్రవ్య పరిస్థితి ఇలా ఉన్నది కనుక ఏ శేటా ఎప్పటికప్పుడు వార్షిక ప్రణాళికలు వేసుకునే పద్ధతి బాగానే ఉంది. వార్షిక ప్రణాళికలో ఆ సంవత్సరపు ఆర్థిక స్తోమతును బట్టే ఏ పరిశ్రమలను స్థాపించాలో, వేటిని స్థాపించనక్కరలేదో, నిర్ణయింపబడుతుంది.

1957 వ సంవత్సరపు ప్రణాళికకు వెయ్యి కోట్ల రూ. లు ఖర్చవుతుందని ఆర్థికమంత్రి మద్రాసులో మాట్లాడుతూ ప్రకటించారు. ఇందులో విదేశీ ద్రవ్యం 200 కోట్ల రూ.లు ఉంటుందట. అంటే కొన్నికొన్ని కొత్త పరిశ్రమలకు ఇంతకు మించి విదేశీ ద్రవ్యం కావలసివచ్చినా, వాటికి ధనం లభ్యం కాదన్నమాట. అవి 1958 ప్రణాళికదాకా వేచి ఉండాల్సిందే.

* * *



రాష్ట్ర వ్యవసాయ మంత్రుల సమావేశం ఇటీవల జరిగింది.

రెండవ పంచవర్ష ప్రణాళికకు ధనం సేకరించే ఉద్దేశంతో ఎక్కువ పన్నులు వేస్తున్న ఈ రోజుల్లో, వ్యవసాయశాఖ ఎన్నెన్ని సమావేశాలు జరుపుతున్నదీ, వాటి కెంతెంత ఖర్చవుతోందీ, వాటి ఫలితా లెలా ఉంటున్నాయీ అనేది ఆలోచించాలి.

వెనకటికి లిన్‌లిత్‌గో హయాంలో, ఆయన మంత్రివర్గంలోని ఒకసభ్యుడు పనిలేనప్పుడల్లా ఒక సమావేశం జరిపించేవాడు. ఈమాదిరి సమావేశాలవల్ల దైనందిన పరిపాలన కుంటుపడుతుందని ప్రజల కెలా తెలుస్తుంది?

బ్రిటిష్‌వారి రోజుల్లో ఒక సిద్ధాంతం ఉండేది. వ్యవసాయదారుడు ఎక్కువ తినడంవల్ల తిండికొరత ఏర్పడుతోందని అనేవారు. ఈ సిద్ధాంతాన్నే మొన్నటి సమావేశంలో మళ్ళీ ఉద్ఘాటించారు.

ప్లానింగ్ సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ వి.టి. కృష్ణమాచారి అదనపు ధనసహాయం అవసరం లేకుండానే వ్యవసాయోత్పత్తిని పెంచేందుకు, ధరలు తగ్గించేందుకు ఒకసూత్రం ప్రతిపాదించారు. క్రిందటి వేసవిలో ముస్సోరీలో జరిగిన వ్యవసాయ మంత్రుల సమావేశంలో మాత్రం అదనపు ధన సహాయం, ధరల పెరుగుదల ఉంటేనే గాని అధికోత్పత్తి జరగదని అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయంతో ప్లానింగ్ సంఘమూ, భారత ప్రభుత్వమూ ఏకీభవించలేదు. ఆ తరవాత ప్లానింగ్ సంఘం వివిధ రాష్ట్ర ప్రతినిధులతో మంతనాలు జరిపి, తా మిదివరకే నిర్ణయించిన ప్రమాణాలకంటె నూటికి 15 వంతులు అధికోత్పత్తి చేసేందుకు అవసరమైన ధనం కేటాయింపులను గూర్చి చర్చించింది. ఇటీవల జరిగిన వ్యవసాయ మంత్రుల సమావేశం ముస్సోరీలో మాదిరిగా అదనపు ధనసహాయం కోరలేదు. గాని ధరల పెరుగుదల విషయంలో తమ అభిప్రాయం మార్చుకోలేదు. కనీసపు ధరలను నిర్ణయించాలనిమాత్రం ఒత్తిడిచేశారు. కనీసపు ధరల నిప్పుడు నిర్ణయించివేస్తే ముందుముందు అవి తగ్గిపోయేందుకు వీలుండకుండా చేసినట్లవుతుంది. ధరలు తగ్గిపోతే ఎన్నికలలో దెబ్బ తగులుతుందని వారి వాదం.

ఆహార సమస్యలో మరొక చిత్రంకూడా ఉంది. కొన్ని ఆహారధాన్యాలు సరిగ్గా నిలవ చేయకపోవడంవల్ల ఎలుకల పాలబడి నాశనమవుతున్నాయి. ఇలా నాశనమయ్యే ధాన్యాన్ని రక్షించడానికి దేశమంతటా తగిన చర్యలు తీసుకుంటే ఆహార ధాన్యాల సప్లయి నూటికి 15 వంతుల చొప్పున పెరిగినట్లే అవుతుంది. 

#  గురితప్పిన ఉరి 

(11-వ పేజీ తరువాయి)

"సమాచార మేమైనా ?"

"నారాయణగారు మిల్లు, పదివేలరొక్కం తప్ప మిగిలినదంతా భార్యా కూతుళ్ళకి సమానంగా రాశారండి. మిల్లు కూ ఆ పదివేల రొక్కానికీ వకీలుగార్ని ట్రస్టీగా నియమించి ఐదేళ్ళలోపుగా ఆనంద్ ప్రయోజకుడైతే అతని కిమ్మని, లేకపోతే అనాథ శిశువులకు ఆశ్రమం కట్టించమనీ వ్రాశారండి. కమలాకర్ గారు నాల్గేళ్ళనుంచి మిల్లులో మేనేజరుగా వుంటున్నారుటండి. మంచి వ్యవహారదక్షుడు. మితభాషి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూంటాడుట. ఆయన హృదయంలోతు తెలుసుకోవటం చాల కష్టంటండి. నిన్న ఆయన మెయిలుకు బయలుదేరడానికి ఒక నలభై నిముషాలముందు విశాఖపట్టణం వెడుతున్నానని సెంట్రల్లో కన్పించిన కొందరు మిత్రులకి చెప్పారటండి. మెయిల్లో I-D డబ్బాలో ఒక బెర్తు రిజర్వు చేయించుకున్నారుటండి. ఆ డబ్బాలోంచి ఎవరు దిగుతారో చూడమని వాల్తేరులో మన రైల్వేసిబ్బందికి ఫోన్లో చెప్పానండి."

"సమాచార మేమైనా వచ్చిందా ?"

"వచ్చిందండి. అందులోంచి దిగినాయన మీద పోలీసు నిఘా వేశారుటండి. ఆయన వెయిటింగురూములోకెళ్ళి స్నానంచేసి పదిహేనునిముషాల్లో తనపర్సు కన్పించటం లేదని రిపోర్టిచ్చారుటండి. ఆయన పేరుకూడా కమలాకర్ టండీ. మొత్తం మీద పోలికలన్నీ మన కమలాకర్ గారికి సరిపోతున్నాయండి. ఆ పెట్లో ఇంకో ఆయనెవరో వున్నారుటండి. టి. సి. ని పంపి టికెట్ చెక్ చేయించారటండి. ఒంగోలునుండి కలకత్తా వెడుతున్నాడటండి."

"అబ్బా చాల సేకరించావే. ఆనంద్ గురించేమైనా ?"

ఇనస్పెక్టరుగారి పొగడ్తలో 408 ముఖం విప్పారింది. ఉత్సాహంగా చెప్పసాగాడు.

"ఆనంద్ మొదటి ఆట మొదలు పెట్టిన గంటలోపుగా బయటికి కారులో ఎక్కడికో వెళ్ళినట్లు సినిమా గేటువాడి సాక్ష్యం వుందండి."

"మళ్ళీ ఎప్పుడు వచ్చాడో చూశాడా?"

"లేదుటండి."

"ఊఁ."

"ఈయన చందూలాల్ దగ్గర మూడు వేలు అప్పుచేశాడటండి. ఆ సొమ్ము ఈ పూట చెల్లించకపోతే "మీ నాన్నగారికి చెపుతాను, దావా వేస్తాను" అని బెదరించాడుటండి."

"కట్టాడా ?"

"లేదండి."

"సరే, నువ్వెళ్ళు."

"మొత్తానికి గట్టివాడే నే", అన్నాడు రాజు 403 వెళ్ళగానే.

ఏమిటనుకున్నావు మా డిపార్టుమెంటంటే అన్నట్టుగా చూశాడు రమణ. ఇంతలో గడియారం గంటలు కొట్టసాగింది. 'అరె ఎనిమిదయిపోయిందే' అని ఉలిక్కిపడిలేచి రమణ రాజుకి గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయాడు.

* * * *

మర్నాడు రాజుకి ఫోన్ చేసి 'కమలాకర్ వచ్చాట్ట. నాకు కొద్దిపనివుంది. నువ్వెళ్ళి కలుసుకో," అని చెప్పాడు రమణ.

ఈయనకు 'కబురెప్పుడు వెళ్ళిందీ, ఎల్లా వచ్చాడప్పుడే' అనుకుంటూ భోజనం కానిచ్చి కారు స్టార్టు చేశాడు రాజు.

బాట కిరువైపులా అందంగా వరుసగా పాతిన రకరకాల పూలమొక్కల సౌందర్యాన్ని, మలయమందమారుతాలకు విలాసంగా, ప్రథమ గర్భిణీ చిరునవ్వులా తీవిగా తలలూపే లేగొమ్మల చివర్ల అందాన్ని తనివితీర ఆస్వాదిస్తూ, కారును మెల్లగా పోనిస్తున్నాడు రాజు. బాటకు కొద్ది దూరంలో తెరచుకునివున్న కారుషెడ్డు కన్పించింది. రెండు కార్లున్నాయి; అందులో ఒకటి నారాయణగారి కుటుంబ ముపయోగించేది; రెండోది కేసుల్లో వుపయోగించే టూసీటర్. కొత్త మోడల్ కారు మరొకటి వీధి వాకిలిలో వుంది.

రాజు హాల్లో ప్రవేశించగానే సుబ్బన్న కన్పించి, బాబు స్నానం చేస్తున్నారు, ఒక్క నిముషం కూర్చోండని లోనికి వెళ్ళాడు. రెండునిముషాల్లో కమలాకర్ వచ్చి రాజును విష్ చేసి కుర్చీలో కూచున్నాడు. 'అందగాళ్ళలో లెక్క. అందుకనే ఇందిర అంత మోజు పడుతోంది', అనుకున్నాడు రాజు మనసులో.

"సారీ! మీరు ప్రయాణ బడలికన్నా తీరకుండా వచ్చాను."

"......................"

".........అనుకోకుండా అవాంతరం రావడం, దానికితోడు మీరు వూళ్ళో లేకపోవడం......" నాన్చాడు, రాజు ఈ మూగితో ఏవిధంగా మాట్లాడాలో సరిగ్గా తెలియక.

కమలాకర్ బద్ధకంగా ఆవలించి వళ్ళు విరుచుకున్నాడు.

"సార్! మీకు బడలికంగా వున్నట్టుంది. ఇంకోసారి వస్తాలెండి." రాజు కుర్చీలోంచి లేచాడు.

"ఫరవాలేదులెండి. మీ రడగవలసినదేదో అడగండి."

"మీరు ఆఖరిసారి చూచినపుడు మీ బావగా రెలా వున్నారు?"

"చాలా కులాసాగా వున్నారండి. నే తెచ్చి ఇచ్చిన డబ్బుకూడా తీసుకున్నారు."

"ఎంత?"

"ఏడువేల ఎనిమిది వందలు."

"రసీ దేమైనా ఇచ్చారా?"

కమలాకర్ ముఖమెర్రబడింది. "నేనెంత లేనివాణ్నయినా, స్వంతబావగారి డబ్బు కాజేసేటంతటి నీతిదూరుణ్ణి కాను. నాల్గేళ్ళ నుంచి లెక్కలు నేనే చూస్తున్నాను. నేల మీద వ్యాపారం నడుపుతున్నాను. ఇంతవరకు 'దమ్మిడీ తిన్నావు నువ్వని' ఎవ్వరు నన్ను వేలెత్తి చూపినవారు లేరు."

"కోపపడకండి. ఏదో డబ్బులో పనికదా అని..."

"ముందు మీపని కానియ్యండి." కమలాకర్ కటువుగా అన్నాడు.

"మీరు వెళ్ళేముందు మీ బావగార్ని చూశారా?"

"లేదు. నే విశాఖపట్టణంలో చేయవలసినదంతా ముందే ఆయన వివరంగా తెల్పారు. ఇంకోసారి కలుసుకోనవసరం లేదు. కలుసుకుంటే ఆయనకి కోపమొస్తుందికూడాను."

"మీరు వెళ్ళేరోజున మీ బావగారెవరిమీదన్నా కోపగించారా?"

"ఇంచుమించు ఆయనకి ఎవరిమీదో ఒకరిమీద రోజూ కోపం వస్తూనే వుంటుంది. అదేగాక, ఆ రోజు జారుగంటలదాకా నే మిల్లులోనే వున్నా."

"నాల్గింటికే ఇంటికి వచ్చారని మీ అక్కగారు చెప్పారే" ఆశ్చర్యాన్నభినయిస్తూ అన్నాడు రాజు.

"ఓహో! అలా చెప్పారా? నాకు సరిగా జ్ఞాపకం లేదులెండి," అన్నాడు కమలాకర్ చిరాకుగా.

"మీ రాత్రెన్నింటికి బయలుదేరారు?"

"ఏడున్నర గంటలకు"

"మెయిలు ఎనిమిదింటికిగా? అంత పెందరాళ్ళ బయలుదేరారే?"

"ఆదరాబాదరా వెళ్ళి అందకపోతే అవస్థపడటం అలవాటు లేదు"

"స్టేషన్లో ఎరిగున్న వాళ్ళెవరైనా కన్పించారా?"

"నన్నెరిగిన రైల్వే వుద్యోగులు చాలమంది వున్నారు. ఒకరిద్దరు కన్పించి పలకరించారు కూడా."

"ఆ రోజు మెయిలరగంట ఆలస్యంగా బయలుదేరింది తెలుసా?"

# ★ గురితప్పిన ఉరి ★

"అక్కర్లేదే, టయిముకి బయల్దేరిండే," కమలాకర్ ఇరుకులో వున్నట్లు కుర్చీలో కదిలాడు.

"మీ లెక్కన హోటల్లో ఇంకెవరన్నా వున్నారా?"

"ఎవరూ లేరండి. ఒంగోలులో కొబోలు కలకత్తా వెళ్లే ఒకాయన ఎక్కాడు."

"పరిచయ మేమైనా ఏర్పడిందా?"

"రైల్వే ఫ్రెండ్ షిప్ వగైరా."

"ఆయన ఎడ్రసు?"

కమలాకర్ నోట్ బుక్ తెరిచాడు. "దీనబంధు. ఏజంట్, పీపుల్స్ నేషనల్ ఇన్సూరెన్స్. కలకత్తా."

"సరే అయితే నే వెళ్ళొస్తా; సెలవు." రాజు గుమ్మందాకా వెళ్ళి ఏదో మరచినట్లు వెనక్కి తిరిగాడు. కమలాకర్ చూపులు తూపుల్లా వెన్నంటుతున్నాయి.

"ఈతని కెంత అభిమాన మనిపించింది," అనుకున్నాడు రాజు.

"క్షమించాలి. మీ కెన్ని కార్లున్నాయి"

"రెండు. ఒకటి మా బావగారి కుటుంబానికి, రెండవది నాకు స్పెషల్."

"క్రిందటిసారి వచ్చినపుడు మీ కారు కన్పించలేదేం?"

"నా మిత్రుడొకడు తీసుకు వెళ్ళాడు."

"ఎడ్రసు?"

"దీనబంధు 287/11 పెరంబూర్."

"ఆల్ రైట్ థాంక్స్"

కారు శరవేగంగా దూసుకుపోతోంది. మైదానం, పార్కు, పరశురామా టాకీస్, పోస్టాఫీసు, పెరంబూరు స్టేషను, ఒక్కొక్కటే వేగంగా ఎవరో తోస్తూన్నట్లు వెనక్కి పరుగెత్తుతున్నాయి

'అసలు ఇంతకీ అడగదలచిన ప్రశ్న అడగనే లేదే' అని రాజు నాలిక కరుచుకున్నాడు.

* * *

పదిరోజులు గడచిపోయాయి.

"ఏంబ్రదర్ కేసు అతీ గతీ లేదు. ప్రోగ్రెస్ రిపోర్టు పంపమని రిమైండరు తయారయింది," అన్నాడు రమణ గదిలో ప్రవేశిస్తూ.

"చురుగ్గా పరిశోధన సాగిస్తున్నామని జవాబు రాయకపోయావా? మీ కలవాటేగా?" అన్నాడు రాజు నవ్వుతూ.

"నవ్వు! నవ్వు! ఎలుకకి ప్రాణసంకటం, పిల్లికి చెరలాటం."

"సరేకాని కొత్త విషయాలు?"

"కావలసినన్ని. కలకత్తాకు, వాల్తేరుకు కమలాకర్ ఫొటోలు పంపి కన్ఫర్మేషన్స్ తెప్పించాను. దీనబంధు ఆదినం కారు సాయంత్రం నాల్గుగంటలకు తీసుకున్నానని, రాత్రంతా తన దగ్గరే వుందని చెప్పాడు. ప్రక్క ఇంటివారుకూడా ప్రొద్దున్న దీనబంధుతో మాట్లాడడానికి వెళ్ళినపుడు ఆ కారక్కడ చూశామని చెప్పారు. ఆ కారు దేనికుపయోగించారు మీరని అడిగితే మాత్రం అది నీకు చెప్పవలసిన అవసరం లేదన్నాడు.

"కమలాకర్ ఇనప్పెట్టెలో ఎనిమిదివేలు పోయాయని రిపోర్టిచ్చాడు..... ..."

"పెట్టెవరు తెరిచారు?"

"కమలమ్మగారు, కమలాకర్."

"తాళా లెవరి దగ్గరుంటాయి?"

"ఒకటి నారాయణగారిదగ్గర, రెండవది కమలమ్మగారి దగ్గరట."

"నారాయణగారిదగ్గర తాళా లున్నాయా?"

"అవి హత్యజరిగిన రోజునుంచీ కనుపించటం లేదుట."

". మూడవ విశేషం ఆనంద్ చందూలాల్ బాకీ పూర్తిగా తీర్చివేశాడు. రెండు మూడు వేలు గుర్రప్పందేలకుకూడా పెట్టాడని వినికిడి. పెద్ద వడ్డీవ్యాపారస్తుల నందరినీ కలసి చూశాను. వాళ్లెవరూ ఆనంద్ అనే అతణ్ణే ఎరగమన్నారు.

ఆనంద్ ని డబ్బెక్కడిదని అడిగితే పర్సు దొరికిందన్నాడు. రెట్టించి అడిగితే నీకెందుకు పొమ్మన్నాడు.

"పర్సేమయినా పోయిందని రిపోర్టు వచ్చిందా?"

"లేదు. మూడవది, ప్రభాకరం ఫ్రండు జల్సారాయుడే కాని అంత అపాయకరమైనవాడు కాడు. ఇంతకుముందు ఒక పేకాట కేసులోను, రెండు త్రాగుడు కేసుల్లోనూ ఇరుక్కున్నాడు. మొదటిసారి వార్నింగు ఇచ్చారు. తరువాత రెండుసార్లు చెరి రెండువందలు వడ్డించారు."

ఇంతలో ప్యూన్ వచ్చి కవరు ఇచ్చాడు. ఇదేమిటి ఆహ్వానములాగుందే అనుకుంటూ రాజు తెరిచాడు.

"ఇదిగో రమణా! ఆహ్వానం. ఈపూట మనకి కమలాకర్ గొప్పగా విందుచేస్తాడు."

"ఎందుకు?"

"ఎందుకా?" రాజు టేబిలు మీద పేపరుషీట్స్ గబగబ తిరగేశాడు.

"విజయా క్రాస్ వర్డ్స్ లో కమలాకర్ కు లక్షరూపాయలు వచ్చాయి."

"ఆ మొద్దుబుఱ్ఱలో ఇంత తెలివి వుందనుకోలేదుభాయ్. ఇంతకీ కేసుగొడవేంచేశావు? ఆనంద్ ని అరెస్టుచేద్దామా?"

"తొందరపడతావేం? ముందు పార్టీ అవనియ్యి. లేకపోతే మనకి విందూలేదు; ఇంకోసారి వాళ్ళింట్లో ఆహ్వానమూ వుండదు," అన్నాడు రాజు నవ్వుతూ.

"తమ ఆదేశం శిరసావహిస్తాను."

"మంచిది."

రాజు వెళ్లేటప్పటి కింకా అతిథు లెవ్వరూ రాలేదు. హోలులో కుర్చీలు సర్దుతున్నారు. "హల్లో! కంగ్రాచులేషన్స్" అంటూ ట్వీడ్ సూటులో వెనక్కి తిరిగి వున్న వ్యక్తిచేయిపట్టి బలంగా గుంజాడు రాజు.

"ఓ! సారీ. కమలాకర్ అనుకున్నా."

ఆనంద్ హృదయమంతా విప్పి చిరునవ్వు నవ్వాడు. "పరవాలేదులెండి. నాకు ఇవ్వకూడదా షేక్ హేండ్?"

రాజు సిగ్గుపడిపోయాడు.

పార్టీ చాలా గ్రాండుగా ముగిసింది. లాటరీలో నెగ్గినది కమలాకరైనా చూసే వాళ్ళంతా ఆనంద్ ఆనందోత్సాహాలుచూసి నెగ్గినది అతనుకాదుకదా! అనుకున్నాడు. "కమలాకర్ నెగ్గితేయేం, నే నెగ్గితేయేం?" అనేటట్లుగా వుంది అతని చిరునవ్వు.

ఒంటరిగా దొరికిన సమయం చూసి, తన సందేహం బయట పెట్టాడు రాజు.

"అప్పుడంత తొందరగా ఎల్లా రాగలిగారు కమలాకర్ గారు?"

"నే సుమారయిదింటికి విశాఖపట్టణంలో మా బసకి వెళ్ళాను. ఆనందిచ్చిన టెలిగ్రామప్పటికే వచ్చివుంది. పనంతా తొందరగా పూర్తి చేసుకుని మా గెస్టు కారు తీసుకుని తొందరగా వచ్చేశాను."

"అతను కారు స్పీడ్ డ్రయివింగ్ లో ఆల్ ఇండియా చాంపియన్ తెలుసా?"

ఇద్దరూ వెనక్కి తిరిగారు. ఇందిర విశాల నయనాలు గర్వంగా చూస్తున్నాయి.

"ఓహో!"

అందరికీ గుడ్ నైట్ చెప్పి బయలుదేరాడు రాజు. అతనికి రాత్రంతా నిద్ర పట్టలా. కేసు రికార్డంతా మూడు నాల్గు సార్లు తిరగేశాడు. రైల్వేగైడు పరిశీలించాడు. బుర్రాడించాడు. పెదవులు విరిచాడు. తుదకేమీ తోచక ఎల్లా వున్న దల్లా వదలి మళ్ళీ మంచమెక్కాడు. కలత నిద్ర. ఆ నిద్రలో.

పెద్ద ఉరిస్తంభం. దానిక్రింద చిఱునవ్వు చిందులాడే ఆనందు ముఖం తెల్లగా, పాలిపోయి, ఘోరం.— ఉరిత్రాడు గురితప్పి వచ్చినదానిలా ఆనంద్ పీక చుట్టుకొంటున్నట్లుంది. రాజు భయంతో కళ్ళు మూసుకున్నాడు నిద్రలోనే.

"ఓ సారీ మీరా! కమలాకర్ అనుకున్నా!"

"ఏం నేనయితే షేకుహేండు ఇవ్వకూడదా?" అతని చిఱునవ్వు రాజుని శూలపుపోటులా బాధపెడుతోంది. ఏమిటా చిరు

# ★ అలంకరణలో పోకడలు ★

[24 వ పేజీ తరువాయి]

కుచ్చులుగా వుండేవి. దీనిపేరు బుట్టచెయ్యి. ఇంగ్లీషులో Cuff sleeve. ఇప్పటికీ చాలామంది చుట్టలుమా సేసి వాల్లడలు మొదలు పెట్టారు.

గత 20 సంవత్సరాలలో స్త్రీల అలంకరణలో ఇంత కొద్దికాలంలో ఎప్పుడూ రా న ం త వి వ రీ త వ రి ణా మ ం వచ్చింది. దీనికి కారణం పూర్వం కంటె స్త్రీలకు లభించిన స్వేఛ్ఛ కావచ్చు. అంతకు మునుపు స్త్రీలు అలంకరణ యందు "మితము మీరి" ఆసక్తి చూపిస్తే పెద్దవాళ్ళు "సానివా సంసారివా ఏమిటా వెర్రివేషా"లని కోప్పడే వారు. ఈ మాటలు యిప్పుడంతగా వినిపించవు.

అప్పుడు అలంకరణ కేవలం ప్రదర్శన కోసం: లక్ష్మీప్రదమని. ఇప్పుడు అలంకరణ సహజ సౌందర్యాన్ని యినుమడింపచేయటమే కాక సహజంగా వుండే లోపాల్ని కూడా చాలా వరకు కప్పిపుచ్చేందుకు తోడ్పడుతుందనే పరిజ్ఞానం ప్రబలంగా వున్నది. తరతమ భేదాలు లేకుండా అన్ని తరగతుల స్త్రీలకు ఒకేవిధమైన అలంకరణ. నగల వుపయోగం పూర్తిగా తగ్గిపోయింది.

## నిరాభరణా లంకరణ

ఈ రోజుల్లో, మరీ పట్నవాసాల్లో చేతులకు, చెవులకు, మెడలో ఏవిధమైన ఆభరణాలు లేని ఆడపిల్లలు ధనికులలో కూడ ఎందరో కనిపిస్తారు. కొందరు ఎరుపు, నలుపు, తెలుపు, నీలం,పచ్చరంగుల పూసలు దండలుగా గుచ్చుకుని మెడకు దగ్గరగా కట్టుకుంటారు. తల దువ్వుకోటంలో కూడా మార్పులు వచ్చాయి. విద్యార్థినులలో చాలా వరకు రెండు జడలూ , పట్నవాసాల్లో Bobbed Hair కూడా పరిపాటిఅయాయి.

చీరెలు రకరకాల Artificial silks చాలా చౌకగా దొరుకుతాయి. ఇవి బహు తళ్ళుగా నుండి "చీర కట్టుకొనుట సిగ్గుకా శృంగారమునకా" అనే సందేహాన్ని కలిగి కున్నాయి. జాకెట్లు కూడా High neck, Closed neck వంటి మార్పులతో, మోచేతికీ మణికట్టుకీ మధ్యభాగానికి వుండే చేతులతో చోళీలుగా రూపొందాయి. ఈ చోళీలలో లేటెస్టుఫాషన్ నర్రిస్ నెక్ చోళీ. ఇది సాతూతూ మెడక త్రిరింపులేని మన అమ్మమ్మ వేసుకునేరవికె! ఇక నిత్యావసరాల్లో ముఖ్యమైనది ఫేస్ పౌడరు. పనిచేసే పిల్లగూడా ఏదో చౌకరకపు పౌడరు రాసుకోకమానదు.

ఇవన్నీ కాక అన్ని కాలాలలో స్త్రీల అలంకరణలలో భాగంగా వున్నవి పువ్వులు బొట్టు.

## దారుణ పరిణామం

ఆదిమజాతి స్త్రీలు కూడా అడవి పువ్వులు తలలో తురుముకు నేవారు. తరువాతి కాలంలో మల్లి, జాజి, గులాబిల వంటి సుగంధ పుష్పాలు వాడుకలోకొచ్చాయి. కావ్యనాయికలు శకుంతలవంటివారు పుష్పాభరణములే ధరించి వనదేవత రూపొందిన ట్లుండేవారు. లోహపు నగలు అమలులోకి వచ్చిన తరువాత పుష్పాల ఉపయోగం శిరోజాలకి మాత్రం పరిమితమైంది. మొన్న మొన్నటివరకూ అందరూ పువ్వుల్ని పెట్టుకునేవారు.

కాని ఫాషన్లయొక్క దారుణపరిణామం ఈమధ్యనే బజార్లలో ప్రత్యక్షమైంది వాడని పూవుల రూపంలో. ఇవే ప్లాస్టిక్ పూవులు. ఇవి వాడవు. కాని ప్రకృతిలో వుండే సహజసౌందర్యం, మార్దవం, పుష్పంలోని లాలిత్యం సువాసన వీటిలో మచ్చుకైనా కనిపించవు. తలలో పెట్టుకుంటే అలంకరణ మరీ కృత్రిమంగా వుంటుంది.

## అదీ ఓ ముచ్చటే!

ఇలాగే బొట్టుకూడా. అమ్మమ్మ రూపాయికాసంత కుంకుమ పెట్టుకుంటే అమ్మ దమ్మిడీ అంతే పెట్టుకుంటుంది. తరువాత మరీ అవగింజంతైంది. ఆ రోజుల్లో బొట్టు సుమంగళీ చిహ్నం. ఇప్పుడు అలంకరణలో భాగం! కొన్నాళ్లకి కుంకుమకు బదులు ఎర్రని తిలకము, నల్లని చాదు వచ్చాయి. నక్షత్రంలాగా, దోసగింజలాగ, ఇలా రకరకాల అచ్చులు కూడా (బొట్టు పెట్టుకునేందుకు) బజార్లోకివచ్చాయిఆమధ్య. ఇప్పటి ఫాషన్ ప్లాస్టిక్ బొట్టు. ఇది అన్ని రకాలలో, రంగులలో, ఆకారాలలో దొరుకుతుంది. చీరకు, చోళీకి మాచ్ అయే బొట్టు కూడా పెట్టుకోవచ్చు. బొట్టు పెట్టుకోని వారు కూడా కొందరున్నారు. ఇది కూడ అలంకారానికే!

పూర్వం కళ్లకు కాటుక తప్పక పెట్టుకునేవారు. ఈ మధ్య కొన్నాళ్లు లేక పోయినా, మళ్లీ ఇప్పుడు ఫాషనైంది. పూర్వపు గోరింటాకుస్థానే యిపుడు గోళ్లకి రంగు (Nail polish) వచ్చింది. ఇవేకాక రూజ్ (బుగ్గలకి రంగు)లిప్‌స్టిక్ (Lipstick) వంటి సాధనాలు యింకెన్నో వున్నాయి.

మన అలంకరణ పద్ధతులు, ఫాషన్లు ఇతర నాగరికతల ప్రభావంవల్ల, మన శాస్త్రవిజ్ఞానాభివృద్ధివల్ల ఎంతో వృద్ధిపొందుతున్నాయి. ఉదాహరణకి: గోళ్లరంగులు, పెదవులకు, బుగ్గలకు రంగులు రసాయన శాస్త్ర పరిశోధనల ఫలితంగా ఏర్పడినవే. అలాగే జుట్టు నొక్కులు నొక్కులుగా (Curly) విద్యుచ్ఛక్తి సహాయంతో (Electrify) చెయించుకోవచ్చు. ఇంతే కాక వంటా వార్పూ చూసుకునే స్త్రీలు కూడా వంటచేసినందువలన చేతులు గోళ్లు మొద్దుబారకుండా పటకారు, చిమటావంటి సాధనాలున్నాయి. గోళ్లు చక్కగా పెంచుకుని రంగువేసుకుంటే అందంగా ఆకర్షణీయంగా వుంటుంది.

## మంచికో చెడ్డకో

మన ఫాషన్లు ఎంతత్వరగా మారినా ఇతర దేశాల స్త్రీలతో పోలిస్తే మనం వెనుకబడే వున్నామని చెప్పాలి. ముఖ్యంగా ఫ్రాన్సులో ఫాషన్లు అతిత్వరగా మారుతాయిట. దీనికి ఉదాహరణగా ఒక కథ చెప్తారు. ఒక ఫ్రెంచిమహిళ చేతులో గౌను పట్టుకుని యించుమించు పరిగెత్తుతూ వెళ్తున్నదట. దారిలో ఒక స్నేహితురాలు కనిపించి తొందరకు కారణమేమిటని ప్రశ్నిస్తే "ఈ కొత్త ఫాషన్ గౌను యిప్పుడే కుట్టించుకుని వస్తున్నాను. ఈ ఫాషను మారిపోయేలోపల యింటికివెళ్లి దీనిని ధరించాలి" అన్నదట!

మొత్తంమీద ఆధునిక యువతి అలంకరణ ప్రాక్పశ్చిమాల పాత క్రొత్త నాగరికతల కలయికతో ఆకర్షణీయంగానే వుంది. ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

నవ్వు. దానిముందు తానెందుకు ఓడించుకు పోతున్నాడు?

రాజు ఉలిక్కిపడి లేచాడు. సూర్యకిరణాలు కిటికీలోంచి తొంగిచూస్తున్నాయి. కాఫీ త్రాగి ఏం తోచక జూలియస్ సీజరు తీశాడు. పదిహేను నిముషాల్లో మూసేసి మళ్ళీ ఆలోచించ సాగినాడు.

—చిరునవ్వు. ఏమిటా చిరునవ్వులో అంతర్లీనమైన అర్థం?—అతని ముఖం చాటంతయింది. లేచి ఫోన్ తీశాడు.

"హల్లో!" అవతల గొంతు పిలుస్తోంది.

"..............."

"ఆ ఏమిటీ?"

"..............."

"సరే అల్లాగే చేస్తా. కానీ ఇదంతా గారడీగా వుంది. నువ్వు నాల్గింటిదాకా రావద్దన్నా వచ్చి నీకు నిద్రాభంగం కలుగ జేస్తానేమో!"

రాజు టెలిఫోన్ క్రింద పెట్టాడు.

* * *

బూట్ల టకటకతో అతనికి మెలకువ వచ్చింది. "అప్పుడే వచ్చావు నువ్వు? సరే కూర్చో. ఇప్పుడే వస్తా." ముఖం కడుక్కుని చిన్న టవలుతో తుడుచుకుంటూ వచ్చి "అరె నాల్గు దాటిందే!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

రమణ కుర్చీలోంచి లేచి రెండడుగులు ముందుకు వేశాడు.

"ఒక్క క్షణమాగు. ఇడ్లీ, ఉప్మా, పెసరట్........"

"చాలింక. ఇదేమన్నా కాఫీహోటలా"?

"ఈరోజు స్పెషల్."

"అమ్మబాబో, అన్నీ తింటే నువ్వు చెప్పేది వినడానికి చోటుండదు."

ఫోను గణగణమోగింది. రాజు రిసీవ రందుకున్నాడు.

"ఎవరు ?"

"కమలమ్మగారు."

"ఏమంటారు ?"

"ఆకలుడిగాయి కనుక, నీ ఎరికనేమైనా మంచిసంబంధముంటే చూడమంటారు."

"బాబ్బాబూ నన్ను మరచిపోకయితే, కమనీయకాంతా కనకాలు. ఇంకా బ్రహ్మచారిగాణ్ణి."

"తనకుమాలిన ధర్మమూ ?" ఇద్దరూ పగలబడి నవ్వారు. వంటవాడు, రాజు చదివిన లిష్టంతా టేబిలుమీద పరిచాడు.

"నాకు కాఫీచాలు."

"కంగారు పడతావే? దొరికిందే ఛాన్సని పట్టకపోతే కడుపులో చాలా కాలీ వుంటుంది."

రాజు నవ్వుతూ మొదలు పెట్టాడు. "నువ్వు షేక్స్పియరు చదివావూ?"

"లేదు. ఏం?"

"అయితే కంఠతాపట్టు. మంచిప్రయోజనముంటుంది."

"అసలుసంగతి చెప్పక ఈడొంక తిరుగుడంతా ఏమిటి."

"చెప్పబోయేదానికి నాంది. హృదయం విప్పి చిఱునవ్వు నవ్వలేని వానిహృదయంలోశాంతివుండదు. అగ్నిపర్వతాలురగులుతూంటాయి. ఎప్పుడూ తీవ్రంగా ఏదో కొంప మునిగిపోతూన్నట్లాలోచించే వాడి హృదయంలో సైతాను తిష్ట వేసుకుని వుంటాడు, వాడు చాల అపాయకారి....."

"ఇది ప్రస్తావన అనుకుంటాను. పూర్తయిందా?"

"నా ధోరణి కద్దురాకు. వాళ్ళని చూసి మనం మోసపోతాం. జాలి దలుస్తాం. పెద్ద వేదాం తనుకుంటాము. కమలాకర్ స్టేషనికి కావలసినంత ముందుగా వెళ్ళి అనూహ్యమైన ఎలిబీ కల్పించుకున్నాడు. దాన్నింకా బలీయం జేసుకోడానికి వాల్తేరు స్టేషనులో పోలీసు రిపోర్టిచ్చాడు. మెయిలుకు అర్ధగంట ముందు బయలుదేరే లోకల్ ట్రెయినులో ఎక్కి పెరంబూర్లో దిగి టాకీసుకు వెళ్ళాడు.

"మరి రైల్లో వెళ్ళింది?"

"అతని మిత్రుడు."

"మనకొచ్చిన కన్‌ఫర్మేషన్స్?"

"అక్కడికే వస్తున్న. టాకీసులో పది పదిహేను నిముషాలు కూర్చుని బయటికి వచ్చాడు. ముందే జాగ్రత్తపడి సంపాయించుకున్న యిగ్నిషన్ (Ignition) కీతో కారు స్టార్టుచేసాడు. నే మోసపోయినట్లుగా నే సినిమాహాలు గేటువాడు, గూర్ఖాకూడా పప్పులో కాలేసారు. ఎవరూ చూడకుండా గబగబా యింట్లో ప్రవేశించి ఆఫీసుగది ద్వారంగుండా బావగారిగదిలో ప్రవేశించి విషంకలిపి మళ్ళీ కారులో టాకీసుకు తిరిగి వెళ్ళాడు. కారక్కడ వదిలేసి మిత్రునింటికి బయలుదేరి టూసీటర్ స్టార్టు చేశాడు. బిట్రగుంటలో మెయిలెక్కాడు. అతని మిత్రుడు కారెక్కాడు."

"ఇంత ఆలస్యమయినాక నా"

"ఎంతా? ఎల్లాలేదన్నా మెయిలు బయలుదేరడానికి పదిహేను నిముషాలన్నా పెరంబూర్ లో ముందుదిగుతాడు. ఇకనంతా గంటలోపు పనేగా. ఆలిండియా మోటారు కారు స్పీడ్ ఛాంపియన్ నూటముప్ఫై మైళ్ళు నాల్గున్నరగంటలు ప్రయాణం చేసే మెయిలును గంట ఆలస్యంగా బయలుదేరి అందుకోవడం ఆశ్చర్యంకాదు. ఒంగోలు లోపుగా అంటే బహుశా బిట్రగుంటలో మెయిలెక్కి వుండాలి.

"నారాయణగారు ఆనంద్ పై బాగా కోపగించి నట్లతనికి తెలుసు. అతనిపై సులభంగా హత్యానేరం తోసెయ్యవచ్చునుకున్నాడు. ఇంచుమించు త్రోసేవాడే కూడా. మనం ఆనందును అరెస్టుచేయ సంకోచిస్తున్నామని అక్కగారికి దొంగరేఖలు చూపి మభ్యపుచ్చి యినుపపెట్టెలో డబ్బు పోయింది, అది హంతకుడే కాజేసి ఉండాలని మనకు నమ్మిక కలిగించాడు. దానితో ఆనంద్ మీద అభియోగం స్థిరపడింది. కాని ఆనంద్ చిఱునవ్వు నన్ను చీకాకు పెట్టింది. హంతకుడంత నిష్కల్మషంగా ఆహ్లాదకరంగా నవ్వగలడా?"

"ఇంతకీ చిఱునవ్వు నీకు నిజం తెలిపిందంటావు?"

రాజు మృదుమధురంగా నవ్వాడు; "అంతేకాదు. తూపుల్లాంటి చూపుల అంతరార్థ మేమిటా అని ఆలోచించాను. "మెయిలర్థగంట లేటుగా బయలు దేరిందికదూ?" అంటే అతను పడ్డ తికమక గమనించాను. ఆరింటిదాకా మిల్లులోనే వున్నానన్న అబద్ధాన్ని అతని నోటనే సవరింప జేశాను. కానీ యిన్నాళ్లూ నన్ను వేధించిన సమస్య— కంచుకోటలాంటి ఎలిబీ — అది భేదించటమెల్లాగా అని. ఇందులో కొంత సైకాలజీ వుపయోగించింది. నా అనుమానాలు నిరాధారాలు కావని నిరూపించింది. ఇంక ఋజువులకోసం ప్రయత్నించు".

"అప్పుడే ఏమయింది! అసలు కమలాకర్ హత్య జేయటంలో అతని ఉద్దేశం?"

"నువ్వు ఒకసారన్నదే కమనీయకాంతా కనకాలు. ఈ విషయంకూడా యిన్నాళ్లూ నా బుర్రలో కెలుకుతూనే వుంది."

"అది ఎల్లాగయినా అతనికే దక్కవిగా?"

"ఏం చెప్పగలం ? Frailty thy name is woman. రేపు నీ చాకచక్యం చూసి యిందిర నిన్నే వరించవచ్చు. అసలు నారాయణగార్కి యిందిర అతన్ని వివాహమాడడం యిష్టం లేదు. ముందే జాగ్రత్తపడితే మంచిదనుకున్నాడు."

"Well said Well said" అంటూ తప్పట్లుకొట్టేసు అప్పుడే గదిలో ప్రవేశించి చివరి రెండు ముక్కలూ విన్న ఆనంద్.

"వెంకయ్యా! కాఫీ పట్టారమణయ్యగారి ...రమణ రాజుని మింగేసేటట్లు చూశాడు.

మీరన్నీ ఖాళీచేసి నాకు కాఫీ పోయిస్తారా?"

ముగ్గురూ పక పకా నవ్వారు. ★

## అందమైన స్పోర్ట్ షర్టులకు బిన్నీవారి కాట్స్‌వూల్ వాడండి

బిన్నీవారి దివ్యమైన కాట్స్‌వూల్‌తో తయారైన చొక్కాలు ధరిస్తే మీరు అందముగ ఉంటారు. కాట్స్‌వూల్ వూలు మరియు నూలుల మిశ్రమమగు తేలికైన బట్ట. తొడుగుకొనుటకు మెత్తగా, సౌఖ్యముగ ఉండే కాట్స్‌వూల్ దుస్తులతో మీరు ఏ శీతోష్ణస్థితిలోనైనా హాయిగా ఉంటారు.

కాట్స్‌వూల్ ఆశ్చర్యకరముగ దీర్ఘకాలము మన్నుట మరియు అన్ని విధముల లాభకరముగ ఉండుట మీరు చూస్తారు దీనిని యింటివద్ద ఉతుకుకోవచ్చును — అది క్రుంగకుండా ఉంటుందని గ్యారంటీ చేయబడినది కాట్స్‌వూల్‌లో ఎన్నుకొనుటకు 100 పైగా ఆకర్షణీయమైన రంగులు, చెక్కు గుడ్డలు కలవు. నేడే వానిని మీ బట్టల దుకాణములో చూడండి!

**శీతాకాలము వాడే దుస్తులకు**

**బిన్నీవారి అంగోలా దివ్యమైనది**

ఈ నాణ్యమైన వూలు, నూలు, కలిపి దిట్టముగా నేసిన బట్ట, శీతాకాలములో వాడుటకు దివ్యంగా ఉంటుంది. కన్నుల పండుగ కలిగించే అనేక రంగులనుండి ఎన్నుకొనండి.

| | |
|---|---|
| ఏక రంగు రకములు 29/30" ఒక గజమునకు | రు 3/10 |
| జరీ అంచు దారలు 29/30" ఒక గజమునకు | రు. 3/10 |
| ఏక రంగు రకములు 35/36" ఒక గజమునకు | రు. 4/5 |
| అద్దకములు 29/30" ఒక గజమునకు | రు 4/4 |
| చెక్కు గుడ్డలు 29/30" ఒక గజమునకు | రు. 4/1 |

అమ్మకపు పన్ను అదనము



బెంగుళూరు వులెన్, కాటన్ అండ్ సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

ఏజెంట్సు, సెక్రటరీస్ & ట్రెజరర్సు బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

